శ్రీ

# భాగవతకథ

( శ్రీ మద్భాగవత దర్శనము )

హిందీ మూలము

## శ్రీగంగా ప్రభుదత్త బ్రహ్మచారి మహరాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

## శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ మత్తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సాహాయ్యముతో ముద్రింపఁబడినది.


## శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

తృతీయ ముద్రణము

2000 ప్రతులు

1985



వెల రూ॥ 5

ప్రతులు లభించుచోటు

దివాకర్ల పబ్లికేషన్సు

శంకరమఠము

నల్లకుంట

హైదరాబాదు - 500 044.

# తొలిపలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞానమతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింపవలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్ష ప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీమద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిక్షిప్తములైన ధర్మ నీతి తత్త్వములను జిజ్ఞాసువు లందఱికిని సుబోధ మొనరించును. పదు

నెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా, అను విషయమున పండితులలో వివాదమున్నది. కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందు చేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైనఁ దమ్మిచూలి కైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీ మద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారములును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భగవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడినది. మత్స్య కూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వ

హించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాదివృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతి పాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే, పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానము లన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేద నుటకు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేక చూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁ జాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగర తరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగ వతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పి యుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భగవతమును మహాభక్తుడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యా త్మకముగా తెలుఁగున కనువదించెను. అతఁడు రచించిన భాగవ తము నందలి కొన్ని భాగములే కారణమ చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను

వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నా న్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్న మొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁగలవా రిప్పుడెందరో యుందరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించియుండిరి. అది హిందీ బాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తి ప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణుఁడైన పోత

రాజాంధ్రీకరించుటవలన నాంధ్రలోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము జరిగినది. ఆ గ్రంథ మునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు సార్థకము. అది రెండు సార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొక రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమైన యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్ష భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోప కారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడా శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింప, బడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

- సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్మ మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్మ మహాఫలమ్మ విమల
వ్యాసాలవాలమ్మనై
వెలయన్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

- శ్రీమదాంధ్ర మహాభాగవతము

—

# విషయసూచిక

# భా గ వ త క థ



## ప్రహ్లాదుఁడు



రెండవ భాగము

## భగవద్భక్తియే జీవునకుఁ బ్రధాన కర్తవ్యము



శ్లో॥ తతో విదూరాత్పరిహృత్య దైత్యా
దైత్యేషు సంగ విషయాత్మకేషు ।
ఉపేత నారాయణమాది దేవమ్,
సముక్త సంగైరషతోఽప వర్గః॥
(శ్రీభాగ. ౭ స్కం ౫ అ. ౧౮ శ్లో.)

ఆ. విషయసక్తులైన విబుధాహితులతోడి
మనికి వలదు ముక్తి మార్గవాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త
సంగజనులఁగూడి శైశవమున.

....శ్రీ మదాంధ్ర భాగవతము.

ఇంతవఱకు ప్రపంచములో విషయసేవన మొనర్చిన వారొకరును దీనివలన సంతుష్టినిఁ జెందినవారు లేరు. భోగ సామగ్రి పెరిగిన కొలఁది భోగతృష్ణయును బెరుగును. ఇంద్రి యములు విషయోప భోగమునకు యోగ్యములుకాకున్నను మనస్సున లాలసయుండనే యుండును. మనస్సు సదా దానిలో వానియందే లగ్నమగును. ఎంతటి గొప్ప ధనవంతుఁడైనప్పటి కిని వానికిని విషయ తృష్ణ యుండనే యుండును. విశ్వవిజ యుఁడగు హిరణ్యకశిపుఁడును, లోకరావణుఁడగు, రావణుడును నింకను బలశాలురగు దానవ దైత్య వీరులును గలరు. వీరంద ఱకే వస్తువునుగొదువలేదు. అందఱునందఱను జయించఁగలిగిన శూరవీరులు, ప్రపంచములోని సమస్త పదార్థములు వారికి ప్రాప్తించినవి. దేవ, యక్ష, గంధర్వులను వారు జయించిరి.కాని ఒక్క మనస్సును జయింపఁజాలక పోవుటవలన వారు విషయ ములకు దాసులైరి. దీనికి విపరీతముగ నేమియును లేనివాఁడు. సర్వథా నిష్కించనుడై యుండియు హృదయమున భగవ ద్భక్తి కలిగియుండెనా, ఆతని కడ సమస్తమున్నట్లే, అన్ని యును బొందినవాఁడే జీవితమును సఫలముచేసికొనినట్లే, మానవదేహమును బొందినందులకుఁ బ్రయోజనమును బొంది నట్లే, భగవద్భక్తి నొనర్చి స్వయముగఁ దరించి, తన చరిత్ర రూపమగు నాదర్శమును వెనుక వదలిపోవును. ఆ జీవితమును జూచుకొని జీవులందఱకు స్వస్వరూపబోధకలుగఁగలదు. పరమ భాగవతోత్తముఁడగు బ్రహ్లాదుఁడు దైత్యవంశమున

నవతరించినప్పటికిని తన భగవద్భక్తి కారణమున భగవంతుని వలెఁ బూజనీయుఁడును వందనీయుఁడును, బుణ్యశ్లోకుఁడు నయ్యెను ఇది యంతయును భగవతీభక్తి మహారాణి యొక్క ప్రభావమే.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:- "రాజా! మహాభాగవతుఁడగు ప్రహ్లాదుఁడు సురబాలకుల కుపదేశించు నప్పుడు వారందఱును దదేకదృష్టితో మిక్కిలి శ్రద్ధగా నాతని వాక్యములను వినుచుండెను. ఆతఁడు గృహస్థాశ్రమస్థుల దుర్ద శనుగూర్చి వర్ణించినపుడు వారిలో నొకఁడిట్లనెను :- "కుమారా! గృహాసక్తి నింతగా నిందించెదవేల ? పరివారమును బోషింప కున్న నింకఁ జేయున దేమున్నది ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "నేను పరివార సంరక్షణమును గాదనుటలేదు. వారిమీఁద నాసక్తినిఁ బెంచుకొనవలదనియు, వారినిఁగూడ భగవత్స్వరూపులుగ భావింపవలసినదనియు జెప్పుచున్నాను. కర్తవ్యబుద్ధితో భగవత్సేవయని భావించుచుఁ గర్మ లొనర్పవలయును. మీరే ఆలోచించుకొనుడు. తల్లి దండ్రులయందెంతో ఆసక్తియుండును పిల్లవాఁడు తల్లిదండ్రు లను వదలి యెచ్చటకునుఁ బో గోరఁడు. కొంచెము దూర మయ్యెనా విలపించును. కొంచెము పెద్దైన తరువాత నాయా శక్తి పత్నిమీఁదకుఁబోవును. ఆమె యెల్లప్పుడును తన దగ్గఱనే కూర్చుండవలయునని యుండును. డబ్బులోఁచెట్టుకొని, మెడలోఁ

గట్టుకొని, కన్నులలో దాఁచుకొనవలయునని యుండును. తరువాతఁ బిల్లలు పుట్టఁగానే మోహమమకారములు వారియందుండును. ఈ విధముగ నీమానవుఁడు కామినికి దాసుఁడగును. ఆమె విహారమునకుఁ గ్రీడామృగమగును. ఆమె సంకేతమున నాడుచుండును. సంతతి యను సంకెళ్లాతని కాళ్ళకుఁబడును. అన్ని విషయములందును దీనుఁడగును. ఈ విధముగఁ బరివార మందాసక్తినిఁ జెందినవాఁడు తన యాత్మోద్ధారమును గూర్చి యే విధముగనైనఁ యెన్నడైన బ్రయత్న మొనర్చునా ? అట్లు చేయలేఁడు చేయఁడని నేను గట్టిగాఁ జెప్పఁగలను."

దైత్యకుమారు నిట్లనిరి :- "అయితే యేమి చేయవలయును ?"

ప్రహ్లాదుఁ డిట్లనెను :- "ప్రధానకర్తవ్యమొక్కటే చేయవలయును. అది దేవుఁడగు వాసుదేవ భగవానుని శరణువేఁడవలయును, వారే జీవునకు సహజ సుహృదులు. వారే పరాగతి. వారే సాధు పురుషులు వారే మోక్షప్రదులు. ఆతనిని శరణువేఁడుటచే సమస్త దుఃఖదురిత తాపసంతాపములు వీడిపోవును. కావున విషయాసక్తుల సంగమును సర్వదా త్యజించి సర్వాత్ముఁడగు శ్రీహరిసేవ మొనర్పుడు. ఆతనినే తమ సర్వస్వముగ భావింపవలెను."

దైత్యబాలకు లిట్లనిరి :- "అయ్యా ! భగవంతునిఁ బ్రసన్ను నొనర్చుట చాల కఠినకార్యము. ఆతనిని సేవించువారరుదుగ నుందురు."

ఇది విని నవ్వుచుఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా! భగవంతుని బ్రసన్ను నొనర్చుటలోఁ బ్రయాసయేమున్నది ? భిన్న స్వభావుఁడుగను నన్యుఁడుగను నున్నవాఁడైన నాతనిఁ బ్రసన్నుని నొనర్చుకొనుటలోఁ గఠినతయుండును. తన యాత్మయేయగు వాఁడును బ్రేమస్వరూపుఁడైనవాఁడును బ్రాణి మాత్రునకు సహజ సుహృదుఁడును, నట్టి ఆత్మరూపుఁడగు నచ్యుతుఁడు తానే అనుకూలుఁడగును. కేవల మనుభూతి కావ లసి యున్నది. ఆతనిని వెదకుట కెచ్చటికో పోనవసరము లేదు. ఆతఁడు ఘట ఘటము సమానరూపముగ వ్యాపించి నాఁడు.

అంత నసుర బాలకు లిట్లనిరి:- "పదార్థము లనేకములు. భగవంతుఁడొక్కఁడే, ఈ అన్నిటిలో నాతఁ డెట్లుండఁగలఁడు ? గుణముల సామ్యావస్థయే ప్రకృతి, ఆ ప్రకృతియందు గుణ వైషమ్యము కలిగినప్పుడు మహత్తత్వముద్భవించును. తర్వాత అహంతత్వము. అదియును సాత్వికరాజస తామస భేదముచే మూఁడు రూపములుగ నుండును. వీనినుండియే పంచమహా భూతములు, దశేంద్రియములు, మనస్సు మొదలగునవి యుత్పత్తి అయినవి. పృథివీ, జలము, తేజము, వాయువు, అకాశమను నీపంచభూతములచే ఘట, పట, వృక్ష, లతాది సమస్త పదార్థము లుత్పన్నములైనవి. ఈ యన్నిటిలో భగ వంతుఁ డెట్లుండును ?

అంతనవ్వుచుఁ బ్రహ్లాదుఁడిట్లనెను:- "బాల యన్ననేమి? బ్రహ్మాది స్థావరపర్యంతము సమస్త స్థావరజంగమ పదార్థము లందా శ్రీహరియే అనుస్యూయతముగ నున్నాఁడు కంకణ, హార, అంగుళీయ కాది బృహదల్పాది పదార్థములందు సువర్ణము సమాన రూపమున వ్యాపించియున్నది. నానా నామరూపములను ధరించినప్పటికిని నవి ఆభూషణములలోని సువర్ణము నెట్లు వేఱుచేయఁజాలవో అదే విధముగ ప్రపంచములోని యే పదార్థమునుండియు నా శ్రీహరి వేఱుజేయఁబడఁడు. సూత్రము లేక మాలయెట్లు నిలువఁజాలదో అట్లే శ్రీహరి లేని జగత్తే లేదు.

దైత్య బాలకులిట్లనిరి :- "ఆతని రూపమును వర్ణింపుము. ఆతని యథార్థ మహిమమును వర్ణింపుము.

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ఆతని కొక్క రూపముండినఁ జెప్పవచ్చును. అన్నియు నాతని రూపములే. అయ్యు. నాతఁడ రూపుఁడు, ఏది చెప్పినను నాతనిఁ గూర్చి చెప్పినట్లే యగును. అయినను నాతని యథార్థ నిర్వచనము చేయఁబడఁ జాలదు. ఆతఁడ నిర్వచనీయుఁడు, ఆతఁడంతర్యామి. ఆతని నూహింపఁ జాలము. అందువలన నాతని నవికల్పితుఁడందురు. ఆతఁడు దృష్టరూపముచే వ్యాపకుఁడుగను, ననాత్ముఁడుగను దృశ్య రూపముచే వ్యాప్యముగను బిలువఁబడుచున్నాఁడు. వాస్తవమున నాతనియందు వ్యాప్య వ్యాపకభావములు కేవలము కల్పితములే ఆతఁడు సత్యస్వరూపుఁడు, జ్ఞాతస్వరూపుఁడు ఆనంద

స్వరూపుఁడు, ఆత్మస్వరూపుఁడు, ఆ మహామహిముఁడగు సర్వే శ్వరుని ఐశ్వర్యము గుణమయ సృష్టినొనర్చు మాయచే నాచ్ఛా దింపఁబడినది. మాయావరణము తొలిఁగెనా ఆతని దర్శనము కాఁగలదు. ఆతఁడామాయ ముసుఁగున తన ముఖమును దాఁచు కొనియున్నాఁడు. ముసుఁగు తొలిఁగెనా ఆతని మనోహర మోహన ముఖము కనఁబడును. జీవుఁడు కృతకృత్యుఁడగును. తన్నుఁ దాను మఱచి అట్టివాఁడే యగును. ఏమికావలెనో అదియే యగును. మూకాస్వాదనమువలె.

అసుర బాలకు లిట్లనిరి :- "అయ్యా ! భగవానుఁడు సుందరుఁడైనచో నాయన దర్శనమగుటెట్లు ? ఏ సాధనమున నీ మాయావరణము తొలిఁగి పోఁగలదు ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "భగవంతుఁడెవరిమీఁదఁ ప్రసన్నుఁ డగునో ఆతని యావరణమును దొలిగించును. మీరసుర భావ మును వదలుఁడు. ఆతని ప్రసన్నతకుఁ గారణము సరళ త్వము. చిత్తమును సరళము కావించుకొనుఁడు. ప్రాణుల మీఁదఁ ప్రేమనుజూపుడు, జీవులపై దయను జూపుము. దయా ప్రేమలచేతనే ప్రభువు ప్రసన్నుఁడగును."

అసుర బాలకు లిట్లడిగిరి :- "ప్రభువు ప్రసన్నుఁడైన నేమగును ?"

ఇది విని ప్రహ్లాదుఁడు నవ్వి యిట్లనెను :- "ప్రసన్నుఁ డైన నగునదేమున్నది ? జీవితము యొక్క చరమ లక్ష్యమును బొందును. ప్రభువు ప్రసన్నుఁడగుచో నిఁకఁ గర్తవ్యమేమియు

నుండదు ఇంకఁ బొందఁదగు వస్తువుండదు. ఈ ధర్మార్థ కామ్యపదార్థములు ప్రారబ్ధాను సారముగఁ బ్రాప్తించుచుండును. వీనికొఱకు ప్రయత్నము వ్యర్థము. వీనివలన మనకేమి ప్రయోజనము ?"

అంత నసుర బాలకులిట్లనిరి :- "ధర్మార్థకామ మోక్షములు నాలుగును బురుషార్థములు. వీనిలో మోక్షమును బరమ పురుషార్థమంటివి. నీవు ధర్మార్థ కామములను గోరక మోక్షమునే కోరునెడల నీవు దానికొఱకై ప్రయత్నిచెడు వాఁడవేనా?"

అంత బ్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రయత్న మప్రాప్య వస్తువు కొఱకే చేయఁబడును. మే మెల్లపుడు భగవచ్చరణామృతమును గ్రోలుచుందుము. చరణామృతమును గొను నప్పుడిట్టి మంత్రమును బఠింతుము."

శ్లో॥ అకాలమృత్యు హరణం సర్వవ్యాధి వినాశనమ్ ।
విష్ణుపాదోదకం పీత్వా పునర్జన్మ నవిద్యతే,

అనఁగా నీ భగవచ్చరణామృతము అకాల మృత్యువును హరించుచు, సమస్త వ్యాధులను నాశము కావించును. దీనినిఁ బానమొనర్చినచో నిఁక జన్మయుండదు." చరణామృతము చేతనే భక్తులకు మోక్షము వచ్చుచుండ నింక మోక్షము కొఱకు ప్రయత్నింపనేల ? ఇఁకఁ బాపనాశన విషయమున భగవన్నామ గుణగాన మొనర్చుటచే సమస్తపాపములు నశించును. ఇంక మనము మోక్షేచ్ఛను జెందుటేల ?"

అసుర బాలకు లిట్లనిరి :- పురుషార్థములు నాలుగుగదా! ఆ నాలుగు పురుషార్థములను నీవు నిషేధించుచుండిన నింకఁ గోరఁదగిన దేమున్నది ? కర్మ నేయుద్దేశ్యముతోఁ జేయవలసి యుండును కర్మ చేయక ప్రాణియుండలేఁడు కదా !"

అంత ప్రహ్లాదుఁడిట్లనెను:- "కర్మ నందఱును జేయుదురు. కాని కేవలము ఉద్దేశ్యమును, సాధుసజ్జనులు ఇల్లువాకిలి కుటుంబ పరివారములను, క్షేత్రారామములను, భార్యా బిడ్డలను వదలి వచ్చుచుందురు. వచ్చి తీర్థములందును, నేకాంత స్థానములందును, గంగాయమునాది పుణ్యసరిత్తటములందును మందిరములను నిర్మించుకొందురు. వనములను బెంచెదరు. కూపములను త్రవ్వించెదరు. పదిమందినిఁజేర్చి కథాకీర్తన మొనర్చుచుందురు. పనులన్నియును నాపనులే. ఆ యిటుకలు. ఆరాళ్ళు, ఆచెట్లే. కేవలముద్దేశ్యములో భేదము కలదు. ఇంటి తోటలోఁ బూలుపూసిన నింటిలోఁ జాకి యందు మనోహర గుచ్ఛము శోభకొఱకు పెట్టుచుందురు. వేడి వేడి భోజనము స్వామికి నైవేద్యమిడకయే తినివేయుచుందురు. అచ్చట నేపని చేసినను శరీరసుఖము కొఱకును. తన యైశ్వర్యమును ప్రదర్శించుటకును జరుగును. అహంకారమును బెంచును, ఇచ్చట నేమిచేసినను భగవంతుని కొఱకే భగవన్నామము మీఁదనే. భగవంతుని వాటిక భగవంతుని కూపము, భగవంతుని మందిరము. నిత్యము మందిరమును జిమ్మెదరు. పుష్పములు రాఁగానే ముందుగా భగవంతున కర్పించెదరు.పండ్లు కాచినచో భగవంతు

న కర్పించుచుందురు. తులసి పత్రములను సమర్పించెదరు. అప్పుడు ప్రసాదమును స్వీకరించెదరు. అన్నము వండిన ముందుగా భగవానున కర్పించెదరు. అంత విష్ణు నైవేద్యమును శ్రద్ధతో స్వీకరించెదరు. భగవంతున కర్పించిన తులసీమాలను శిరసావహించెదరు, వాసనచూచెదరు. ఇట్లే కార్యముల నొనర్చినను భగవదుద్దేశ్యము తోడనే చేయుదురు. వనులనియేగాని కేవలము భావము మాత్రము మారినది తమకొఱకై వంటఁజేసికొని తినువారు పాపమునే తినుచున్నారు. విష్ణువులకు నివేదన మొనరించి తినువారు ప్రసాదమును దినుచున్నారు. అట్టివారు నిత్యము నమృత భోజన మొనర్చు చున్నారు. ఇట్టి యనన్య భగవద్భక్తుఁడు మోక్షము నేల గోరును."

అసుర బాలకు లిట్లనిరి:- "అయితే కర్మలనొనర్చు యుద్దేశ్యమేమి?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను: "కర్మలుచేయు నుద్దేశ్యము సర్వాత్మ భావముతోఁదన సర్వస్వమును సర్వాత్ముఁడగు శ్రీవారి పాదపద్మములకు సమర్పించుటయే, ఏ కర్మలు వరుమ సుహృదుఁడగు శ్రీహరికి ఆత్మ సమర్పణమొనర్చుటకు సహాయములు కావో నేనా కర్మలను వ్యర్థములని భావించుచున్నాను, శాస్త్రములలో ఆన్వీక్షకీవిద్య, కర్మకాండ, న్యాయము, దండనీతి, కృషి వాణిజ్యములు మొదలగు నానా విధములగు కర్మలా జీవితమునకు సహాయకములుగ వర్ణింపఁబడినవి. ధర్మార్థకామములను గూర్చియు విశదముగ నచ్చటచ్చట వర్ణింపఁబడినది. ఈ కర్మ

లన్నియును భగవత్సేవకును, ప్రభుభక్తికిని సహాయకములైన ప్పుడే అవి యుచితములైనవి కాఁగలవు. కాకున్ననవి కేవలము శ్రమమాత్రములే కాఁగలవు! పైఁగా నీకర్మలు సంసారబంధనమును నింకను దృఢతర మొనర్పఁగలవు.

"ఇదివిని యాశ్చర్యచకితులై అసుర బాలకు లిట్లనిరి;- "అయ్యా! చూడఁగా నీవు చిన్నవాఁడవుగ నున్నావు నీవిట్టి జ్ఞాన సంబధమైన గూఢవిషయముల నెచ్చట నేర్చితివి? ఇవి నీమనస్సులోనే పుట్టినవా? లేక యీవిమల జ్ఞానము సంప్రదాయ పరంపరగా నీకెచ్చటనుండి యైనను నబ్బినదా?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను!-లేదు నాయనలారా! నేనీ విషయములను నామనస్సుతో నూహించి చెప్పుటలేదు. ఇది పరంపరాగతముగఁ బ్రాప్తమైనజ్ఞానమే. ఈజ్ఞానమున కాది సాక్షి శ్రీమన్నారాయణుఁడే. భగవంతుడు తనకనన్య భక్తుఁడగు నారదునకీ జ్ఞానమును జెప్పియుండెను. నారదునకుఁ బరోపకారమొనర్చుటయును, సంసారములోఁబడిన జీవులను భవభయమునుండి విడిపించుటయును వ్రతముకలదు. అదియే ఆతనికిఁ బ్రధానకార్యము. అధికారియైనవాఁడు నారదునాహ్వానించి యీ విశుద్ధ విమలజ్ఞానమును బొందవచ్చును. నారదభగవానుఁడు నన్నుకూడ కృపఁ జూచి నాకును నీజ్ఞానము ననేకవర్షముల వఱకుపదేశించినాఁడు.

అంతప్రహ్లాదునిఁ బరిహాస మొనర్చుచు నసురబాలకు లిట్లనిరి:- "అబ్బాయీ! నీవబద్ధములు చెప్పుచున్నావు. నీవైదా

లేండ్ల వాఁడవు. మాకన్నులముందు నీవు పుట్టినావు పైగా మన మాడుకొనినగంతులు వైచితిమి. నారదుఁడిచ్చటికి వచ్చుటను మేమెన్నడును జూడనేలేదు, పోనిండు వచ్చినాఁడనుకొనుఁడు. ఆతఁడు నీకుపదేశ మెప్పుడొసంగినాడు? నీవంతఃపురములో పల నుంటివి. నారదుఁడు లోపలికి స్త్రీలకడకుఁ బోఁడాయెను. అట్టియెడ నీయీమాటను మేము విశ్వసించుటెట్లు?

ప్రహ్లాదుఁడిట్లనెను:- "మీరు నామాటను విశ్వసింపరా? నేను సత్యమును జెప్పుచున్నాను నాగురువు నారదుఁడే. ఆతఁడు నాకిచ్చట నుపదేశమీయలేదు వేఱొకస్థానమున నొసంగినాఁడు."

అసురబాలకు లిట్లనిరి:-"అయ్యా! అవిశ్వాస మేమియును లేదుగాని మాకును మీకును గురువులీ యాచార్యపుత్రులేకదా! ఇంత వఱకును మేము వారినే గురువులుగ భావించుచున్నాము. కాని వీరీ విశుద్ధభగవద్ధర్మము నెఱుఁగరు. నీవు చెప్పినమాటలు విజ్ఞానయుక్తములు, భక్తిశాస్త్ర సారభూతములు. దేవదర్శన దుర్లభుఁడగు నారదుని మేము స్వయముగ దర్శింపనేలేదు. నీవాతనికడ శిక్షణను బొందుటయును జూడలేదు. అందువలన మాకు శంక కలిగినది. దీనికి నీవు ఉచితసమాధానము నొసంగఁగలిగినచో మేముపూర్తిగవిశ్వసించెదము.నీకునునారదునకును సమావేశ మెచ్చట? దైత్య పుత్రుఁడవని యెఱిఁగియు నీరహస్యమయ భగవద్ధర్మము నెట్లుపదేశించినాఁడు? ఈ విష యము లన్నిటికిని ఉచిత ప్రత్యుత్తరము నొసంగుఁడు"

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను:- "రాజా! అసుర బాలకులడుగఁగా నావలనఁ బ్రహ్లాదున కెట్టిజ్ఞానము ప్రాప్తమయ్యెనో దానినిఁ బరమభాగవత అసురకుల వంశావతంసుఁడును భక్తాగ్రగణ్యుఁడునగు బ్రహ్లాదుఁడు తన సహచరులకు జెప్పఁ దొడంగెను,"

## నారదుని ఆశ్రమములోఁ బ్రహ్లాద జనని

శ్లో॥ పితరి ప్రస్థితేఽస్మాకం తపసే మందరాచలమ్।
యుద్ధోద్యమం పరం చక్రుర్విబుధా దానవాన్ ప్రతి॥
(శ్రీభాగ. ౭ స్కం. ౭ అ. ౨ శ్లో)

శా. అక్షీణోగ్రతపంబు మందరముపై నర్థించి మాతండ్రి శు
ద్ధక్షాంతిం జనియుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్
భక్షింపబడెఁ బూర్వపాపములచేఁ బాపాత్మకుండంచుయున్
రక్షస్సంఘము మీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై.
(శ్రీమదాంధ్ర భాగవతం)

భగవంతునియొక్క సమస్త విధానములలోను మంగళము నిహితమైయున్నది. మనకు సంభవించు సమస్త ఆపద్విపత్తులు చూచుటకా కాలమునకుఁ జెడ్డగఁ దోఁచునుగాని చివరకు పరిణామమున మేలే కలుగును. సత్య, శివ, సుందరస్వరూపుఁడగు శ్రీహరి క్రీడలసత్యములుగను, అశివములుగను, అసుంద

ములుగను నెట్లుండఁ గలవు? ఇట్టి దృఢనిశ్చయమెవరికిఁగలుగునో వాని బుద్ధివిపత్తునందు విచలితముకాదు. ఎంతమంది అవతారులును బుణ్యశ్లోకులగు మహాపురుషులు కలరో వారందఱెన్నో విపత్తుల ననుభవించిరి. వానిని సహించుటచేతనే వారు నేఁటికిని జగద్వంద్యులైనారు. బంగారు నెంతగా నెన్నిసారులు తపింపఁజేసిన నంత యుజ్జ్వలముగఁ బ్రకాశించును. కావున విపత్తులను బ్రభువొసంగినవిగా భావించి సహించుటయే సుఖకరమగు మార్గము దీనిలోనే కల్యాణముకలదు.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో శ్రీనారదమహర్షి యిట్లు చెప్పెను- "రాజా! అసురబాలకులు ప్రహ్లాదుని మాటలపై విశ్వాసమును బ్రకటించఁగా, దెలిసికొనవలయునను జిజ్ఞాసను బ్రకటింపఁగా దనకును నారదునకు నెప్పుడెచ్చట సమాగమము సంభవించినదో వారికిఁ జెప్పఁదొడఁగెను. ప్రహ్లాదుఁడు దైత్యబాలకులతో నిట్లనెను- "సోదరులారా! మాతండ్రి మందరాచలమునకుఁబోయి ఘోరతపంబొనర్చి బ్రహ్మను గొప్ప గొప్ప దుర్లభవరములను బొందిన విషయమును మీరు వినియే యుండ వచ్చును,"

అసురబాలకులిట్లనిరి:- "అవును, ఈ విషయము జగత్ప్రసిద్ధమైనది. ఈ విషయమును మేము బాల్యకాలమునుండియు వినుచునే యున్నాము,అప్పటికి నీవుపుట్టలేదని వినియున్నాము.'

ప్రహ్లాదుఁడిట్లనెను:- "దీనినే నేను చెప్పుచున్నాను. అప్పటికి నేను పుట్టలేదు. కాని అప్పుడు నేను నాతల్లి గర్భమందుంటిని. నాతండ్రి తపస్సుచేయుటకుఁ బోయినప్పుడు, అచ్చట తపస్సును జేయు నాతనిపైనఁ జెదలపట్టలు పెట్టఁగా దేవతలిట్లనుకొనిరి:- "మన శత్రువు తనకుఁ దానే చచ్చిపోయినాఁడు. ఇప్పుడసురులనాథులైరి. వీరినిఁ. బరాజితులఁగావించుట కిదియే సమయము." అని యాలోచించి దేవతలు చాల ప్రయత్నమొనర్చుకొని సేనతో నసురులపైఁబడిరి. దైత్యులందఱు నసావధానులుగనుండిరి. దేవతాసైన్య మస్త్రశస్త్రాదులచే సుసజ్జితులైరి. దేవతలిదివఱలోదండెత్తిరి. ఇదివఱలోఁ జచ్చినవాఁడిప్పుడు బ్రతికినాఁడను సామెత కలదు. హఠాత్తుగా దేవతలు దండెత్తివచ్చుటనుగాంచి దైత్యులు కింకర్తవ్య విమూఢులైరి. వారికిప్పుడు ప్రభువులేఁడు, వారిండ్లు వాఁకిండ్లును, భార్యాపుత్రాది పరివారమును, పశుభృత్యాది భోగసామగ్రులను వదలి పాఱిపోయిరి. దేవతలకు విజయముకలిగెను. వారసుల ధనరత్నములను దోఁచుకొనిరి. దేవేంద్రుఁడు నాతల్లినిఁ జెఱపట్టుకొని స్వర్గమునకుఁ గొనిపోవుచుండెను, ఆతఁడామెను బలవంతముగఁ దన రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని ఆకాశమార్గమునఁ బోవుచుండెను. మాతల్లి దుఃఖశోకకారణమునఁ గురరీ పక్షివలె రోదనము చేయుచుండెను. దైవికముగ నా సమయమునకు రామకృష్ణ గుణగాన మొనర్చుచు దేవర్షి నారదుఁడచ్చటికి వచ్చెను.

త్రైలోక్యవందితుఁడగు నాదేవర్షినిఁగాంచి దేవేంద్రుఁడా తనికి శ్రద్ధతోఁ బ్రణామము కావించెను. మునిరాజు నాతల్లి యిట్లు విలపించుటను గాంచి దయావశమున దేవేంద్రునితో నిట్లనెను:- "దేవరాజా! ఈమె యెవని భార్య. ఈవిధముగ విల పించుచున్న దేల? నీవీవిధముగ నీమె నేలఁగొనిపోవుచున్నావు?"

ముని వచనములను విని అమరాధిపుఁడగు నింద్రుఁ డిట్లనెను:- "స్వామీ! ఈమె నాశత్రువగు హిరణ్యకశిపుని భార్య కయాధు, నే నసురులను జయించితిని. కావున నీమెను నేనే స్వర్గమునకుఁ గొనిపోవు చున్నాను."

ఇదివిని దేవేంద్రుని ధిక్కరించుచు దేవర్షినారదుఁ డిట్లనెను:- "ఛీ!ఛీ! నీవు దేవేంద్రుఁడవయ్యు నిట్టి నిదింత నిందిత కార్యమొనర్చుచున్నావు. పరపత్నిని స్పర్శించుటయే మహాపాపము. నీకు శత్రుత్వము హిరణ్య కశిపునితోడనే. ఈ యబల నీకేమిహాని యొనర్చినది? ఈమె నిరపరాధిని. నీవు పరనారీ, సాధ్వీ. పతివ్రతను గుదృష్టితోఁ జూచినచో నీ శిరస్సు నూఱువ్రక్కలు కాఁగలదు. గౌతమపత్ని యెడల నీ వొనర్చిన యన్యాయమునకు ప్రతిఫలమును నీ విప్పటికిని ననుభవించు చున్నావు."

ఇది విని యింద్రుఁడు శీఘ్రముగ నిట్లనెను:- "లేదు స్వామీ! ఈమెను గొనిపోవుటలో నాకు దుష్టవిచారమేమియును లేదు. నేనీ పతివ్రతనుస్పర్శింపను,నే విధమగుగష్టముగలిగించను.

ఈమె యుదరమందు హిరణ్యకశిపుని అమోఘవీర్యము కలదు. మేమా దుష్టునకు సదా భయపడుచున్నాము. ఆతఁడు పుట్టఁగానే యెవ్వరును నేర్పకయే గోతులను ద్రవ్వఁ బ్రారంభించును వీఁడు పుట్టఁగనే మాతో శత్రుత్వమును వహించును. అందువలన నీపిల్లవాఁడు పుట్టువఱకీమెను సత్కారపూర్వకముగ నుంచెదను. పిల్లవాఁడు కలుగఁగానే నఱికివేసెదను, ఈమెను వదలివై చెదను. ఈమె గర్భమున నా రక్షసరాజును దేవద్రోహియునగు హిరణ్యకశిపుని అసహ్య వీర్యమున్నది. మీరన్యథా తలంపకుఁడు. ప్రసవకాలము వఱకీమెను నావద్దనుండ నిండు; ప్రసవముకాఁగానే నేనీమెను విముక్తి కాంవిచెదను"

అంత క్షోభ స్వరమున నారదుఁడిట్లనెను:-" సహస్రనేత్రుఁడవయ్యును నీ వంధులలో నంధుఁడవైనావు. ఈ గర్భములో భక్తులలో మకుటమణి కలఁడు. త్రైలోక్యవందితుఁడును. చరా చర పూజనీయుఁడును, సమస్త దోషరహితుఁడును, పరమభాగవతుండును, మహాగుణియు, వాసుదేవ భగవానున కనన్యోపాసకుఁడును సర్వశ్రేష్ఠ సేవకుఁడును, భగవద్భక్తుఁడు. నున్నాఁడు. వీని వలన నీకుగాని యింకే ప్రాణికిఁగాని భయముండఁజాలదు. వానినిఁ జంపిన నీకేమి ప్రయోజనము? వీనిని నీవు చంపదలంచినను జంపఁజాలవు భగవద్భక్తులను జంపఁగల వాఁడెవఁడు నీవు నీ క్షేమమును గోరుకొను నెడల నీమె నీ క్షణముననే విడువుము."

ప్రహ్లాదుఁడు అసుర బాలకులతో నిట్లుచెప్పెను ;- సోదరులారా ! భగవద్భక్తుఁడను పేరును వినఁగానే యింద్రుఁడు భయభీతుఁడయ్యెను. ఆతఁడు వెంటనే అచ్చటనే దేవర్షి సమ్ముఖమున నాతల్లిని వదలివైచెను. ఈమె ఉదరములో భగవద్భక్తుఁడున్నాఁడను గౌరవమున నింద్రుఁడు మా తల్లికి పరిక్రమ మొనర్చెను. నన్నుద్దేశించి ప్రణామము కావించి, దేవర్షికిఁ బ్రణామము కావించి ఆతఁడు స్వర్గమునకుఁ బోయెను.

ఇచ్చట మాతల్లి నిరంతరము రోదనముచేయుచుండెను. ఆమె తన రక్షకుఁడును భయత్రాతయునగు నారదు నెదుటఁ జూడఁగానే ఆతని చరణములమీఁదఁ బడెను. ఆమె తన ప్రేమాశ్రువులచే దేవర్షి పునీతపాదములను బ్రక్షాళనముకావించెను. దుఃఖమున నేడ్చుచున్న మాతల్లి శిరస్సుపై మహర్షి తన వరదహస్తము నుంచుచు నిట్లనెను :- "అమ్మా ! చింతింపవలసిన పనిలేదు. నీవు సతీసాధ్వివి. నీ యుదరమున భగవంతునకు బరమ భక్తుఁడున్నాఁడు. నీక మంగళములు కలుగవు నీయింటికిఁబొమ్ము."

మాతల్లి యేడ్చుచు నిట్లనెను :- "ప్రభూ ! ఇప్పుడు నా కిల్లెచ్చటనున్నది ? నా నాధుఁడు మందరా చలమునకుఁ దపస్సు చేయఁబోయినాఁడు. అసురులందఱును దమ తమ గృహపరివారములను వీడి పాఱిపోయినారు. నే నాచితికిన ఖండహార దేశమున నొంటరిగ నెచ్చట నుండఁగలను ? అచ్చట నన్నెవరు రక్షింపఁగలరు. నేనెవరియాశ్రమమున

నచ్చట నేను నారోజులు గడుపుకొందును. మీరు కరుణాసాగ రులు, శరణాగత వత్సలులరు. మీరు నామీఁదఁ గృపఁజూపి శత్రువు బాఱినుండి తప్పించితిరి. నన్నుద్ధరించితిరి. నాకు గొంతకాలము మీ చరణ సన్నిధినే ఆశ్రయమొసంగుఁడు. మీఛత్రఛాయ యందుండి నేను నా విపత్తును దాఁటిపోఁగలను. స్వామీ ! నేను మిమ్ములను శరణువేఁడుచున్నాను. మీ చరణ ములు తప్ప నాకన్యస్థలము నిర్భయమైనది కానరాలేదు. దీన నగు నన్నుఁ బరిత్యజింపకుఁడు. నన్ను మీ యాశ్రమముననే యుంచుకొనుఁడు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "దైత్యకుమారులారా ! నా తల్లి యొక్క యీకరుణాభరిత వాక్కులను వినఁగానే మహాముని యొక్క నవనీత కోమలహృదయము ద్రవీభూతమయ్యెను. ఆతఁడిట్లనెను :- "సాధు సమీపమున స్త్రీయుండుట ఉచితము కాదు; కాని భగవద్భక్తుని తల్లియగుటచే నీవుమాతవు. అందఱ కును వందనీయవు. కావున నీపతి తిరిగి వచ్చువఱకు నీవు సుఖ పూర్వకముగ నా యాశ్రమమున నుండుము."

ఇది విని నాతల్లి మిక్కిలి సంతోషించెను. ఆమె తన యశ్రువులను దుడుచుకొని లజ్జచే సిగ్గుపడుచుఁ దలవంచుకొని దేవర్షి వెనువెనుకనే వెడలుచుండెను. తన యాశ్రమమునకుఁ జేరుకొని ముని మిక్కిలి స్నేహముతో నిట్లనెను :- "బిడ్డా ! సంకోచింపవలసిన పని లేదు. ఇది నీ పుట్టినిల్లనుకొనుము, నాతపఃప్రభావముచే నిచ్చటికే జీవజంతువును వచ్చి నిన్నుఁ

దేరిపాటిఁ జూడఁజాలడు. ఇచ్చటనే యుండి నీవు నీశుభ దిన ములకొఱకు ప్రతీక్షించుకొనుము."

నా తల్లి చేతులు జోడించుకొని యిట్లనెను :- "నా ప్రసవ కాలము సన్నికటమైనది. గర్భదినము లిదివఱకేనిండినవి. ఇచ్చట ఋష్యాశ్రమమునఁ బ్రసవము కాఁగూడదని నా కోరిక. నా భర్త తిరిగి వచ్చిన తరువాత మా యింటిలోనే సంతానము కలుగవలయును."

ముని సర్వసమర్థుఁడు. తపస్సుద్వారా ఆతనికి సమస్త సిద్ధులును బ్రాప్తించినవి. తన ప్రభావముచే ననుగ్రహ నిగ్ర హము లొనర్ప సమర్థుఁడు. అందువలన నాతఁడు మా తల్లి యెడలఁబ్రసన్నుఁడై యిట్లనెను :- "మంచిదమ్మా। నీ వెట్లు తలఁచినసట్లే జరుగఁగలదు నీ భర్త వచ్చువఱకు నీగర్భము నుండి బాలకుఁడు బయటకు రాఁడు. నీగర్భస్థబాలకునకు ఉద రములోనే సమస్తజ్ఞానమును గలుగఁగలదు. ఆతఁడన్నియును వినఁగలఁడు తెలిసికొనఁగలడు."

ప్రహ్లాదుఁ డసురబాలకులతో నిట్లనెను :- "సోదరులారా! మీరు విశ్వసింపుఁడు. లేక పోనిండు. నేను మాతా గర్భముననే నేనీ విషయముల నన్నిటిని స్పష్టముగ వినియుంటిని, బాగుగా గ్రహించితిని. నాతల్లి యీవరమును బొంది పరమానందమును జెందెను. ఆమెకు ఋషికుటీరమున నేమియును బనిలేదు. అయి నను నామె భక్తివశమునఁ బ్రాతః కాలమునఁబోయి జలమును

దెచ్చి, ఋష్యాశ్రమమును దుడిచి కలయంపిఁజల్లి, అలుకుచుండె డిది. పూజ కొఱకు పత్రపుష్పములను దెచ్చెడిది. సారాంశ మేమనఁగా ఆమెకు చేతనైనంత వఱకు మునికి సేవచేయు చుండెడిది. మాతల్లి స్వాభావికముగ సరళ, పతివ్రత, దీన, ఋషి చరణములందత్యంత శ్రద్ధకలది. అందువలన ముని కూడ ఆమెను మిక్కిలి శ్రద్ధతోఁ జూచుచుండెడువాఁడు. ఆమె కిల్లు జ్ఞాపకముండకుండునట్లు నిత్య నియమముతోఁ గథలను జెప్పుచుండెడువాఁడు. భాగవత ధర్మరూపణము కావించు చుండెడువాఁడు. జ్ఞానమునకు సంబంధించిన గూఢాతిగూఢ విష యములను జెప్పెడువాఁడు. ప్రేమ ప్రక్రియను దెల్పెడువాఁడు. భావమును గూర్చియు, అనుభవమును గూర్చియుఁ జెప్పుచు శ్రద్ధా భక్తులను గూర్చి వ్యాఖ్యానించుచు ననేకేతిహాసములను వినుపించు చుండెడువాఁడు. మాతల్లి చిత్తము గృహచింతలలో నుండెడిది. కొన్ని విషయములను వినుచుండెడిది. కొన్నిటిని ఆమె వినకయే ఆఁఆఁ ఊఁఊఁ అని ఊఁకొట్టెడిది. ఋషి యొక్క ముఖ్యాభిప్రాయము నేను వినవలసియుండెను. మాతను లక్ష్యముగఁబెట్టుకొని అతఁడు నాకే విశుద్ధ భాగవత ధర్మము లను వినిపించెడువాఁడు. ఆపరమ కారుణికుఁడును సర్వసమ ర్థుఁడునగు ముని ధర్మములోని గూఢాతిగూఢ రహస్యములను విశుద్ధజ్ఞానమును యథాతథముగ నుపదేశించెను. పూర్వజన్మ సంస్కారవశముచేఁ గేవలము శ్రవణమాత్రము చేతనే నేనా

పరమ రహస్యమయ గోపనీయోపదేశమును తల్లి కడుపు లోనే ధారణ కావించితిని. మాతల్లి యిప్పుడవి యన్నియును మఱచిపోయినది. ఆమె కవియన్నియును స్వప్నమువలె నయ్యెను. ఆమె కథలను గాలము గడుచుసాధనముగ భావించెడిది. సాధారణముగ స్త్రీలకు గృహచింత పురుషులకంటె నెక్కుడుగనుండును.వారికి కొడుకు కోడండ్ర విషయములమీఁద నున్న శ్రద్ధ భాగవతకథమీఁద నుండదు. అందువలన మా తల్లికవియన్నియును జ్ఞాపకములేవు. సమయము కూడ చాలాకాల ముగడిచెను. చాలాకాలమగునప్పటికి విషయములు మఱపునకు వచ్చుచుండును. కాని నాహృదయపటమున నవియన్నియును యథాప్రతరముగ లిఖింపఁబడియున్నవి. వానిని నే నెట్లుమఱవఁ గలను? మీకా విషయములను వినుటకు శ్రద్ధయున్నచో నేను మీకు వానిని వినిపించెదను."

ఇది విని అసుర బాలకులు మిక్కిలి యుత్సాహముతో నిట్లనిరి :- "అవును, మాకు వినవలయునని మిక్కిలి యిచ్ఛ కలదు. నీవా విషయములను తప్పక వినిపించవలయును."

ధర్మరాజగు యుధిష్ఠిరుఁడిట్లనెను :- "రాజా ! అసుర బాలకు లీవిధముగాజిజ్ఞాస యొనర్పఁగాఁ బ్రహ్లాదుఁడు నేను జెప్పిన జ్ఞానము నాయసురబాలకులకుఁ జెప్పనారంభించెను.

# భాగవత ధర్మోపదేశము

౪౭౫

శ్లో॥ హరిః సర్వేషు భూతేషు భగవానాస్త ఈశ్వరః ।
ఇతి భూతాని మనసా కామైస్తైః సాధు మానయేత్॥
(శ్రీభాగ. ౪ స్కం. ౨౧ అ, ౪౯ శ్లో.]

వ. ..........విజ్ఞాన వైరాగ్యలాభ సాధనంబులైన భాగవత ధర్మంబులపై రతి గలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు భగవంతుడాత్మగలండని సమ్మానంబు సేయుచుఁ గ్రామక్రోధలోభ మోహ మదమత్సరంబులన్ గెలిచి యింద్రియవర్గంబును బంధించి భక్తిసేయుచుండ నీశ్వరుండయిన విష్ణుదేవుని యందలి గతి సిద్ధించు :-
....శ్రీ మదాంధ్రభాగవతము.

దేనిచే నందఱును ప్రభావంతులగుచున్నారో అది యందఱ యందును సమానరూపమున వ్యాపించియున్నది. దాని ప్రకాశముచే నన్నియును బ్రకాశించుచున్నవి. ఆ యాత్మయందు దుఃఖములేదు. శోకములేదు. చింతలేదు. భయములేదు. దానికి మాయాసంసర్గము కలిగినప్పుడు అది యుపాధిలో బద్ధమైనట్లు కనఁబడును. అనాత్మయందు ఆత్మబుద్ధిని గలిగియుండుటకే మాయాజనితమగు అజ్ఞానమని పేరు. జీవుఁడుపాధినిఁ ద్యజించి తన సత్స్వరూపమునెఱిఁగినప్పుడు మాయాతీతుఁడగుచున్నాఁడు. అందువలననే మనీషులైనవారాత్మా నాత్మ వివేక

మునే జ్ఞానమన్నారు. జ్ఞానము కలిగినప్పుడే ఆత్మస్వరూపుఁడును సచ్చిదానంద ఘనుఁడగు శ్రీహరియొక్క యథార్థబోధ కలుగును. కావున మాయికపదార్థములకంటె నాత్మలో నేమి విలక్షణత కలదో ముందుగాఁ దెలిసికొనవలయును.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లు చెప్పుచున్నాఁడు :- "రాజా ! అసురబాలకులు ప్రహ్లాదునితో నాత్మజ్ఞాన జిజ్ఞాసయొనర్పఁగా నాతఁడు నేను చెప్పిన జ్ఞానమును స్మరణకుఁ దెచ్చుకొని దాని నత్యంత సంక్షేమముగఁ జెప్పఁదొడఁగెను. ప్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా ! ముఖ్యజ్ఞానమిది-మీరు ఆత్మానాత్మజ్ఞానము నెఱుఁగుఁడు." దేహమనాత్మవస్తువు. ఆత్మ చైతన్యవస్తువు."

అసుర బాలకులిట్లనిరి :- "అయ్యా ! మేము దేహమునే ఆత్మయనుకొనుచున్నాము. దేహమున కన్యముకాదీయాత్మ."

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా ? దేహమాత్మ కాజాలదు. దేహ ముత్పన్నమగును. ఉత్పన్నమై వృద్ధినిఁ బొందును. వృద్ధి పొందిపొంది వృద్ధియొక్క హద్దునందుకొనును. అనఁగాఁ బరిణామమును బ్రాప్తించును. తరువాత క్షయించుట యారంభమగును. సమస్తేంద్రియముల శక్తి క్షీణింప నారంభించును. క్షీణించి జీర్ణించును. జీర్ణించి జీర్ణించి నశించును. దీనిని మీరన్ని దేహములందును జూడఁగలరు. మామిడిపండ్లను జూడుఁడు. అవి పూతలోనుండి చిన్న చిన్న

పిందెలుపుట్టును. తరువాత నాఫలములు క్రమశః నిత్యమును వృద్ధినిఁబొందును. వృద్ధిబొంది దాని పరిణామమును జెంది అది యెంతకావలయునో అంతయగును. తరువాత వానిలోఁ బచ్చదనము ప్రారంభించును. పరిణామమును బొందిన తరువాత దానిలో క్షయ ఆరంభించును. అది చెట్టుమీఁదనే పచ్చ పచ్చగనుండును. పండనారంభించును. క్రమ క్రమముగ మెత్త పడును. రంగు మారిపోవును. కొమ్మకును పండుకును గల సంబంధము శిథిలమైపోవును. ఒకానొక దినమున ఫలము పండి తనకుఁదానే రాలిపోవును. కొమ్మను వదలి క్రిందఁబడును. ఈ షడ్భావవికారములు సమస్త శరీరములందును దృష్టిగోచరమగుచుండును. శరీరము నాశమైనను ఆత్మ నాశముకాదు. ఏది పుట్టినదో అది చచ్చును. ఆత్మ జన్మ, వృద్ధి, పరిణామము, క్షయ, జీర్ణత, నాశమను నీయాఱు వికారములను లేనిది. దానికి వీనితో సంబంధములేదు."

అంత నసురబాలకులిట్లనిరి:- "అయితే ఆత్మ ఏవస్తువు? శరీరముతోగూఁడ ఆత్మయును బుట్టుచున్నదనియు శరీరము చావఁగానే చచ్చుననియు ననుకొనుచున్నాము."

ప్రహ్లాదుఁడు నవ్వి యిట్లనెను :- "ఆత్మకు జననమరణములు లేవు. దానికావిర్భావ తిరోభావముండును. రెండు కట్టెలను మథించచే నగ్ని యుత్పన్నమగును. మండి మెల్ల మెల్లఁగా నది మందగించి ఆరిపోవును. దీనినిఁబట్టి అగ్ని బొత్తుగా పోయి

నదని భావింపరాదు, ఆ కట్టెలను మధించుటకుఁ బూర్వమును దానిలో నగ్నికలదు. మంథన మొనర్చుటచే నా కట్టెలలో నగ్ని అభివ్యక్తమైనది. ఆవిర్భవించినది. దాని యొక్క ఆధారేంధనము సమాప్తము కాఁగానే అది తన నిత్యస్వరూపమున మరల గలిసిపోయినది. అది నశించలేదు. కేవలము తిరోభావము చెందినది. నాశనమైనచో మరల నింకొకసారి మంథనమొనర్చినచో నగ్ని ప్రకటముకాదు. ఉత్పన్న వినాశములు ఇంధనమున సంభవము, అగ్నిలోలేదు. అదే విధముగ నాత్మకు జననమును లేదు మరణమునులేదు. జన్మాది షడ్వికారములు శరీరనముకే "

అసుర బాలకులిట్లనిరి:- "ఆత్మ నెఱుఁగట యెట్లు?"

ప్రహ్లాదుఁడిట్లనెను:- "భౌతిక దేహమునకు భిన్నమైనదే ఆత్మ దేహమనిత్యమైనది. ఆత్మ నిత్యమైనది. దేహము నశించును ఆత్మ అవినాశి. దేహ మనేక ధాతువులచేతను మలముల చేతను నశుద్ధమైనది. ఆత్మనిత్యశుద్ధమైనది. దేహములనేకములు అసంఖ్యాకములు. ఆత్మఒక్కటే, దేహము క్షేత్రము. ఆత్మదాని నెఱుఁగు క్షేత్రజ్ఞుఁడు. దేహమొకభూమి. ఆత్మ దానికధిష్ఠాత. దేహము వికారవంతమైనది. ఆత్మ అవికారి. దేహజ్ఞానము మఱియొక్క దానిద్వారా కలుగును. ఆత్మస్వయంప్రకాశమైనది. దేహముభూతముల కార్యము. ఆత్మ అన్నిటికినిఁగారణము దేహమేక దేశీయమైనది. పరిచ్ఛిన్నమైనది, ఆత్మ సర్వత్ర

సమానరూపమున వ్యాపించియున్నది. దేహమున కాసక్తికలదు. ఆత్మ అసంగము నిర్లేపమైనది, దేహ మపూర్ణము. ఆత్మపూర్ణ మైనది. అనావృతము."

ఈ విధముగ దేహమాత్మకు సర్వథా భిన్నమైనది. దేహమందు గలిగిన అహంకార మమకారములజ్ఞాన కారణ ములు. ఇది వఱకు చెప్పిన లక్షణముల నెఱిఁగి దేహము దానికి భిన్నమైనదని తెలిసిననంతవఱకు ఆత్మయొక్క యథార్థ జ్ఞానము కలుగదు. దేహముతో నాత్మ పూర్తిగాఁ గలిసినట్లుండు టచే నది పరిశ్రమ మొనర్పక శుద్ధముగఁ దెలియఁబడదు.

అసురబాలకు లిట్లనిరి:- "దేహముతో నాత్మయింతగాఁ గలిసి యుండినచో నీయనిత్యమును నాశవంతమునగు దేహము ద్వారా ఆ నిత్యమును శాశ్వతమునగు నాత్మ యెట్లు లభింపఁ గలదు?"

ప్రహ్లాదుఁడు తన మాటను సమర్థించుకొనుచు నిట్లనెను:- "దీని పేరే సాధనము ఇదియే మనుష్యునకు ముఖ్యకర్తవ్యము. గనులనుండి వెలువడు సువర్ణము మన యుంగరమందలి సువ ర్ణము వలె మెఱవదు. గనులనుండి వెలువడు సువర్ణము బాల చాల మలినముగ నుండును. దానిలో రాయి, మలినము మట్టి కలిసియుండును. అదితేజోవంతమైనదయ్యు ప్రభాశాలియయ్యు మలిన కారణమున మలినముగనే గోచరించుచున్నది. విశేష జ్ఞుడగువాఁడు మాటిమాటికి దాని నగ్నిలోవైచి, కాచి నానా

యుక్తులద్వారా శుద్ధమొనర్చెదరు. మలము నంతను వివిధోపాయములచే వేఱుచేయుదురు. అది శుద్ధ సువర్ణముగ నిలిచినప్పుడు మెఱయ నారంభించును. ఆత్మ స్వరూపము నెఱింగిన పండితజనము అధ్యాత్మయోగముద్వారా దేహరూపమగు క్షేత్రమునందే బ్రహ్మపదమును బొందుదురు.

అంత నసురబాలకులిట్లనిరి:- "దేహమని దేనినందురు? ఏయే వస్తువులను మనము దేహమందుము?

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను:- "సత్త్వరజస్తమో గుణముల వలననే యీ సమస్త ప్రపంచసృష్టియైనది: ఈమూఁడు గుణములును న్యూనాధికములుగ లేక సమానముగ ననఁగా సామ్యావస్థలో నున్నచో దానినిఁ బ్రకృతియందురు. దీనిలో సృజన శక్తి యుండదు. అది అక్రియగానుండును. ప్రకృతి వికృతియై, సమాన గుణములలో క్షోభముకలిగి అసమానతకలిగినప్పుడు ప్రకృతి పనిచేయును, మూల ప్రకృతి వలన మహత్తత్త్వము. దానినుండి అహంకారము, సాత్త్విక, రాజస, తామసాది భేదములచే నుండుటచే భూతములను నింద్రియములను, మనస్సు మొదలగు వానిని నుత్పన్నము కావించును. కావున సామాన్యతయా మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను నీ అష్టవిధ ప్రకృతులు, త్రిగుణములు, శబ్దస్పర్శరూప రసగంధాది పంచతన్మాత్రలు అను నీపదునాఱు వికారములతోఁ గూడినదానికే దేహమందురు. వీనియన్నిటిలో నొక్కఁడే మాలలో సూత్రము వలె

పురుషుఁ డనుగతుఁడై యున్నాఁడు, దేహము స్థావర దేహము జంగమ దేహమని రెండు విధములు, స్థావర దేహములనఁగా రాళ్ళు, రప్పలు, వృక్షాదులు. ఇవి ఒకచోటనుండి మఱియొక చోటునకుఁ గదలజాలవు. అటునిటుఁ దిరుగునవి జంగమ దేహములు. పశు, పక్షి, మనుష్యాదులీ శాఖలోనికిఁ జేరుదురు. ఇప్పుడీ దేహమందే ఆత్మనన్వేషించుము."

అసుర బాలకు లిట్లనిరి:- "దానినే. మేమడుగఁ దలఁచు చున్నాము. దాని నన్వేషించు టెట్లు?"

ప్రహ్లాదుఁడిట్లనెను:- "సోదరులారా! చూడుఁడు. మనము గంగలోస్నానము చేయుచున్నామనుకొనుఁడు. అప్పుడొక రూపాయి స్నానముచేయుచుండ దానిలోఁబడినది. క్రింద చిన్న చిన్న నత్తగవ్వలునుగలవు. గుండ్రనిరాళ్ళుకూడ కలవు. ఇంకను నెముకముక్కలును బడియున్నవి. వానినుండి మనము మన రూపాయిని వెదుకు కొనవలయును. చేతితోఁ గ్రిందనుండి అన్ని వస్తువులను దీసెదము. ఇది గవ్వ, రూపాయి కాదని త్రోసి పాఱవేయుదుము. ఇది జాతిముక్క రూపాయి కాదని దానినిఁ గూడ త్రోసి వేయుదుము. ఇది ఆలిచిప్ప రూపాయికాదని దానిని గూడ పాఱవైచెదము. ఇది ఎవరిదో ఎముక, రూపాయికాదుఅని దానినిఁ ద్రోసివేయుము. ఈవిధముగ మనము వస్తువులన్నిటిని జాగ్రత్తగచూచి వానిలోరూపాయి లక్షణములు లేకపోవుటచే విడిచివైచెదము. చివరకన్నిటిని వదలివైవగాఁ జేతిలోనికి మెఱ

యుచున్న రూపాయి వచ్చును. మనమానందమును జెంది, యిదియె మనరూపాయి, దీనికొఱకింతగా శ్రమచేసితిమనుకొనును,

మనచేతిలో నొక మాలయున్నదనుకొనుఁడు. దానిలో నానావిధములగు మణులు గలవు. అందులో నొక పూసను దీసి యిట్లందుము ఇది మాలయగుచో నిది మాలకాదని గురువనును. ఏలననఁగా దీనినిఁదీసినచో మాల నశించుటలేదు. మరల నింకొక పూసను దీసికొని యిది మాలయా యనిన నదియును మాల కాదని గురువనును. ఈవిధముగాఁ బ్రశ్నించుకొనిన నేదియును మాలకాదు. వీని అన్నిటియొక్క సంఘాతమే మాలయని ఋజువగును. అదియును సూత్రమున కధీనమైయున్నది, పూసలన్నియునున్నను ఒక్కదారము లేకపోయెనా మాలయొక్క అస్తిత్వము లేనేలేదు. ఆసూత్రమన్ని పూసలలో సమానరూపముగ ననుస్యూతముగ వ్యాపించినను నాపూసలలోఁ గలియలేదు, తన పృథక్ అస్తిత్వమును బోఁగొట్టుకొనలేదు. అది ఆ పూసలకు సర్వదా పృథక్కుగానున్నది నిర్లేపముగ నున్నది. అదే విధముగ నీజగత్తుయొక్క సమస్తవికారములు మాలలోని పూసలు. సూత్రాత్మ వీనికి వేఱుగనున్నాఁడు. సాక్షీమాత్రుఁడుగనున్నది. అది యీ దృశ్య ప్రపంచమునకు విలక్షణముగ నున్నది; అన్నిటిలోనున్నను నన్నిటికిని వేఱుగనున్నది. అటులనే ఆత్మ విషయములో నొనర్పుము, ఈ దేహములోఁగల బుద్ధిని సూక్ష్మమొనర్చి స్థూలత్వమును వీడుడు. అటునిటు విషయముల మీఁద

కుఁ బోవుచుండిన బుద్ధిని విచారవివేకములందు లగ్న మొనర్చి సూక్ష్మ మొనర్పుఁడు. స్థూల పదార్థములను జింతిచుచుండిన బుద్ధి స్థూలమగును. అది భౌతికపదార్థముల సత్యతకు మించే యోచింపఁజాలదు. భూతముల తరువాత సూక్ష్మతత్వములగు అహంతత్వమును, మహత్తత్వమును, ప్రకృతితత్వమును, ప్రకృతికిఁ బరముగనున్న తత్వమును గుఱించి విచారించుఁడు. అట్టి ఆత్మతత్వవిచారము నతి సూక్ష్మ బుద్ధులగు మనీషులే చేయఁగలరు, సమస్తావస్థలకు సాక్షిగా నున్నదే ఆత్మ.

అసురబాలకు లిట్లనిరి:- "మేము మనస్సును సాక్షియను కొనుచున్నాము.మనస్సులోని కేదివచ్చిన దానినిఁజేయుచుందుము. మనస్సే యింద్రియములను విషయములను విషయములలోనికి దింపును."

ప్రహ్లాదుఁ డిట్లనెను!- "మనస్సే సాక్షియని యనుచో నీమనస్సిది చేయగూడదను వికల్పమును ఇతరుల ప్రేరణముచే నిది చేయవలయునను సంకల్పమును నేలకలుగుచున్నది?

అసుర బాలకు లిట్లనిరి!- "మనస్సున సంకల్పముకలుగుచున్నది. కాని మనము కర్తవ్యా కర్తవ్యబుద్ధిని నిర్ణయించుకొనునప్పుడు వికల్పము దూరమగుచున్నది."

అంతఁ ప్రహ్లాదుఁడునవ్వి యిట్లనెను!-"అప్పుడు మనస్సునకును సాక్షి బుద్ధి అయినది కదా! బుద్ధికిని స్వయం నిర్ణయ మొనర్చు సామర్థ్యములేదు. ఆ శక్తియును నాత్మవలనఁ గలుగు

చున్నది. చూడుఁడు, మనము మేల్కొనుచున్నప్పుడింద్రియ ములు పనిచేయుచుండును. స్వప్నావస్థయందలి యింద్రియ ములు ప్రసుప్తతము లగుచున్నవి. ఆ సమయమున మనస్సటు నిటుఁ దిరుగుచుండును. సుషుప్త్యవస్థ ననుభవించును. అదియే అన్నిటికిని సాక్షియైన ఆత్మ. అది జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల యందు సమానరూపమున సాక్షిగా నుండును. దానినే సర్వా వస్థలకును సాక్షియగు బరమాత్మయందురు.

అసుర బాలకులిట్లనిరి:- "ఈ జాగ్రత్స్వప్న సుషుప్తులా త్మకు వృత్తులా?"

ప్రహ్లాదుఁడిట్లనెను:- "కాదు. ఆత్మకు వృత్తులెక్కడివి? ఇవన్నియును బుద్ధివృత్తులు. ఇట్లనుకొనుఁడు-మన ముద్యానవన ములోఁ గూర్చుండి చదువుకొనుచు వ్రాసికొనుచున్నామను కొనుడు, వాయువు వీచి సుగంధముగ నుండినది మన మానంద మును జెందితిమి, మంచి సుగంధ వాయువనుకొనుచుంటిమి. నిజమునకు వాయువునందు సుంగధములేదు. గంధమున కాశ్ర యము వాయువు. గంధముచే వాయుజ్ఞానము కలుచుగుచున్నది. అదేవిధముగ బుద్ధికి నీ కర్మజన్యములును, బరివర్తితములు జాగ్రత్స్వప్న సుషుప్త్య వస్థాత్రయములద్వారా ఆత్మయొక్క నిర్లేప, అసంగ, ఏకరసస్వరూపమును గుర్తింపవలయును.

అసుర బాలకులిట్లనిరి:- "అయితే ఆత్మ సత్యమైనది కదా! ఈప్రపంచము సర్వదా మిథ్యయై పోయినది గదా!"

నవ్వుచుఁ బ్రహ్లాదుఁడిట్లనెను:-"అందుకనియే ఆత్మ సత్యమైనది. ఈ ప్రపంచము మిథ్యయైనది. ఈ సంసారమునకు మూలము దేహధ్యాసయే, దేహమందాత్మబుద్ధి యుండుటచేతనే సంసారప్రతీతికలదు. గుణకర్మలు దీనికి నిమిత్తములు. ఈ జగత్తు అజ్ఞాన జనితమైనది. మిథ్య."

అసుర బాలకులిట్లనిరి:- "సోదరా! మనకీ సంసారము ప్రత్యక్షముగఁ గనఁబడుచున్నది దీనియొక్క అస్తిత్వమే లేకున్నచో దీనికి ప్రతీతి యెట్లు కలుగును?"

ప్రహ్లాదుఁడిట్లనెను:-"లేనివానికిఁబ్రతీతియుండగా యేమి? గంధర్వ నగరమనునది కలదాయేమి? ఆకాశములోఁ బ్రతిభాసించు నీలత్వము నిజముగ నాకాశమునకుఁ గలదా? కాని నీలాకాశము కనఁబడుచున్నదని అందఱు ననుచుందురు. వర్షకాలములో నింద్రధనుస్సు కనఁబడు చున్నది. నిజముగ ధనుస్సు కలదా? లేకున్నను బ్రత్యక్షముగఁ గనఁబడుచున్నది. స్వప్నములో సింహమును గాంచి మనము గడ గడ వణకుచున్నాము అయితే యీ సమయమున మంచముమీఁద నాలుగు పాదములు గల సింహమున్నదా? స్వప్నములోని సింహము మిథ్యగానున్నదైనప్పటికిని మనకుఁ బ్రత్యక్షముగఁ గనఁబడుచున్నది. దాని వలన భయముకూడ కలుగుచున్నది. అదే విధముగ నీ ససాంరమును వాస్తవముగలేనప్పటికిని అజ్ఞాన వశమున సత్యముగ భాసించుచున్నది. కావున సోదరులారా! ఈ సంసార సంకటము

నుండి శాశ్వతముగ ముక్తులగుటకై మీరు దృఢముగ నేదైన నుపాయ మొనరింప వలయును."

అసుర బాలకులిట్లనిరి:- "ఏమి యుపాయ మొనర్పవల యునో నీవే చెప్పుము."

ప్రహ్లాదుఁడిట్లనెను:-"ఈత్రిగుణాత్మక జగత్తున కత్యంతా భావనమగుటకును, కర్మబీజములు శాశ్వతముగ నశించుటకును నా యోగమును మీరు సాధనమొనరింపవలయును. లౌకిక విష యములనే గ్రహించు బుద్ధి వృత్తులు నివృత్తి కానంతవఱకు ఆత్మసాక్షాత్కారము కాఁజాలదు,"

అంత నసుర బాలకులిట్లనిరి:- "దీనినే మేమడుగుచు న్నాము. స్వస్వరూపము గోచరించునుపాయమును జెప్పుము."

ప్రహ్లాదుఁడిట్లనెను:- "ఏదో ఒక్క ఉపాయమైనచో నేను చెప్పగలను. ఆత్మానుభవమునకు సహస్రోపాయములు కలవు. ఎవరికేది రుచికరముగనుండునో,ఏది అనుకూలముగ నుండునో దానిని గ్రహింపవలయును."

అసుర బాలకు లిట్లనిరి:- సోదరులారా! సహస్రోపా యము లుండనిమ్ము. మంచిదే. కాని వానిలోఁ గొన్నిటినిఁ జెప్పు ము. ముఖ్యమగు వాటినిఁ గొన్నిటినిఁజెప్పుము."

ధర్మరాజుతో నారదుఁడిట్లనెను:-"రాజా! అసుర బాలకు లడుగఁగా నేను జెప్పిన ఆత్మానుభవోపాయములలోఁ గొన్నిటిని బ్రహ్లాదుఁడా బాలురకు వర్ణించి యుండెను."

# ఆత్మానుభవమునకుఁ గొన్ని యుపాయములు

౪౭౬

శ్లో. తత్రోపాయ సహస్రాణామయం భగవతోదితః ।
యదీశ్వరే భగవతి యథాయైరంజసా రతిః॥

(శ్రీ భాగ. ౭ స్కం. ౬ అ. ౨౯ శ్లో.)

వ. ........ సహస్రాధికోపాయములలో నిష్కాములై హృదయ గతుండయిన హరిని నిజభక్తిని భజింపవలయును.

క. దానవదైత్య భుజంగమ,
మానవ గంధర్వ సుర సమాజములో ల
క్ష్మీనాథు చరణ కమల,
ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యతనొందున్.

....శ్రీ మదాంధ్ర భాగవతము.

ఏ కర్మల ద్వారా మనస్సు కృష్ణ చరణకమలము లందు లగ్న మగునో వాస్తవమున నవియేకర్మలు, మిగిలిన వన్నియును నకర్మలు. మిథ్యాకర్మలు అజ్ఞాన జన్య మొహ నాశనము కానిది భగవద్భక్తికలుగదు. జీవి దేని కొఱకో తపతప కొట్టుకొనుచున్నాఁడు. అతఁడు దేనినన్వే షించుచు న్నాఁడు ఆతని మనస్సెచ్చట రమించినో, యెచ్చటి కాకర్షింప బఁడునో అచ్చట కుఁబరువిడును. కాని కొన్ని దినములకచ్చటి

నుండియును మరలును. మన్సను మఱియొక వస్తువుపైకి ఆక ర్షింపఁబడును. తరువాత రెండవ దానిమీఁదనుండి, మూఁడవ దానిమీదకును మూఁడవ దానిమీదనుండి నాల్గవదానిమీఁదకును బరువు లెత్తును. ఎచ్చటను శాంతి లభింపదు. ఎచ్చటికిఁబోయిన దిరుగుట ఆగిపోవునో, దేనినిబొందినఁ గృతార్థుడగునో, ఇంకొక దానినిఁ బొందఁ గోరిక కలుగదో అదియే వాస్తవిక తత్వము. అదియే మానవునకుఁ బరమ సాధ్యము.

ప్రహ్లాదుఁడసుర బాలకులకిట్లు చెప్పెను :- సాధన లన్నిటి యొక్క యేకైక లక్ష్యము ప్రభుపాదపద్మము లందనురాగము కలుగటయే ఏసాధనములచే భగవంతుఁడగు విష్ణువునందు స్వాభావికరతి కలుగునో ఆయా కార్యములను సదాసర్వదా తత్పరతతోఁ జేయుచుండ వలయును."

అసుర బాలకులిట్లనిరి ;- "అట్టివి కొన్ని కర్మలను నిర్దేశింపుము. ఏయే కర్మలనొనర్చిన శ్రీహరి పాదపద్మములందు రతిగలుగును ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రధాన కర్తవ్యము గురుదేవుని ప్రేమ పూర్వకముగఁ బూజయొనర్చుట. గురునియందును గోవిందునియందును నేకభక్తి కలిగి, గురువును మానవునిగా భావింపక ఆతనిసేవయందే యెవఁడు తత్పరుఁడై యుండునో ఆతనికి దుర్లభమేమియును లేదు. భగవంతుఁడాతనికి వశ మగును. గురువుప్రసన్నుఁడు కానియెడల నాతని కెంతటి

సంపత్తి ప్రాప్తించినప్పటికిని నాతని కేమియును బ్రాప్తింపనట్లే గురుకృప ప్రాప్తించినచో నాతఁడు నిర్ధనుడయ్యు నందఱికంటె ధనికుఁడగుఁను, ఆతనికి ప్రాప్తింపవలసిన దేమియు నుండదు.

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- సూతా! నీవు గురుమహిమమును భగవన్మహిమమునకు మించినదిగాఁ జెప్పుచున్నావు. మంచిదే, గురువు విద్యలో గొప్పవాడు కావున నాతని సన్మానింపవలెను, కాని ఆతని యందీశ్వర బుద్ధి యుంచవలెననుట మాకత్యుక్తిగాఁగనపడు చున్నది. గురువునకును మనకువలెనే చేతులు కాళ్ళు గలవు. వారియందును మాకువలె గుణదోషములుండును. అట్టియెడ నీవింతగా నాతని మహిమను వర్ణించెదవేల?"

అంత సూతుఁడత్యంత గంభీరుఁడై యిట్లనెను:- "స్వామీ! మీకు గురుతత్వముపై నేవిధమగు శంకయు నుండరాదు. మీరు సాంసారికులవలె శంకించుచున్నారు. మహానుభావులారా ! ఈ సంసారము భావము పీఁదనే ఆదారపడియున్నది తల్లి, సోదరి, అమ్మమ్మ, పుత్రిక, పత్నీ వీరందఱును స్త్రీలే వారిలో నేమియును భేదములేదు. మన తల్లియును నొకనికిఁబత్నియే. చెల్లెలును నొకనికిఁబత్నియే. అమ్మమ్మయు నొకనికిఁబత్నియే, పుత్రికయును నొకనికిఁబత్నియే, కాని యందఱితో నొకే విధముగా వ్యవహరింపము. భావభేదము చేతనే వ్యవహార భేదము కనఁబడు చున్నది. మన గృహము, ప్రాంగణము. అరుగుఁ గడప, గోడ అన్నియును రాతివే. భగవానుని శ్రీవిగ్రహము, ప్రభు

ప్రతిమయును పాషాణమయమైనదే, కాని భావభేదము కలుగుటచే మందిరమందు మనము సాష్టాంగనమస్కార మొనర్చెదము. ఇంటిలోని రాళ్ళమీఁద జెప్పులను దొడిగికొని నడచెదము. కాని చెక్కలును, మాలయును గాష్ఠనిర్మితములే ఒక దానిని గాలికి దొడుగుకొందుము, ఇంకొకదానిని బూజ్యబుద్ధిచే శిరస్సున ధరింతుము. యజ్ఞోపవీతమును సూత్రనిర్మితమే. మేజోళ్ళు, లంగోటి గోచి, మలమూత్రములను శుద్ధమొనర్చు గుడ్డయును సూత్రనిర్మితమే, ఒకదానిని బ్రహ్మరూపముగఁ జూచెదము, రెండవదానిని సాధారణ వస్త్రముగఁ జూచెదము. మురుగు గుంటలోని నీరును జలమే, గంగాజలమును జలమే, ఒక దానిని స్పర్శించుట కేవగించుకొందుము రెండవ దానిని సాక్షాత్తుగా బ్రహ్మద్రవముగ భావింతుము. స్వామీ! ప్రపంచములో భావమే ప్రధానము. భావముచేతనే భక్తి, భావముచేతనే ముక్తి, మనము గురువును మానుషభావమునఁ గాంచి యేదైన నేర్చుకొనినచో మనకు భౌతిక విద్య వచ్చునుగాని మనకు సద్భావములు వృద్ధిచెందవు. హృదయమందు సద్గుణవికాసము గలుగదు. మనము కళాకౌశలమును సంపాధించి అధికాధిక సంపత్తిఁ గూడఁ బెట్టినఁ గూడపెట్టుదుము, గాక దైవీసంపత్తి ప్రాదుర్భావము కాదు. గురు పూజ ఒక విధమగు నుపాసనము ఉపాస్యము నందీశ్వర బుద్ధియుండినగాని ఉపాసనయని పిలువఁబడదు. కృత, త్రేతాయుగాదులలో సాధారణముగఁ బ్రతిమ పూజలేదు. ఆసమయమున గురునియందే ఈశ్వర బుద్ధినుంచి

పూజించెడువారు. అప్పుడు దేవతలును బ్రత్యక్షముగ సశరీరులై యుండెడివారు. మానవులలో నేను గొప్ప నీవు కొద్దియను నీర్ష్యాబుద్ధి ప్రబల గానే అవతారపూజ ఋషులద్వారా ప్రచలితమయ్యెను. గురువునందు మనుష్య భావముంచినచో నాధ్యాత్మికోన్నతి కలుగదు, మనము మనశ్రద్ధను వృద్ధికావించు కొనవలయును. ఎవరికైనను నాత్మసమర్పణము కావించుకొనవలయును. దీనికి రెండే మార్గములు కలవు. తనకు సత్యానుభవము కలమార్గమున స్వయముగ వెడలుటయును, తనను సర్వతోభావేన సద్గురుచరణములకు సమర్పించుకొనుటయును భక్తి లేక గురుసేవ లభింపదు. వీరివలనఁ దనకుద్ధారముకలదని దృఢ విశ్వాసముండవలయును. ఒకవేళ గురువునందట్టి శక్తి లేకున్నను దరించుట నిశ్చయము. దీనికొక్కటిగాదు. అనేక దృష్టాంతములు కలవు.అజ్ఞుడగు గురువునుండియును భగవంతుఁడు ప్రత్యక్షమైనాఁడు. భగవంతుఁడు సర్వత్రకలఁడు. ప్రేమ, విశ్వాసము లెచ్చటఁగనబడునో అచ్చట ప్రకటమగును.

ఒక కథ కలదు. వంగదేశమున నొకగురువుండెడువాఁడు. ఆతని కొక నిష్ఠావంతుఁడగు గృహస్థ శిష్యుఁడుండెను. గురువు సాధారణుఁడే; కాని ఆతఁడు ధనికవంశమునకుఁ బరంపరగా వచ్చుచున్న పురోహిత కులగురువు. వంగదేశమున గురు

భక్తి ప్రధానము. అచ్చట సాధుభక్తి అంతగాలేదు. ఆ సంపన్న గృహస్థ భక్తుఁడు గురువునందు భగవద్బుద్ధి నుంచెడువాఁడు. అప్పుడప్పుడు గురు వాతనికియింటికి వచ్చుచుండెడు వాఁడు దంపతులిరువురును గలసి భగ్భవదావముతో నాతనికిఁ బూజన సత్కారము లొనర్చెడి వారు.

ఒక దినమున నాతని చిన్నపిల్లవాఁడొకఁడు సువర్ణమణి నిర్మితమగునొక బహుమూల్యహారమును ధరించి గురువు సమీమునకు వచ్చి ఆడుకొనుచుండెను. తల్లిదండ్రులెవరును లేరు. పూర్తి ఏకాంతముగ నుండెను. గురువు మనస్సునఁ బాపముద్భవించెను. పిల్లవాని హారమును నితర భూషణములను వలిచి వేసుకొనెను. అంత నిట్లనుకొనెను.

"వీని నిట్లే వదలివైచినచో నింటిలోఁజెప్పఁగలడు" అనుకొని ఆతని గొంతుపిసికి సమీపముననే ఒక పెట్టెలోనుంచి తాళమువైచెను. ఆతడిట్లనుకొనెను. రాత్రియందఱును నిద్రించిన తరువాత దీనిని గంగలో విసరివైచెదను, ప్రాతఃకాలమున వీని సొమ్ములను తీసుకొని పారిపోగలను," అని యాలోచించుకొని నిశ్చింతుడయ్యెను,

తల్లికి పిల్లవాఁడు కనఁబడక పోవునప్పటికి వెదుకుట నారంభించెను, అచ్చటచ్చట వెదకినది కాని పిల్లవాడెచ్చటను లేకుండెను. అందఱకును, జింత కలగెను. కాని ఆ భార్యాభర్తలు నిశ్చింతగా నుండిరి. గురులిచ్చటనుండఁగా దమకనిష్టము

జరుగదని వారి యూహ." వారి యీ దృఢత్వము యొక్క ప్రభావము గురువు హృదయము మీఁదనుఁ బడెను, అతఁడును దాను జేసినదానికి పశ్చాత్తాపమును జెందెను. అతఁడు దుఃఖముతోఁ దన శిష్యునితో నిట్లవెను :- "నాయనా నా వలన గొప్ప పాపము సంభవించినది. ఆ భూషణముల లోభముచే నేను మీ పిల్లవానినిఁ జంపివైచితిని."

శిష్యుఁడు దృఢతాస్వరమున నిట్లనెను :- "నా గురువును లోభము స్పర్శింపనైన స్పర్శింపదు. ఇతరుల వస్తువులమీఁద లోభము కలుగుట కలదు. మా సర్వస్వమును గురువు దైన పుడు లోభము కలుగుటయేమున్నది ?" ఆతడు జీవనదానము చేయగలవాఁడు, ఎట్లుచంపఁగలడు ?"

గురువిట్లనెను:- "కాదయ్యా, నా మనస్సులోనికి పాపము వచ్చినది. అందువలననే యిట్టిగర్హిత, నిందిత కార్యమును జేయవలసి వచ్చినది.

శిష్యుఁడిట్లనెను :- "నాగురువును బాపము స్పర్శింపనైన స్పర్శింపదు." గురువాతని నిష్ఠనుగాంచి మండిపడి తాను స్వయముగఁ బెట్టెను దెచ్చి వారిద్దరిముందు బెట్టెను పెట్టెను దెఱువఁగాఁ బిల్లవాఁడు చచ్చిపడి యుండెన. వారిద్దరిలో నెవరికిని శోక విస్మయములు రెండును గలుగలేదు. అతఁడు పిల్లవానిఁ దీసికొని వడిలోఁ బెట్టుకొనెను. గురువుయొక్క చరణామృతమును గైకొని వాని నోటను వైచుచు నిట్లనెను :- "మేము

మనో వాక్కాయములచే నెన్నడును గురువుయందే విధమగు నవిశ్వాసమును గలిగియున్నను నీ బాలకుఁడు జీవించకుండు గాక!" ఆశ్చర్యము-గురు చరణోదకము ముఖమందు పడఁగానే పిల్లవాఁడు నవ్వుచు లేచి నిలుచుండెను. దీనికి వారిద్దరికి నేవిధమగు నాశ్చర్యమును లేదుగాని గురువుయొక్క గర్వము పెచ్చు పెరిగెను.

వినఁగాఁ - గొంతకాలమున నింకొక శిష్యుని యింట పురుషుఁడు చనిపోయెను. గురువిట్లనెను :- "నేనిప్పుడే వీనిని బ్రదికించెదను" అని పలికి ఆతఁడు తన చరణామృతమును స్వయముగనాతని నోటను బోసెను. కాని ఆతఁడు జీవించ లేదు."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! యీ కథ యొక్క సారాంశ మేమనఁగా శిష్యునియొక్క దృఢశ్రద్ధయును, యథార్థమగు భావనయును ఫలవంతములని తెలిసికొనవలెను. మహాపురుషుల లందఱును గురు భక్త్యనుభవమును నాదర్శముగఁ బెట్టుకొనిన వారే. స్వయముగ సాక్షాత్తుగ వాసుదేవ భగవానుఁడును నవంతీ పురికిఁబోయి గురువగు సాందీప మహామునిని నిశ్చల భావముతో సేవించెను. భగవంతుఁడు ప్రాప్తింపవలసిన దేదియు నుండదు. ఆతనికి విద్యలును నవసరము లేదు. ఇదం దఱకును దెలిసినదే. కాని గురు శుశ్రూషను నాదర్శముగఁ జూపించుటకై ఆతఁడీలీలలు నొనరించెను. ఆతఁడు తన సహపాఠియగు సుదామునితోఁ గూడ గురుపత్ని చెప్పఁగా వనము

నకుఁబోయి స్వయముగ నింధనములఁ గొట్టుకొని తెచ్చి, గురువునకు సమస్త విధములగు సేవలొనర్చినాఁడు. ఇతిహాస పురాణములలో నిట్టివి ఒకటియును రెండునుగాదు. అనేక ప్రమాణములు కలవు. వానిలో గురువు చెప్పఁగా శిష్యులు నవ్వుచు నవ్వుచుఁ బ్రాణముల నొసంగిరి. మునులారా ! అన్య యుగములలోని విషయము లటులుంచుఁడు. ఈ కాలమందును నిట్టి గురుభక్తిచే మూర్ఖులైనవారు సర్వశాస్త్ర పారంగతులగుటను గాంచుచున్నాము. ఒక గురువు దగ్గఱ గొప్ప గొప్ప విద్వాంసులగు శిష్యులు చదువుచుండిరి; కాని గురుభక్తుఁడగు నొక శిష్యుఁడు నిరంతరము గురుసేవయందే యుండు చుండెను. ఒక దినమున నిట్లు జరిగెను. ఆచార్యుఁడు పాఠములను జెప్ప నుద్యుక్తుడయ్యెను గాని ఆతనికిఁ బరమసేవకుఁడగు శిష్యుఁడు రానే రాలేదు. ఆతఁడాచార్యుని వస్త్రముల నుదుకుచుండెను. ఆచార్యుఁడితర శిష్యులతో నిట్లనెను:- "వానినిఁ గూడ రానిండు. వాఁడు వచ్చిన తరువాత పాఠములను మొదలు పెట్టెదము."

విద్వాంసులగు నితర శిష్యులిట్లనిరి:- "స్వామీ ! అతఁడు మూర్ఖుడు. వాఁడు గ్రహింపఁజాలఁడు. వాఁడువచ్చినను రాకున్నను నొక్కటే."

ఇంకేమున్నది? ఆక్షణమునుండి ఆచార్యుని యొక్క కృపాదృష్టి ఆతనిపైఁబడెను. వెంటనే ఆతని జిహ్వాగ్రమున సరస్వతీదేవి విరాజిల్లుచుండెను. ఆతడందఱికంటె గొప్పయా

చార్యుఁ డయ్యెను. కావున మునులారా! గురుశుశ్రూషచే నసంభవములు సంభవములు కాఁగలవు. ఈవిషయమున నేను మీకందఱకొక యితిహాసమును జెప్పెదను. దానినిమీరు సమాహితచిత్తులరై శ్రవణముచేయుడు."

)o(

## గురు శుశ్రూషా సాధనము

౪౩౭

శ్లో, గురు శుశ్రూషయా భక్త్యా సర్వలబ్ధార్పణేన చ।
సంగేన సాధుభక్తానా మీశ్వరారాధనే నచ॥

(శ్రీభాగ. ౭ స్కం ౭ అ. ౩౦ శ్లో.)

వ. అదిగావున గురు శుశ్రూషయు, సర్వలాభ సమర్పణంబును సాధుజన సంగమంబును నీశ్వరప్రతిమా సమారాధనంబును

....శ్రీ మదాంధ్ర భాగవతము.

ఈ ప్రపంచము గుణదోషములచే వ్యాపించియున్నది. ఈ రెండును గలిసియుండుటచేతనే దీనికి స్థితికలదు. అన్నియును గుణములేకల ప్రాణులును.అన్నియును నవగుణములే కలప్రాణులును బ్రపంచములో నొక్కరును లేరు. ఇట్లు గుణదోషపూర్ణమైన

సంసారమందు శ్రీహరి సర్వత్ర రమించుచున్నాఁడు. ఎవఁడు గుణ దోష సహితమగు మోహముచే నేవస్తువునందాసక్తినిఁ జెందునో అతఁడట్టి రూపమును జెందును. అట్లు దోషమును జూడక ప్రేమ వశమున, శ్రద్ధావశమున నెవనైనఁ బ్రేమించుచో భగవంతుడచ్చటనే ప్రకటమగును ఒకానొక స్త్రీయున్న దనుకొనుడు. ఆమె తన కామనా పూర్తికొఱకు పతి శరీరమందు భోగబుద్ధిచే నాసక్తినిఁజెంది యుండును, అట్టియామె సదా సంసారమునఁ దిరుగుచుండవలసి యుండును. పుట్టుటయును, బుట్టించుటయును నిదియే క్రమమగును; అట్లుగాక పతియందీశ్వరబుద్ధి నుంచి ఆతనిఁ బ్రేమించుచుండినచో నాతనిలోనే భగవంతుఁడు ప్రకటమగును. శాశ్వతముగ నామెకు జననమరణములు విడిపోవును. ఆమె లక్ష్మీదేవివలె సదా వైకుంఠ మందు జగత్పతితో దివ్యాతి దివ్యానుభవము లొనర్చుచుండును.

ప్రేమయందు దోషములు కనఁబడవు. దోషబుద్ధి యున్నచోటఁ బ్రేమయుండదు. మనకు దోషమును జూచు నలవాటు వడుచ సంసారమందన్నిటియందును దోషములే కనఁబడును. దోషములు పైకి తేలుచుండును. వానినిఁజూచుట కంతగా శ్రమింపవలసిన పనిలేదు. గుణములు గర్భమందు దాగి యుండును. కావున గుణగ్రహణముకొఱకై లోతునకు దిగవలసియుండును. తననుదాను మఱచి దానిలో నిమగ్నుఁడు కావలయును. వెదుకవలయును. అప్పుడు గుణములు ప్రాప్తించును. అందుకనియే స్త్రీలకు బతియు, శిష్యులకు గురువును

నీశ్వరుడని చెప్పఁబడినాఁడు. సతికిఁ బతి యెవఁడో, శిష్యునకు గురువెవఁడో వారన్యుల దృష్టియందు వారికి మించిన జ్ఞానులు, ధ్యానులు, సదాచారులున్నను, వారు పతులనియు, గురువు లనియుఁ జెప్పఁబడినను వారికుద్ధార మెవరి చెఱగును బట్టు కొనిరో వారివలననే జరుగును. నదిదాటుటకు చిన్న, పెద్ద, సుందర, అసుందరమైనవియు, అలంకరింపఁబడినవియు, అలకరింఁబడనివియు, దృఢమైనవియు, జర్జరమైనవియునగు పడవలనేకము లుండును, కాని మనమన్నిటితో దాటఁజాలము. ఏదో ఒకదాని తోడనే దాటెదము. మనము దేనిలోఁ గూర్చుండి పోవుచున్నామో అదియే మనలను దాటించును. మనకు ప్రయో జనమా నౌకను నడుపు పల్లెవానితోడనే కలదు. అదే విధముగ నెవఁడు మెడలోఁ దాడుగట్టినాఁడో అట్టి పతి యెట్టివాఁడైనను సరియే వానితోడనే జీవనమును గడుపవలయును. వాని మూలముననే దాటిపోవలెను. ఇంకొకఁడు కావలెను, వాని తరువాత మూడవవాఁడు కావలయునననునది బాగుండదు. ఇందులోఁ దృప్తి లేదు. శాంతిలేదు. ఉద్ధారము లేదు. ఆవలికి దాటిపోఁగల్గు నాశ లేదు. ఒకవేళఁబతిపతితుడై, పరధర్మము నవలంబించనచో నప్పు డట్టి వానినిఁ బరిత్యజించిన దోషము లేదని శాస్త్రకారులంగీక రించిరి. అన్యసమయములందాతని యాజ్ఞలనన్నింటిని విరో ధింపక యథాశక్తిగఁ బాలింపవలయును. ఇట్టివి సతులకెన్నో దృష్టాంతములు కలవు. ఏదో ఒక విషయములో నాజ్ఞోల్లంఘ నము జరిగినది యేమంత దోషముకాదు. భర్త నీవు భగవంతుని

సేవాపూజ లొనర్పరాదనిన దానిని మన్నింపకున్నను నదియే మంత దోషముకాదు. ఇదే విధముగ గురుని ఆజ్ఞలనన్నిటిని కాదనక శ్రద్ధతో పాలింపవలయును. కాని ఆతఁడు భగవద్భజనమును వలదనినచో దానిని మన్నింపకుండిన నదియేమంత దోషముకాదు. ఏలననఁగా భగవద్భక్తియే జీవునకుఁ బ్రధాన లక్ష్యము. అందుకనియే కదా గురువు నేర్పఱచుకొనుట. గురువు రెండు కార్యము లొనర్చును. మనకు మంత్రము నొసంగును. పరమార్థశిక్షణము నొసంగును. ఒక్కొక్కప్పుడు శిక్షణ నొక గురువును, దీఁక్ష నొక గురువు నొసంగును. అట్టిస్థితిలో నిద్దర యందును శ్రద్ధనుంచవలయును. కాని దీక్షా గురువుకంటె శిక్షా గురువధిక సమాన్మననీయుఁడును శ్రేష్ఠుఁడునై యున్నాఁడు.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనుచున్నాఁడు:- "రాజా ! ప్రహ్లాదుఁడు తన శిక్షా గురువుగ నన్నే యెన్నుకొనినాఁడు. అందువలననే ఆత్మానుభవోపాయము లనేకములలో గురువు శుశ్రూషకే ఆతఁడు సర్వప్రథమ స్థానము నొసంగినాఁడు ఈ ప్రసంగమునే నైమిశారణ్యమందు శౌనకాదులకు సూతుఁడు చెప్పుచున్నాఁడు :- "మునులారా ! శిష్యులు గుర్వాజ్ఞాపాలనము కొఱకే విధముగఁ దన జీవితమును గూడ లక్ష్యపెట్టలేదో ఈ విషయమున ననేక దృష్టాంతములలోఁ గొన్నిటిని మీకుఁ జెప్పెదను.

ఒక గురువుకడ ముగ్గురు శిష్యులు పఠించుచుండిరి. ప్రాచీన వర్ణాశ్రమ ధర్మ మర్యాదననుసరించి పిల్లవాని కైదా రేండ్లు రాఁగానే తల్లిదండ్రులు వానిని గురు గృహమున వదలి వచ్చేడువారు. దీనినే ఉపనయన (గురుసమీపమునకుఁ గొని పోవు) సంస్కారమందురు. అచ్చట గురువు వానికి వేదమంత్ర గాయత్రీ దీక్ష నొసంగి సదాచారము, వేదాది ధర్మశాస్త్రముల శిక్షణ నొసంగును.విద్యార్థికేకైక కార్యము గురుశుశ్రూష, చదు వుటకాదు ఆతనిపని. ఇది గురువు యిష్టముమీఁద నున్నది. గురువు యోగ్యుడని తలఁచినపుడు చదువునకుఁ బిలుచును. ఆతనికి ముఖ్యమైన పనియేమనఁగాఁ దన సమస్త శారీరక సుఖ ములను మఱచి సమస్త విధముల గురు సేవ శుశ్రూష లొనర్ప వలయును ఆతని యాజ్ఞల నన్నిటిని, నవ్యగ్రభావముతోఁ బావింప వలయును. ఇంటింటనుండి భిక్షను దెచ్చుకొని గురువునకు సమర్పింప వలయును దానిలో నుండి గురు వెంత నొసంగిన దానికే సంతోషింపవలయును. ఆతనికొఱకు వనమునుండి ఫల ములు, పుష్పములు, కందమూలములు, సమిధలు, కుశలు మొదలైన అత్యవసర వస్తువులను దెచ్చుటయును, ఆతఁడే పనినిఁ జేయుమనిన దానిని శ్రద్ధాభక్తులతో నొనర్చుటయును జేయవలయును. ఆ యాచార్యునకు గురుభక్తులును ఆజ్ఞాకారు లగు శిష్యులు మువ్వురుండిరి.

ప్రథమ శిష్యునితో గురువొక దినమున నిట్లనెను:-"ఓరీ! నీవు పొలమునకుఁబోయి పొలములోని నీరు పోకుండు నటులఁ

గట్టను గట్టిరమ్ము"శిష్యుఁడు గుర్వాజ్ఞచొప్పునఁ బొలమునఁ గట్ట కట్టు టకుఁబోయి కట్టను గట్టెను. కట్టఁగట్టుచుండ వర్షము కురియుచుండెను. ఒక ప్రక్క పొలములోని నీరు కట్టను ద్రెంచుకొని పారుచుండెను. గుర్వాజ్ఞ పొలములోనుండి నీరంత యును బోవుచుండుటను శిష్యుఁడు చూచెను. గుర్వాజ్ఞ పొలము లోని నీరును బోనీయకూడదని. అందువలన నాతఁడచ్చటచ్చట మట్టినిఁదెచ్చి తెగిపోయిన కట్టకువైచెను. ఆ మట్టిని వేయఁగానే అది ప్రవాహవశమునఁ గొట్టుకొని పోవుచుండెను. వరదయును బెరుగుచుండెను, దానినరికట్టుటకు నియమ మేమనఁగా ముందు తెగిన దానికావల నడ్డుకట్టి తెగిన దానిమీఁదఁ దర్వాత మట్టిని వేయవలయును. అట్లు తెగినచోట మట్టినివైచినచోఁ గట్ట దృఢ పడును. అప్పుడు నీరుపోదు; కాని యిచ్చట నీటిప్రవాహ మతి తీవ్రముగ నుండుటచే దానికడ్డ మేయుటయునసంభవమయ్యెను శిష్యునకు దాని కట్టు శ్రమ వృథా కాఁగా నాతఁడు స్వయముగఁ దానే పరుండెను. దీనిచే జలమాగిపోయి చేను నీరుతో నిండెను. వర్షముకూడా ఆగిపోయెను: కాని ఆశిష్యుఁడు లేవలేదు. లేచిన యెడలఁ బొలములోని నీరంతయును బయటకుఁ బోవును. గుర్వాజ్ఞోల్లంఘన మగును." అందువలన నాతఁడు సూర్యాస్త మయము వఱకు ఆహార పానీయములు లేకయే అట్లు పడి యుండెను.

శిష్యుఁడు రాత్రియగునప్పటికి రాకపోవునప్పటికి గురువునకుఁ జింతవైచెను. గురువు తనశిష్యుని విషయములో నయ్యో! మనవానిని నీరు కట్టకట్టుటకుఁ బంపితిమే యింతవఱకు రాని కారణమేమి యని చింతించుచుండెను. శిష్యుని సంగతినిఁ దలచుకొనగానే ఆతనికి దుఃఖము కలిగెను. చేతితోఁగఱ్ఱను బట్టుకొని యిద్దరు శిష్యులతో రాత్రియందు పొలమునకుఁజేరుకొనెను. చూడఁగా నచ్చట శిష్యుఁడులేఁడు. అప్పుడాతఁడు చాల చింతితుఁడయ్యెను. ఆతడుచ్చస్వరముతో నిట్లు పిలిచెను:- "వత్సా! ఆరుణీ? నీవెచ్చటనున్నావు? ఎచ్చటనున్నను వెంటనే నాకడకు రమ్ము." శిషుఁడిట్లనుకొనెను:- "నేను గుర్వాజ్ఞచేతనే యిచ్చట నీటినడ్డగించుచున్నాను. ఇప్పుడు గురువు పిలిచిన తప్పక నేను పోవలెను." అని అచ్చటినుండి లేచి ఆ సమయమున గురువుసపమునకుఁబోయి చేతులు జోడించుకొని యిట్లనెను:- గురుదేవా! నే నిచ్చట నున్నాను. నాకేమి అజ్ఞ?"

గురువిట్లడిగెను:-"వత్సా! నీవింత సేపటినుండి యెచ్చట నుంటివి?

శిష్యుడిట్లనెను:- "మీయాజ్ఞ పొలములోని నీరు కట్టకట్టుమనిరి. నేనేవిధముగను దానినడ్డగింపఁజాలకపోఁగా నేనేదాని కడ్డముగఁబరుండియుంటిని. ఇప్పుడు మీయాజ్ఞకాఁగానే నీరు పారుచుండుట నట్లే వదలివచ్చితిని."

గురువాతని ఆజ్ఞాకారితకత్యధికముగఁబ్రసన్నుడై ఆశీ ర్వాద మొనర్చుచు నిట్లనెను:- "నీవు నిష్కపటభావముతో గురు శుశ్రూష వొనర్చితివి-కావున నీకు చదువకయే సమస్త విద్య లును లభింపఁగలవు. ప్రపంచములో నీవు గొప్పయశస్వివ య్యెదవు." ఆ మహానుభావుఁడే గురుకృపచేఁబ్రపంచములోఁ బరమ తేజస్వియును యశస్వియును, మృత్యుంజయుఁడగు నుద్దాలకుఁడను పేర విఖ్యాతుఁడయ్యెను."

ఇట్టివాఁడేయింకొక శిష్యుఁడుండెను. ఆతనికి గురుసేవా కార్యము వప్పగింపబఁడెను. ఆతఁడు పగలంతయును నావులను గాచు కొనెడువాఁడు. రాత్రియంతయును, భిక్షమెత్తుకొనెడు వాఁడు. గురు వాతనిఁబరీక్షింపఁదలఁచెను. అందువలన నాతఁ డిట్లనెను:- ఓరీ? ఏమి తినుచున్నావురా నీవంతగా బలిసితివి."

శిష్యుఁడంతయును జెప్పి తాను భిక్షమెత్తుకొని జీవించు చున్నాననెను. అంత గురువిట్లనెను:- "భిక్షతెచ్చి గురువున కీయ వలెను. గురువేది యొసంగిన దానిమీఁదనే నిర్వాహమొనర్ప వలయును." రెండవదినమున శిష్యుఁడట్లే చేసెను; కాని గురు వొక గ్రాసమునైనను శిష్యునకీయలేదు. గురువీయకున్నఁబోనీ యుఁడని శిష్యుఁడను కొనెను. తాను రెండుసార్లు అడుగుకొని జీవింతమను కొనెను. మఱునాటినుండి ఆతడట్లే చేయసాగెను. మరల నాతఁడట్లే చేయసాగెను. మరల నాతఁడట్లే హృష్టపుష్ట ముగ నుండటనుగాంచి నీవేమి తినుచున్నావురా? యని అడిగెను,

నేను రెండవసారి భిక్షమెత్తుకొని వచ్చుచున్నాననీ శిష్యుఁడు చెప్పెను. గురువు గద్దించియిట్లనెను:- "అట్లు చేయరాదు. అట్లు చేయుటచే లోభము ప్రకటమగును. గృహస్థులకుఁ గష్టముకలుగును. శిష్యుఁడు గురువాజ్ఞను శిరసావహించెను. ఇప్పుడాతఁడు పగలంతయును ఆవులను మేపుకొని రాత్రియందు భిక్షమెత్తుకొని గురువున కిచ్చుచుండెడువాఁడు. ఆఁకలైనచో గావులను పథిష్టముగఁబాలను బిండి త్రాగెడువాఁడు.

గురువాతని వదలక వెంటఁబడి, కారణమడిగి, పాలు పితికి త్రాగుచున్నట్లు తెలిసికొని కోపపడి యిట్లనెను:-"నాయాజ్ఞ లేక ఆవుపాలను బిండుకొని త్రాగుటపాపము. ఇఁకనట్లు చేయరాదు." ఆతఁడాజ్ఞను శిరసావహించెను. ఇప్పుడాతఁడు దూడల నోళ్ళనుండి జారిపడు నుఱుఁగును దిని జీవించుచుండెను. తెలిసిన తరువాత గురు విట్లనెను:-"దూడలు నీమీఁదదయతో నధికగముగ నుఱుఁగును విడుచుచున్నవి. నీవా నుఱుఁగును గూడ తినవలదు."

పాపమాతఁడిప్పుడేమి చేయఁగలఁడు? పగలంతయును గోవులను గాచుకొని, భిక్షమెత్తుకొని గురువునకొసంగెడువాఁడు. పాలను, పాలనుఱుఁగునుగూడ తీసికొనకుండెను. ఆఁకలిచే నాతఁడొకదినమునఁ జాలవ్యాకులతను జెందెను. అచ్చటఁజాలగ జిల్లేడు చెట్లుండెను, మిక్కిలి యాఁకలిచే నాతఁడు మిక్కిలిగ జిల్లేడాకులను దినెను. జిల్లేడుపాలు కన్నులలో బడెను.

దానివలనఁగన్నులు పోయి అంధుఁడయ్యెను. అయినను గోవుల వెంటఁదిరుగుచుండెను. తిరుగుచుఁదిరుగుచు నాతఁడొక కూప ములోఁబడెను. గోవులు సాయంకాలమునకు గోపాలకుఁడు లేక యే ఆశ్రమమునకు వచ్చెను. అప్పుడు గురువునఁజాల చింతవై చెను. ఆతనికి దుఃఖముకలిగెను. ఆతఁడు తన శిష్యులతో నిట్ల నెను:-"ఉపమన్యువునకు నేను బొత్తుగా నాహారము లేకుండఁ జేసితిని. అందువలననే ఆఁకలిచే దిరిగిరాలేదు. నామీఁదఁ గోప ము కలిగియుండవచ్చును. కావున మీరుపోయి వానిని వెద కుఁడు." అని ఇట్లుపలికిగురువు వనమందు వత్సా! ఉపమన్యూ! వత్సా! ఉపమన్యూ! అని కేకలువేయసాగెను. గురువుకేకలను విని శిష్యుఁడు బావిలో నుండియే యిట్లనెను:-"గురుదేవా! అర్క పత్రములను దినుటచే నాకు చూపుపోయినది. అందువలన నేను బావిలోఁబడితిని. ఇచ్చట నుండి నేను మీయాజ్ఞాపాలన మెట్లా నర్పఁగలను."

గురువు రహస్యమునంతను గ్రహించి ఆతనితో దేవ వైద్యులగు నశ్వినీకుమారులను బ్రస్తుతింపుమనెను. ఆతఁడు స్తుతించెను. అశ్వినీకుమారులా స్తుతికిఁ బ్రసన్నులరై కన్నులు యథాప్రకారముండునట్లుచేసి. ఆతని గురు శుశ్రూషకు సంత సించి వానిని సర్వ శాస్త్రజ్ఞుఁడగునట్లాశీర్వదించెను. "అశ్వినీ కుమారుల ఆశీర్వాదమును గురువునునను మోదించెను. ఆతఁడు చదువకయే గురుకృపచేసమస్త వేదములు తెలిసినవాఁడయ్యెను.

ప్రపంచములో నాతఁడే సర్వ పూజ్యుఁడగు నుపమన్యుఁడను ఋషియయ్యెను.

గురునిమూఁడవశిష్యుని పేరు వేద, ఆతఁడత్యంతగురు భక్తుఁడు. ఎవఁడెంతటి దృఢధారణ కలియుండునో ఆతని కంతటి కఠిన పరీక్ష జరుగును. గురువువేదునకు తనసమస్త గృహస్థకార్యములను వప్పగించెను.

వేదుఁడు చాల పెందలకడలేచి సంధ్యావందనమును, అగ్నిహోత్రమును పూర్తిగావించుకొని ఆశ్రమమును జిమ్మి, కలయంపి చల్లి స్వచ్ఛమొనర్చి, గురువుగారి పాత్రలనుదోమి, స్నానపానాదులకు జలమును దెచ్చెడివాఁడు. నీటిబిందెలను మోసిమోసి ఆతని భుజములమీఁదఁ గాయములు గాంచెను. తరువాత గురు, గురుపత్ని వీరియొక్క గుడ్డలనుదుకును అంట్లు తోమును, సారాంశమేమనఁగా రాత్రిందివములు గురువుగారి యింటిపనులందే మగ్నుఁడైయుండెడు వాఁడు. గురువు ఆతని నేదియును గాదనఁడు. ఇంతేకాదు. ఆతఁడాతనిని సదా యేదో కార్యములో నియమించు చుండెడువాఁడు. క్షణకాలమైనను విశ్రాంతి నొసంగెడువాఁడు కాదు. ఆతఁడు శీతోష్ణములను, ఆఁకలిదప్పులను, సమస్తదుఃఖములను సహించుచు సమస్త కార్యములను గురువుయొక్క యిచ్ఛానుసారముగఁ జేయుచుండెను. ఏపనికిని భయమువడఁడు. ఎప్పుడును నసావధానుఁడుగ నుండుఁడు. చిర కాలమునకాతని గురువు ఆతని శుశ్రూషకు

సంతుష్టుడై ఆతనికి సర్వజ్ఞుఁడగునట్లాశీర్వదించెను. వేదుఁడాతని గురుని యాశీర్వాదమును గ్రహించి, ఆతని పాదపద్మములకుఁ బ్రణామ మొనరించి స్నాతకుఁడై యింటికిఁబోయెను. ఆతఁడు విధ్యుక్తముగ వివాహ మొనర్చుకొని ఆచార్యుఁడయ్యెను. ఆతని సమీపమునకే ఛాత్రుఁడే తెంచినను దయావశమున వానిచే నే కార్యమును జేయించు కొనెడువాఁడు కాఁడు. ఏలననఁగా గురు గృహముననుండి సేవ యొనర్చిన నెన్నిక్లేశములు కలుగునో ఆతనికి బాగుగాఁ దెలియును.

సూతుఁడు శౌనకాదిమునులతో నిట్లనెను:-"మునులారా! ఈవిధముగ శాస్త్రములందు గురు శుశ్రూషనుగూర్చి ఉత్కృష్టాతి ఉత్కృష్టోదాహరణము లనేకములు కలవు. తనశరీర సుఖములను జూచుకొనక సదా గురుశ్రూషయందే యుండు శిష్యులు ధన్యులు"

ఆత్మాను భవోపాయములను జెప్పుచుఁ బ్రహ్లాదుఁడసుర బాలకులతో నిట్లనెను:-"గురు శుశ్రూషచే జనార్దనుఁ డత్యంత శీఘ్రముగ సంతుష్టుఁడగును. రెండవ యుపాయము సర్వాల ర్పణము. ఏదిప్రాప్తించిన దానిని భగవంతున కర్పించుట, అందఱకును ప్రభువు శ్రీహరి యను భావము సర్వదా జాగృతి చెంది యుండవలయును. జీవి వ్యర్థముగ నాది నాది యను చుండును. ఇదినాది. నేను దీనియజమానిని. ఇది నేను సంపా దించిన ధనము ఓయీ! నీవేమి సంపాదింపఁగలవోయి. నీవొక

జలబిందువైనఁగావు. ఒక్క రేణువైనను గావు. ఒక గింజనైనను నీవు చేయఁజాలవు. భగవంతుఁడిచ్చిన పలుగుతో, భగవంతుఁడేర్పఱచిన భూమియందు, ఆతఁడొసగిన చేతులతో నీవు పాతిపెట్టుచున్నావు. ఆతఁడేర్పఱచిన జలమును జల్లుచున్నావు. ఆతని కృపచేతనే చెట్లు పెరుగుచున్నది. ఫలించుచున్నవి. పుష్పించుచున్నవి. ఆఫలములలో నీదేమున్నది? నీవు దానియందేల స్వత్వమును బెట్టుకొందువు? ఏభోగ్య పదార్థము వచ్చినను దానినిఁగాంచి యిట్లను కొనవలెను....గోవిందా! ఇది నీవస్తువు. నీకే దీనిని సమర్పించుచున్నాను. సమర్పితవస్తువు నేమిచేయఁగలను; దీనియందు నాకుగల మిథ్యా మమత్వమేది కలదో దానిని నీకు సమర్పించుచున్నాను. నీవు దీనినుండి మమత్వమును గ్రహించుము. నాపైఁ బ్రసన్నుఁడవు కమ్ము" దీనికే సర్వ సమర్పణమందురు.

అన్నము రాఁగానే ముందు అచ్యుతున కర్పించి ప్రసాదమును గ్రహింపవలయును. జలమురాఁగానే దానినిఁ బ్రసాదము గావించి జనార్దనున కొసంగి త్రాగుము. శయ్యా, యాన, వస్త్ర, గంధాది సామగ్రియేది కలదో సమస్తమును భగవదర్పణము కావించి గ్రహించుము. ఆప్రసాద వస్తువును దేనిని గ్రహించినను భావమును గ్రహించుటే కాఁగలదు.

ఒక భగద్భక్తుడుండెను. అతఁడు భగవంతున కర్పింపక దేనినిఁ దినఁడు. ఒకనాఁడాతఁడేదో విపత్తులోఁబడి దారితప్పి ఒకానొక ఆశ్రమమునకుఁ జేరుకొనెను. ఆఁకలిచే వ్యాకులుఁడై

యుండెను. ఆతనికొక సుందర ఫలములభించెను. వెంటనే నోటిలో వేసికొనెను. ఆతఁడు గొంతులోనికి వేసికొను నప్పటికి క్రిందకు దిగెను.అయ్యో!దీనిని భగవంతునకు నివేదింపకతింటినే-యనునది స్మరణమునకు వచ్చెను. ప్రభువున కర్పణచేయలేదు ఇప్పుడేమిచేయను.గట్టిగా గొంతును బట్టుకొనెను.కాని వస్తువాతని కడుపులోనికి బోవునేమోనని ఆతని భయము. అందువలన నాతఁడొక తీక్ష్ణశస్త్రమును గైకొని కంఠము నుత్తరింపఁదలంచు నంతలో భగవంతుఁడాతని నిష్ఠకు వెంటనే ప్రసన్నుఁడై ప్రత్యక్షమయ్యెను. సమస్తమును భగవదర్పణ మొనర్చి గ్రహించుట యనునది శ్రేష్ఠసాధనము.

సూతుఁడిట్లనెను:-"మునులారా! చెప్పుడు, దీనిలోఁ గష్ట మేమున్నదో చెప్పుడు. భగవంతుని సన్నిధానమున నుంచి, తులసీ పత్రము నర్పించి "ప్రభూ! దీనిని స్వీకరింపుమని వినతి యొనర్చుఁడు. దీనికే భగవంతుఁడు ప్రసన్నుఁడు కాఁగలఁడు. తరువాతఁ బ్రహ్లాదుఁడిట్లనెను:- మూఁడవ సాధనము సాధుజనుల భక్తజనుల సాంగత్య మొనర్చుట,"

మునులారా! పరమార్థ సాధనములలో సత్సంగమునకు మించినదిలేదు. భక్తుల సాంగత్యమొనర్చుటచే మానవులేకాదు, పశు,పక్షి,వృక్షాదులును దరించును.సాధుసంగమముచేఁ బ్రపంచ మందు నేఁటివఱకు మేలుకలుగలేదను నుదాహరణ మింతవఱ కొక్కటైన లభింపలేదు. దుష్టసాంగత్యముచే గొప్ప గొప్ప

మహాత్మ్యలును మచ్చ దెచ్చుకొనిరి. క్షణకాల సాధుసాంగత్య ముచేఁ జిలుకకు నేర్పినవేశ్య తరించినది. జడభరతుని సాంగ త్యముచేఁ బల్లకిని మోయించుకొనిన రహూగణుఁడను రాజు తరించినాఁడు. హనుమంతుని పిడికిలి గ్రుద్దును దిని అతని సాంగత్యముచేలంకిణి తరించెను. క్షణకాలము నారదుని సత్సంగ ముచే నసంఖ్యాకులగు ప్రాణులు తరించిరి. కావున మునులారా? పరమార్థ పథమునఁ బథికుఁడగు వాఁడు విషయాసక్తుల సాంగ త్యమును బొత్తుగా వీడి సాధుసాంగత్య మొనర్పవలయును సత్సంగతి మానవునకేమేమి చేయఁజాలదు? దీని కనేక దృష్టాంతములు కలవు."

ప్రహ్లాదుఁడిట్లనెను:- "నాల్గవ సాధనము భగవంతును పాసించుట." సూతుఁడిట్లనెను:- "మునులారా! భగవదుపాసనచే మనస్సులోని సమస్తమలములును దూరమైపోవును. హృద యము పవిత్రమగును. విషయములందు మనస్సునకుఁ గల శ్రేష్ఠత్వబుద్ధి తొలఁగిపోగలదు. అంతఃకరణము విశుద్ధమగును. శుద్ధాంతఃకరణమందు పరమాత్మ సాక్షాత్కారము కాఁగలదు. శ్రీహరి ఉపాసన చేతనే అసంఖ్యాకులగు భక్తులే భయంకర భవసాగరమును నిమిషములో దాటిపోయిరి. భగవదుపాసన మందనేక భేదములు కలవు. వానిలో మనకేది యనుకూలమో, గురువేది నిర్దేశించినాడో తదను సారముగ నుపాసన మొనర్ప వలయును. అంత నుపాసకుఁడు దేనిని జేయించుకొనఁదలఁచిన భగవంతుఁడు దానినిఁజేయును భగవంతుఁడుపాసకులను మిక్కి

లిగఁ జింతించును. తనమీఁదనే ఆధారపడియుండిన యుపాస కునకు నేవిధమగు కష్టమును కలుగఁగూడదని భగవంతుఁడు వానిని రక్షించుచుండును. భగవంతునకుఁ బరమప్రియమగు నాయుధమైన సుదర్శనముతోఁ దన భక్తులకేవిధమగుగష్టమును గలుగకుండునట్లు రక్షించుచుండుమని. చెప్పెను. అప్పటి నుండి సుదర్శన చక్రము సదా భక్తులను. వారిని గొప్ప గొప్ప సంకటములనుండి రక్షించుచుండును. అంబరీషుని దుర్వాసుని శాపమునుండి రక్షించినదీ సుదర్శనచక్రమే. ఇదంతయును అంబరీషమహారాజుయొక్క దృఢభక్తియును, యజ్ఞ పురుషుని యుపాసనము యొక్కఫలమే,కావున నాత్మానుభవమును జెందఁ దలఁచిన వారు భగవదుపాసన మొనర్చుట పరమావశ్యకము.

)o(

# అన్యసాధనములు

౩౪౮

శ్లో॥ శ్రద్ధయా తత్కథాయాం చ కీర్త నైర్గుణకర్మణామ్ ।
తత్పాదాంబురుహధ్యానా త్తల్లింగేక్షిర్హ ణాదిభిః॥
(శ్రీభాగ. ౭ స్కం. ౭ అ, ౩౦ శ్లో.)

వ. ............నారాయణ గుణకర్మనామకీర్తనంబును వైకుంఠ చరణ కమల ధ్యానంబును విశ్వంభరమూర్తి విలోకన పూజ

నంబును మొదలైన విజ్ఞాన వైరాగ్యలాభసాధనంబులైన భాగవత ధర్మంబులపై రతిగలిగి సర్వభూతంబులయందు నీశ్వరుండు కలండని సమ్మానంబు సేయవలయు."

--శ్రీమదాంధ్ర భాగవము.

ఏదైన విషయమును నూఱుసార్లు పలుకుము. నూఱు సార్లు వినుము. అప్పుడది అనాయాసముగ నేప్రయత్నమును లేకయే ఆ విషయము జ్ఞాపకమునకు వచ్చును. దాని సంస్కారము పడును. మానవుఁడెట్టి మాటను విన్నను దాని సంస్కారముల వ్యక్తముగఁ బడును. దేనినిఁజింతించిన నదియే అగును. దేనిని నిరంతరము చూచుచుందుమో ఆ వైపున కాకర్షింపబడుదుము. నిరంతరమెవని సేవ చేయుదుమో అట్టి వాని స్వభావము గల మనుష్యుల మగుదుము. విషయాసక్తులు నిరంతరము విషయచింతన మొనరించుచుందురు. మలమూత్ర, విష్ఠ, కఫాశ్రు, రజోవీర్య, రక్తమాంసాది సంహతిచే నిండిన యీ దేహమును జింతించుటచే దీనియందే అసక్తికలుగును. దీని సాంగత్యముననే సుఖానుభవమును జెందును. చచ్చిన తరువాత నరకములందీ వస్తువుల కుండములలోనే పడవేయుదురు. అచ్చట స్థూలదేహముండదు. యాతనా దేహమును ఒక్కొక్కప్పుడు మలకుండమందును, ఒక్కొక్కప్పుడు మూత్రకుండమందును, ఒక్కొక్కప్పుడు చీము, నెత్తురు, రజోవీర్యములు, క్రిములు గల కుండములలోఁ బడవైచి యీ యన్ని వస్తువు

లాతనిచే ద్రావి చెదరు. తినిపించెదరు. ఈ మాంసాస్థిమయ మగు శరీరములను జింతింపక భగవంతునియొక్క దివ్య స్వరూపమును జింతించుచో, కృష్ణుని కమనీయ లలిత కథలను శ్రద్ధతో శ్రవణ మొనర్చునో నందకిశోరుని యొక్క చారు చరిత్రములను జింతించుచో, ప్రభుని పరమపావన ప్రేమమయ మగు బునీత ప్రతిమలకు బూజన, వందనార్చన దర్శనాదుల నొనర్చునో అట్టివాఁడు భగవద్భావములతో ప్రభావితుఁడై భగ వంతుని యొక్క వైకుంఠధామమునకు బోవును. అచ్చట నాధి వ్యాధులుండవు. చింతలేదు. దుఃఖములేదు. జన్మలేదు. మర ణములేదు. శోకములేదు. సంతాపములేదు. పతనములేదు. క్షయములేదు. మాయలేదు. అవిద్యలేదు.సదా సర్వదా ఆనందమే ఆనందము. ఈమాయిక జగత్తును మిథ్యగా భావించి, ఆత్మాను భవ మొనర్చుటకు సముత్సుకుఁడైన వానికి భగవత్కథాశ్రవ ణము, గోవిందగుణకర్మ కీర్తనము ఆతని చారు చరణకమల చింతనము, ఆతని ప్రతిమాపూజనార్చన వందనాది సాధన ములుకాక వేఱు కర్తవ్యములేదు. అట్టివారు నిరంతర మిట్టి కర్మలందే యుండవలయును.

భక్తాగ్రగణ్యుడగు ప్రహ్లాదుఁడు దైత్యబాలకులతో నిట్లు జెప్పుచుండెను :- "సోదరులారా ! ఆత్మానుభవమునకు నేనిది వఱలో గొన్ని ఉపాయములను జెప్పితిని. ఇప్పుడింకఁ గొన్ని టినిఁ జెప్పెదను. ఆత్మసాక్షాత్కార మొనర్పఁదలచువాఁడు నిత్య నిరంతరము నియమముతో భగవత్కథలను వినవల

యును. ఎవరి కర్ణములకు భగవత్కథారసము లభించినదో, ఎవరు భగవత్కథలు లేకుండఁజాలరో వారసత్కార్యములను నెన్నటికినిఁ గావింపరు. వారి సంగతి నట్లుంచుఁడు మహాత్ముల ముఖమున నొక్కసారి భగవన్నామము చెవులఁ బడినఁజాలును వానికి దుర్గతి యుండఁజాలదు.

ఇది విని శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! నిత్యము కథా శ్రవణముచే సంస్కారములు కలుగును. కాని ఒక్కసారి ప్రసంగవశమునఁ గథాశ్రవణ మొనర్చుటచే నేమి లాభము కలుగును ?"

అంత సూతుఁడిట్లనెను :- "మహాభాగా ! ఎప్పుడేవిషయము హృదయములోనికి దూరునో. ఒక్కొక్కప్పుడు జీవిత కాలమంతయును బుణ్యమొనర్చి ఏదో ఒక చెడ్డ విషయమున దుస్సంగము సంభవించి మనస్సులోనికిఁ బాపము వచ్చును. చూడుఁడు. అజామిళుఁడెంతటి శాంత, దాంత, తపస్వి, సదాచారరతుఁడగు బ్రాహ్మణుఁడో ఆతని కేకాంతమున నొక వేశ్యతో సమాగమము సంభవించెను. సంస్కారము జాగృతి చెంది పతితుఁడయ్యెను. ఇదే విధముగ నొక్కొకప్పుడు సాధువుల కడకు బోవుటచే శఠుఁడును బాగుపడును. దురాచారియును సదాచారియగును. ఈ విషయమున నొక దృష్టాంతమును వినుఁడు.

ప్రసిద్ధినిఁజెందిన నొకచోరుఁ డుండెను. చాలధనమును దొంగిలించి తనతల్లికిచ్చు చుండెడువాడు. ఆతని తల్లి యిట్లను చుండెడిది :- "వత్సా ! కథాశ్రవణమునకుఁబోవలదు. ఒకవేళ కథలు జరుగుచుండినఁ జెవులలో వ్రేళ్ళు పెట్టుకొని అచ్చట నుండి వెడలిపోవలయును. మాతృభక్తుడగు నాబాలకుండట్లే చేయుచుండెను నేకథకును వెడలుటలేదు.

ఒకదినమున దైవయోగముచే నాతఁడెచ్చటికో వెడలుచుండి దారిలోఁగథ జరుగుచుండెను. ఆతఁడు నియమానుసారముగ గర్ణములలో వ్రేళ్ళునుంచుకొని పోవుచుండ నాతనికొక పెద్దము ల్లుగ్రుచ్చుకొనెను. తీసుకొనుటకు గ్రిందకువంగి కాలు పట్టుకొ నునంతలో నాతని కర్ణములో సదాసత్యమునే పలుకవలయును సత్యమును బలుకుటచే నెప్పటికి నేహానియును గలుగదు. ఈ విషయమాతని మనస్సులో హత్తుకొనెను. ముల్లు బయటకు వచ్చెను. నాతఁడు లేచివెడలి పోయెను.

ఇప్పుడాతఁడిట్లనుకొనెను:-" నేనేల నబద్ధమాడవలెను? నేనుసత్యమునే యేల నాశ్రయింపరాదు? సత్యముపలుకుటచేహాని రాదు. నేనురాత్రులందు దొంగతన మొనర్చుచున్నాను మాటా డువని లేదు నేటినుండి సత్యమునే చెప్పెదనని లోనఁబ్రతిజ్ఞనొ నర్చుకొని శక్తి కొలఁది సత్యమునే పలుకసాగెను.

ఒకదినమున నాతఁడు రాజగృహమునకు దొంగిలింప బోయెను. మంచివిలువగల వస్త్రములను ధరించెను. రాత్రియందు

రాజుగారి కోట కడకుఁబోయెను. కావలివాండ్రిట్లనిరిః-" నీవెవరు ఆతఁడు స్పష్టముగా నిట్లనెనుః-" నేను చోరుఁడను" ఆ దినము ననే రాజుగారి సోదరుఁడు వచ్చియుండెను బహుశః ఈతఁడా తఁడే అయియుండవచ్చును. కాకున్నఁ దానుచోరుఁడునని యెవ డైనఁజెప్పునా! అని కావలివాండ్రనుకొని, ఆతనిని సత్కారపూ ర్వకముగా దారియొసంగిరి. ఆతఁడు లోనికి ప్రవేశించెను రాజు చూచి యాతఁడు రాణి తమ్ముఁడేమోనని యాతఁడనుకొనెను. ఏమియును మాటలాడక రాణిగారి తొమ్మిదిలక్షలుఖరీదుచేయు హారమునుగొని యాదొంగ పారిపోయెను. గుఱ్ఱపుశాలనుండి మంచి యెఱ్ఱని గుఱ్ఱమును దీసికొని దానిపై నెక్కి పోయెను. ఎవరైన నడిగినఁదాను దొంగనని చెప్పుచుండెను. కొంత కాలము నకు రాణి వచ్చెను. హారమును చూచుకొనఁగా లేకుండెను. వారిని వీరిని అడిగెను. భవనమంతటను నలజడి ప్రారంభ మయ్యెను. కావలివాండ్రిట్లనిరి :- "అన్నదాతా! ఒక మనుష్యుడు వచ్చినాఁడు. తాను చోరుఁడనని చెప్పెను. మాకు వాని మాట మీద విశ్వాసము కలదు ఆతఁడెఱ్ఱ గుఱ్ఱముపై నెక్కి పోయెను. రాజు తక్షణము చాలమంది రౌతులను బంపెను. దొంగ ఒక స్థానమున గుఱ్ఱమును బంధించి ఆలయములోనికి దర్శనార్థము పోయెను. రాజసేవకు లచ్చటికిఁజేరిరి. చూడఁగా గుఱ్ఱమచ్చ టనే యున్నది కాని దాని రంగు తెల్లగా నుండెను. సేవకులు నిర్ణయింపఁజాలకపోయిరి. కొంచెము సేపటికి దొంగయును

వచ్చెను. ఆతనితో రాజసేవకులిట్లనిరి :- "నీవెవఁడవు ? ఆతడు "నేను దొరఁడ" ననెను.

మరల సేవకులిట్లనిరి :- "నీ వీ గుఱ్ఱము నెచ్చటనుండి తెచ్చితివి ?"

దొంగ యిట్లనెను :- "రాజుకడ నుండి దొంగిలించి తెచ్చితిని ?"

సేవకులిట్లడిగిరి :- "గుఱ్ఱము నేనా యింకేమైనా దొంగి లించి తెచ్చితివా ?"

దొంగ యిట్లనెను:- "నేనొక హారమునుగూడ దొంగి లించితెచ్చితిని."

అప్పుడు సేవకులిట్లనిరి :- "మాగుఱ్ఱమెట్టిదది దీని లక్ష ణములన్నియు నట్లేయున్నవికాని యిది తెల్లగా నున్నదే?"

దొంగయిట్లనెను:- "నేను దెచ్చినపుడు దీని రంగెఱుపే ఇప్పుడు తెల్లదిగా నేలనయ్యెవో తెలియకున్నది?"

ఆతని స్పష్టమగు సత్యవచనములచే రాజసేవకులపైఁ బ్రభావముపడెను. వారు వినీతభావముతో నిట్లనిరి :- "నీవు మా వెంటనొక పెద్దదగ్గఱకు రావలయును."

వానిని రాజకర్మచారులు రాజు సమీపమునకుఁదెచ్చిరి. రాజడిగినను నాతఁడు సత్యమునే చెప్పెను ఆతని యీనిష్ఠను,

సత్య ప్రియత్వమునుగాంచి రాజిట్లనెను:- "మహాభాగా! నీకీనైతి కబలమే సాధనముచే లభించినది?"

ఆతఁడిట్లనెను:- "రాజా! ఇది ప్రసంగవశమున నొకసారి అనిచ్ఛా పూర్వకముగనే కథాశ్రవణము చేసిన ఫలము. మా అమ్మ నన్ను భగవత్కథలను వినవలదనినది. ఒకసారి దైవవశాత్తుగ ముల్లు విరుగుటచేఁగథలోని సత్యమహిమను గూర్చిన విషయము కర్ణముల ద్వారా నాహృదయమునఁబ్రవేశించి నది హృదయము నకుఁబోక యీ చెవినిఁబడి ఆ చెవికుండా పోయియుండిన నిట్లయ్యేడిది కాదు. అది నా హృదయమున బాతుకొని పోయినది. ఆ దినము నుండి నేను సత్యమును బ్రలు కుటకుఁబ్రతిజ్ఞ నొనర్చితిని. మహారాజా! సత్యమహిమమున నెట్టని గుబ్బము తెల్లదికాఁగా నల్లనైన నాహృదయము దాని వలన స్వచ్ఛమేలకాదు? సత్యమహిమము చాలా గొప్పది. కథాశ్రవణ మెన్నటికిని వ్యర్థముగాఁబోదు."

ఆ చోరుని యీ నిష్ఠనుగాంచి రాజాతని పాదముల మీదఁబడి యిట్లనెను:- "మహాబాగా! నీవు ధన్యుఁడవు. నీకథ వినిన సార్థకము. ఇప్పుడు నీవు దొంగతనమును మానుము. నీవును నేనును గలిసి యిచ్చటనే భగవత్కథను నిత్యనియమ ముతో శ్రవణమొనర్చెదము. ఆ దినమునుండి యిద్దరును నియ మముగ భగవత్కథను వినుచుండిరి. నిరంతరము భగవత్ స్మృతిలోనే కాలమును గడుపుచుండెను. కావున మహారాజా!

అకస్మాత్తుగఁ కథలో నొక్క శబ్దము చెవినిఁ బడుటచేతనే యిట్టి ఫలము కలుగఁగా నిత్యము గథాశ్రవణము చేయువారి విషయమునఁ జెప్పవలసిన దేమున్నది ?"

అంతశౌనకుఁడిట్లనెను :- "సూతా ! ఆ చోరున కొక్క శబ్దమువలననే యింతటి ప్రభావము పడినదే. మేము ప్రతి దినమును నిరంతరమును వినుచున్నామే. మాకట్టి ప్రభావము పడదేమి ? ఈ విషయమున మేమొక కథను వింటిమి. దానినిఁ జెప్పుమనినఁజెప్పెదము.

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! చెప్పుఁడు.

శౌనకుఁడిట్లనెను :- "సూతా ! ఒక నగరములో నొక శెట్టిగారు నివసించుచుండెను. మంచివాఁడు ధర్మాత్ముఁడును. సాధారణముగ శెట్లు భక్తులుగనుందురు. ఈతఁడును నట్టే భక్తుఁడు. అందఱాతనిని భక్తుఁడు భక్తుఁడని పిలుచుచుండిరి. అతఁడన్న వ్యాపారము చేయుచుండెను. నిత్యమును బురాణమును వినుటకు మందిరమునకుఁబోవుచుండెడువాఁడు. ఒక దినమున నాతని కొడుకును గూడ కథకుఁ దీసికొనిపోయ్యెను. బాలకుల బుద్ధి శుద్ధముగనుండును. దానికి మాయమర్మముండదు. వారు వినినది చేయుచుందురు. ఆ దినమునఁ గథలో "గోవుమేయుచుండినను ద్రాగుచుండినను దానినీవలకు లాగరాదని వచ్చినది. పిల్లవానికీ విషయము హృదయమున నాటెను. పిల్లవాఁడు దుకాణములోఁ గూర్చుండి యుండెను. ఇంత లోనే

ఒక గోవువచ్చి దుకాణములోని యన్నియును దినఁజొచ్చెను. పిల్లవాఁడు దానిని తోలలేదు. ఇంతలోనే భక్తుఁడు వచ్చెను. చూచి అదరిపడెను. పిల్లవానిని గోపపడి యిట్లనెను :- "ఆవెంత సేపటి నుండి తినుచున్నదో దీనిని నీవు తోలలేదేమి ?"

పిల్లవాఁడిట్లనెను :- "తండ్రీ ! తినుచున్న ఆవును దోలఁ గూడదని నేను నిన్న కథలో వినియుంటిని."

అత్యంత క్రుద్ధుఁడై శెట్టిగారిట్లనెను:- "నీ వెట్టి వాఁడవో కథయు నట్లేయున్నది. ఓరి మూర్ఖా ! కథలోని విషయము దుకాణములోనికిఁ దెచ్చుటేమిటి ? విన్నదేమో వెంటనే ఆ పండితునకే వప్పగించి రావలెను. పండితుని కథ పండితుని నెత్తి యందేయుండును. సూతా ! ఆ శెట్టిగారు ప్రతి దినము కథను వినుచుండును. ఆతని యందు ప్రభావమేల పడలేదు ?"

ఇదివిని సూతుఁడు గంభీరుఁడై యిట్లనెను :- "మహా భాగా ! కథాశ్రవణ మెన్నటికిని వ్యర్థముకాదు. ఇది వేఱు విషయము. కొందఱ హృదయములందు తక్షణము ప్రభావము పడును. కొందఱ హృదయములందాలస్యముగను, కొందఱకు కేవలము సంస్కార మాత్ర శేషముగనుండును. దాని ప్రభావ మీ జన్మమునఁగాకున్న మఱు జన్మముననైనఁ గలుగును. కథా ప్రభావము విశేషముగ శ్రోతల యొక్క యోగ్యతమీఁద నాధార పడి యుండును. ఆతని హృదయమందెంతటి యుత్సాహము, ఎంతటి జిజ్ఞాస ఎంతటి దృఢతయున్నదో దానినిఁబట్టి ఫల ముండును. శ్రోతయేగాక వక్తయొక్క ప్రభావము కూడ

యుండును. వక్త నిర్లోభుఁడును, సదాచారియునగుచో నాతని కథయును సారగర్భితముగ నుండును. వక్త శీలరహితుఁడై, కేవలము ద్రవ్యలోభముచేఁ బుస్తకమును బట్టుకొని యింటింట కథను జెప్పుచుఁదిరుగుచుండినచో, కథా శబ్దములమీఁద నాతని దృష్టినుంచక కేవలము ధనము మీఁదనే యుంచుచో నిట్టి సార హీన కథవలన నే మాత్రమును ప్రభావముండదు. మీరు శ్రేష్టి గారి దృష్టాంతమును జెప్పితిరి. కావలయుననిన నేనొక పండి తుని దృష్టాంతమును జెప్పెదను."

శౌనకుఁడిట్లనెను:- "సూతా ! చెప్పుము. కథా దృష్టాంత ముల లొసంగుటే నీపనికదా !"

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ఒక పండితుఁడుండెడు వాఁడు. ఆతఁడింటికిని వెడలి యేదో తెచ్చుకొను చుండెడు వాఁడు. కథను గూడ వినిపించెడువాఁడు. దశమీదినమునఁ దన యింటికి వంకాయలను దెచ్చి తన భార్యతో నిట్లనెను :- "ఏమేఁ ! రేపు నీవీ వంకాయలను జక్కఁగా బిండి కారము వగైరాలు పెట్టి గుత్తివంకాలను వేయించవలెను". ఆమె అట్లే ఆ యేకాదశీ దినమున వంకాయ కారపుకాయలనుజేసి తానును బురాణమును వినవచ్చునని వెడలెను. ఆనాఁడా పురాణములో నేకాదశీ దినమున నెవనికడుపులో వంగగింజ నిలిచియుండునో ఆతఁడన్నివేల వత్సరములు నరకములోఁ బడియుండవలయు నను సంగతి వచ్చెను. ఇది విని పండితుని భార్య చాల భయ

పడి. యింటికి వచ్చి అంతయుఁ సిద్ధమైన వంకాయ కూరను
విసరి పాఱవైచెను.

కథ పూర్తికాఁగానే పండితుఁడు వచ్చెను. భార్య పచ్చడి
వేసి పెట్టెను. పండితుఁడిట్లడిగెను :- "నేఁడేల కూరను జేయ
లేదు ?"

పండితుని భార్య యిట్లనెను:- చేసితిని. వంకాయ కూరనే
చేసితిని, వచ్చి దానిని వెంటనే పాఱవైచితిని."

పండితుఁడాశ్చర్యముతో నిట్లడిగెను :- "ఎందుకే,
ఎందుకే, ఏల పారవైచితివే ? ఎందుకనియే ?"

పండితుని భార్య యిట్లనెను :- "ఏమైన దేమి ? మీరే
చెప్పితిరికదా కథలోనేకాదశీ దినమున నెవనికడుపులో నెన్ని
వంగగింజలుండునో అన్నివేల వత్సరములు నరకములో
నుండవలయునని. ఒక్క వంకాయలోనే వేలకొలఁది బీజము
లున్నవి. అందువలనఁ బాఱవైచితిని."

ఇది వినిపండితుఁడు నవ్వియిట్లనెను :- "ఓసీ ! నీవు
కూడ పిచ్చి దానవేమే ? కథలోని వంకాయవిషయము వేఱే
పిచ్చిదానా ! ఇంటి లోనివంకాయ వేఱే, కథలోనివి కథలోనే
యుండును."

పండితుని భార్య యిట్లనెను :- "స్వామీ ! మీకథా వాచ
కుల యుక్తులు వేఱు. రెండువంకాయలున్నవని నేనెన్నఁడును
వినియుండలేదు. అవును, ఏనుగు దంతములు తినుటకు వేఱుగా

నుండును, గనఁ బడుటకు వేఱుగానుండును. నేను తినఁ జాలను. మీరు తినునెడల మరలఁ దెండు చేసిపెట్టెదను."

సూతుడిట్లనెను :- "కావున మునులారా! ఇట్టి సారహీనులైన కథావాచకుల వాక్కుల ప్రభావమెన్నటికిని శ్రోతలపైఁ బడదు. హృదయమందు స్వార్థముంచుకొని కథలోఁ గూర్చిన కపట శ్రోతలపైఁ గథాప్రభావమెంతగాఁ బడవలయునో అంతగాఁబడదు. అయినను నకరణాత్ మందకరణము శ్రేష్ఠమని చెప్పఁబడి యుండుటచే నసలు చేయనిదానికంటె నేదో చేయుట శ్రేష్ఠము. మనస్సు నిలువక పోయినను గథలోఁ గూర్చుండవలయును. కొద్దిగనో గొప్పగనో సంస్కారములు పడఁగలవు. ఏదో ఒక మంచి మాట చెవులలోఁ బడఁగలదు. యోగ్యుఁడగు విద్వాంసుఁడును, సంశయచ్ఛేత్తయగుఁ గథావాచకుఁడు లేనియెడల నెట్లు వేలుండిన నట్లు భగవచ్చరిత్రమును వినవలయును. భగవచ్చరిత్ర మెట్లువిన్నను నది కల్యాణకారియే కాఁగలదు. కావున భగవత్కథలను శ్రద్ధాపూర్వకముగ శ్రవణమొనర్చుట ఆత్మానుభవమునకు సర్వశ్రేష్ఠమును, సర్వోపయోగము కల సులభసాధనము. కథాశ్రవణమందు శ్రద్ధకు ప్రధానస్థానము కలదు. శ్రద్ధలేక వినిన లాభమంతగా నుండఁజాలదు."

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా! శ్రోతలందఱపైనఁ గథాప్రభావమొక్కరీతిగా నేలపడదు కొందఱకు గథవలన

మిక్కిలి లాభము కలుగును, కొందఱిదివఱకు కంటెఁ బడి పోవుటను గాంచుచున్నాము."

ఇదివిని సూతుఁడిట్లు ప్రత్యుత్తర మొసంగెను :- "స్వామి ! ఇది అధికారభేదమునఁ గలుగును. కథ కెట్టి యధికారియగు శ్రోతయుండిన వానియందట్టి ప్రభావము పడును. శ్రోతలైదు విధములు."

శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! ఐదురకములవారెవ రెవరు ?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ఒకఁడు కదురు శ్రోత, ఒకఁడు మూర్ఖశ్రోత, ఒకఁడు చేటవంటి శ్రోత, ఒకఁడు జల్లెడ వంటి శ్రోత, ఒకఁడు సోమరిపోతు శ్రోత."

శౌనకుఁడిట్లనెను :- "సూతా ! వీనిని వ్యాఖ్యానించుము. కదురు శ్రోత లెవరు ?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! కదురును రాట్నమునకుఁ దగిలించి మంచి, చెడ్డ, లావు, సన్నము, నిర్మలము, మలయుక్తమునగు నెట్టి దారమునైనఁ గానిండు దానికి చుట్టినచో నది చుట్టుకొనును, కాదనదు, అట్లే కథలో వచ్చు మంచిచెడ్డలను తెంటిని జ్ఞాపకము పెట్టుకొను వారిటువంటివారు. వీరినిఁగదురు శ్రోతలందుము."

శౌనకుఁడిట్లనెను :- "మూర్ఖశ్రోత యెట్టివాఁడు ? సూతా !"

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! కథా వాచకునివైపున కదేపనిగాఁ జూచుచుఁ దనకు ప్రయోజనపడు వాక్యములు

వచ్చినపుడు వానిని గ్రహించి, ఇతర విషయములందు ధ్యాన మ్ముంచనివాఁడు, కథలో శ్రాద్ధబాహుళ్యము పనికిరాదని విని యిదివఱకు పది పదునైదుగురు బ్రాహ్మణులకు బెట్టువాఁడిద్దరు ముగ్గురకే పెట్టును, కథలో శ్రాద్ధదినమున యథేష్టముగ బంధు బాంధవులకును భోజన మిడవలయునను సంగతియును వచ్చి నది. అయినను దానిని వదలివేయును. ఇట్టివారు కథవలనఁ బారమార్థిక లాభమును బొందఁజాలరు. ఇతరుల నవహేళన మొనర్చుటకును, ఖండన మొనర్చుటకును, స్వార్థమును సాధించుటకును బనికివచ్చెదరు."

అంత శౌనకుడిట్లడిగెను:- "చేటవంటి శ్రోత యెట్టివాడు?"

అంతసూతుఁడిట్లనెను :- "స్వామీ ! చేఁట చెడ్డ వస్తువు లను, రాళ్ళు మట్టిని ఒక ప్రక్కకుద్రోసి మంచి మంచి బియ్య మును బాగుజేసి తనకడ నుంచుకొనును. అదే విధముగ హంస నీరక్షీర వివేక మొనర్చునట్లు వివేక సిద్ధాంతము ద్వారా భగ వద్భక్తినిఁ బ్రభు ప్రేమకును సంబంధించిన అతిమధుర సరస విషయములను ధరించి, యితర విషయములను, అర్థసంబంధ మగు విషయములను విశేషముగ లక్ష్యపెట్టకుండువారు చేట వంటి శ్రోతలు. ఇట్టి శ్రోతలే ధన్యులు. వారే శ్రద్ధతోఁ గథా శ్రవణమొనర్చి అత్యధిక లాభమును బొందుదురు."

అంత శౌనకుఁడు కొంచెమాగి యిట్లడిగెను :- "జల్లెడ శ్రోత లెట్లుందురు ?"

సూతుఁడిట్లనెను :- "జల్లెడలోఁ బిండినిగాని, యింకేదైన గింజలనుగాని పోసి జల్లించిన మంచి మంచి వాటిని క్రిందకు

విడిచి చెడ్డవన్నియును ధరించునట్లు కథలోని చెడ్డ విషయమును గ్రహించి మంచి విషయములను విడుచునట్లుండును. ఒకానొక కథలో మాంస భక్షణము దోషములేనట్లు వచ్చినదనుకొనుడు. ఇంకొక దానిలో సురాపానము స్వాభావికమని వచ్చును. వీనిని మాత్రము గ్రహించును. దీనికితోడు నిషేధవాక్యములను గమనింపఁడు. ఇట్టివారు జల్లెడవంటి శ్రోతలనఁబడుదురు."

శౌనకుఁడు మరల నిట్లడిగెను :- "సూతా ! అయిదవవాఁడు సోమరిపోతు శ్రోత చెప్పఁబడెనే వారి లక్షణమేమి ?"

తన నవ్వునాపుకొనుచు సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ఈ సోమరిపోతు శ్రోతలక్షణము లేమని చెప్పుదును. కథకేదో కారణమునఁబోయి, యేదో గోడకానుకొని కూర్చుండును. 'నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్' అను మంగళాచరణ మొనర్పఁగానే నిద్రపోయి చివరకు లేచును. ఇంటినుండి యెట్లు పోయినాఁడో మరల నట్లే తిరిగివచ్చినాఁడు."

ఒక సోమరిపోతు దృష్టాంతమును జెప్పెదను వినుఁడు. ఇట్టి శ్రోత సంకోచవశమునఁ గథలోనికిఁబోయెను. శ్రీమద్భాగవతములోని నవమస్కంధమున రామలీలకథ అతిమధురముగ జరుగుచుండెను. కథావాచకుని కంఠ మత్యంత మధురముగను, కోమలముగ నుండెను. కాని యెవరికి పాపోదయమైనదో వారికిట్టి మధురకథ యందు నిద్రవచ్చి తీరుచు. వారు గోడనానుకొని కూర్చొని గురకలు పెట్టుచుఁ దూగుచుందురు.

స్వామీ! చాలమంది నిద్రించునపుడు నోరు తెఱువఁబడి యుండును వాని నోరును తెఱుచుకొని యుండెను. ఇతరులంద ఱును గథాశ్రవణమందు తల్లీనులై యుండిరి, మధ్య మధ్య చాలశంకలు కలుగుచుండెను. కథావాచకుఁడు వానిని నివారణ మొనర్చు చుండును. ఆతని నోటినుండి శంకా సమాధానము లను విని అందఱును సాధు సాధు అనుచుందురు. ఇంతలోనే అచ్చటికొక కుక్కవచ్చెను. అది పెద్దదికాదు. చిన్నపిల్ల. దానికి లఘుశంక కలిగెను. ఈ సోమరి శ్రోత నోరు తెఱచుకొని నిద్ర పోవుచుండ నాకుక్క కాలెత్తి వాని నోటిలో లఘుశంక యొన ర్చెను. ఇంతలోఁ గథ సమాప్తియయ్యెను. "అచ్యుతం కేశవం రామనారాయణం, కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్" అని అందఱును బలుకసాగిరి. ఒక్కసారిగా శ్రోతలందఱును బలు కుటను విని కుక్క చెప్పకుండ పాఱిపోయెను. పాఱిపోవు నపుడా లఘుశంక (మూత్రము) ఆ శ్రోతయొక్క వస్త్రముపైఁ నఁగూడ పడెను. అందఱిట్లనిరి:- "ధన్యులము. నేఁడెటువంటి కథ? అమృతవర్షము కురిసినది." కోలాహలము వినఁగానే సోమరిపోతు శ్రోతకును నిద్రతెలిసెను. అమృతవర్షము విషయ మును విని ఆతఁడిట్లనెను:-"అవును, అమృతవర్ష మవశ్యము కురిసినది. కాని అమృతము కొంచెముప్పగనున్నది. ఒకసజ్జ నుఁడిది చూచుచుండెను. అతఁడు కడుపుబ్బ నవ్వుచు దొరలుచు నిట్లనెను:- "కథకువచ్చి నిద్రించువారికిట్టి యుప్పని అమృత

వర్ష మిచ్చుటను నచ్చుటఁ బరలోకమునను ద్రావుట కవ్వారిగ లభించును."

సూతుఁడిట్లనెను:- "మునులారా! కథకుఁబోయి నిద్రించుటయును, అఱచుటయును, మాటలాడుటయును జాల పాపము. కథకు వినఁబోయినపుడు ముందుగా శ్రద్ధతో భగవంతునకును, కథా వాచకుఁడగు వ్యాసునకును, పుస్తకమునకును, సమస్త శ్రోతలకును ప్రణామము కావింపవలయును. యథా యోగ్య స్థానమున మెదలక నమ్రతతోఁ గూర్చుండవలయును. తన దృష్టిని వక్తవైపునకే ఉంచవలయును-అటు నిటు నితర పురుషులను స్త్రీలను జూడరాదు. ఈ విధముగ నెవఁడు శ్రద్ధానహిత ముగఁ దెలిసికొని కథను వినునో వారి కతి శీఘ్రముగ లాభము కలుగును. ఎట్టివాఁడువచ్చి కథలోఁ గూర్చుండినను నేదో మంచిమాట చెవులలోఁబడి తీరును."

కథాశ్రవణమెట్టి చక్కని సాధనమో అదేవిధముగఁ ప్రభుని గుణకర్మ కీర్తనమును శ్రేష్ఠసాధనమే. భగవానుఁడెట్టి కర్మలొనర్చెను. శ్రీకృష్ణావతారమున నెట్టి యద్భుతలీలలు జరిగినవి. రామావతారమున నేవిధముగ నసురసంహార మొనర్చి సురలను సుఖపెట్టినాఁడు? భగవంతుఁడెట్టి భక్తవత్సలుఁడు దీన బంధువు. అశరణశరణుఁడు, ప్రణత ప్రతిపాలకుఁడు. శరణాగతవత్సలుఁడు, ఆర్తిహరుఁడు. ఈవిధముగ నేపదములందు భగవానుని గుణకర్మములు వర్ణింపఁబడినవో అట్టి పదములను గానముచేయవలయును. అట్టిచరిత్రములను బఠింపవలయును.

ఇదియును భక్తినభివృద్ధినిఁ జెందించుటకును, ఆత్మానుభవమున కును బ్రధానసాధనము. ప్రహ్లాదుఁడు దైత్య బాలకులతో నిట్లనెను:- "మీరాత్మానుభవ మొనర్పదలచుచో భగవంతుని గుణ, కర్మ, నామములను నిరంతరము కీర్తింపవలయును, ఇప్పుడే మీచేఁ గీర్తనమును జేయించెదను, ఇంకఁ గొన్ని ముఖ్యసాధనలనుగూడ చెప్పెదను."

అంత నసురబాలకులిట్లనిరి:- "మనస్సు స్వాభావికముగ రమించుటకేదైన సరళసాధనమును చెప్పుము,"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను:- "సోదరులారా! ఇన్ని సాధనములు చెప్పుటకు ముఖ్యోద్దేశము భగవంతుని చరణకమలములను చింతించుట. వీనియన్నిటితో భగవంతుని ప్రతిమలను ప్రేమపూర్వకముగ యథాలబ్ధోపచారములతోఁ బూజించుట, శ్రద్ధతో దర్శించుట ఇదియే సర్వోపరి సాధనము."

అసుర బాలకులిట్లనిరి:- "భగవంతుని ప్రతిమల నెట్లు పూజింపవలయును?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను:- "ఇది చాల పెద్దక్రియా యోగమున నగాధవిషయము. పాంచరాత్రాదితంత్ర శాస్త్రములందుపూజలనేక ప్రకారములుగఁ జెప్పఁబడినవి. ఎవరికేది అనుకూలమో, ఏపద్ధతి వారికి వంశపరంపరగా వచ్చుచున్నదో వారి వారి సంప్రదాయానుసారముగ శ్రద్ధతో భగవంతుని అర్చా విగ్రహములకు సేవాదిపూజలొనర్ప వలయును. సేవకు

ముప్పది రెండుపచారములు. షోడశోపచారములు, పంచోపరా
త్రాది అనేకోపచారములు కలవు. తనశక్తినిబట్టి, సామర్థ్యమును
బట్టి. పూజాసామగ్ర్యుపలబ్ధినిబట్టి పూజ చేయవలయును.
ఏమూర్తికి మంత్రముల ద్వారా విధ్యుక్తముగఁ బ్రతిష్ఠయైనదో
దానిపూజ చేయవలయును. లేదా మృత్తితోఁ మూర్తిని నిర్మించు
కొని, దానియందు దేవతాహ్వానమొనర్చి పూజింపవలయును
పూజాంతమున విసర్జన మొనర్పవలయును. అచల ప్రతిమ
లందు ఆవాహన విసర్జనలుండును. లేకుండును. అన్నిటి కంటె
సరళపూజనముసాలగ్రామపూజనము దీనికిప్రతిష్ఠగాని,చలాచల
భేదము గాని ఆవాహన విసర్జనలుగానిలేవు.పురుషసూక్తములో.
నొక్కొక్కమంత్రమును బఠించుచు ఆవాహన, ఆసన,
పాద్యార్ఘ్య.ఆచమనీయ, స్నాన,పంచామృతస్నాన, యజ్ఞోపవీత
వస్త్ర, ధూప,దీప,నైవేద్య,తాంబూల, పూగీఫల,దక్షిణ,నీరాజన,
ప్రదక్షిణ,నమస్కారస్తుత్యాదులొనర్పవలయును,ఇవన్నియును,
గాకున్నఁబౌరాణిక తాంత్రికమంత్రములతోఁజేయవచ్చును. అవి
యునురాకున్నమూలమంత్రముతోడనే చేయవచ్చును. గురు
మంత్రముచేతనేస్నాన,చందన,ధూప,దీప, పుష్పనైవేద్యాదులచేఁ
బంచోప చారపూజలొనర్చవచ్చును.ఏమియునుగాకున్న జలముచే
స్నానమొనరింపుము. భగవంతుఁడిచ్చినదాని నివేదించి ప్రసాద
మును గైకొనవలెను. కడిగి నీరుత్రాగి, చూపించి తినవలెను.
ఇంతకంటె సరళమైనపూజ యేదేవతాపూజ కలదు? పూజకు

ముఖ్య వస్తువు శ్రద్ధ. భగవంతుఁడు మనపూజ కొఱకు కూర్చుండ లేదు, ఆతనికి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు కొదువలేవు. పూజ ఆయనకొఱకుగాదు. మనఆత్మతుష్టి కొఱకు. సద్భావనావృద్ధి కొఱకు. జనార్దనుఁడు భావగ్రహి. మీరు పూజా ప్రతిమలను రాళ్ళుగా భావించుచో నది రాతిఫలమునే యొసంగును. దాని యందు సచ్చిదానంద భావముతోఁ బూజించుచో స్వయముగ, సాక్షాత్తుగ సచ్చిదానందుఁడు ప్రకటమగును.ఏలననఁగా భగవంతుడన్నిటి యందును సమాన రూపముగ రమించుచున్నాఁడు. భక్తునియొక్క అనన్యప్రేమ యెచ్చటఁ గనఁబడునో అచ్చట బ్రకటమగును, ఆతని నెవ రేభావముతో భజించెదరో ఆతఁడాభావముతో దర్శన మొసంగును, భగవంతుఁడు వస్తుబుభుక్షువు, కాడు, భావబుభుక్షువు, కావునఁ బ్రతిమా పూజనమందు ప్రధాన వస్తువు భావన.

అంత శౌనకుఁ డిట్లడిగెను:-"సూతా! భావనయెట్లు చేయవలయును." జడమగు రాయియందు చైతన్యభావము కలుగుట కష్టము."

సూతుఁడిట్లనెను:-"అవన్నియును గర్మకాండ క్రియాకలాప భావనకు సంబంధించినవి.మంత్రములద్వారా భావనయు శాస్త్ర వాక్యముల మీఁద విశ్వాసమునుంచి భావన మొనర్చుటయు గురు వచనములమీఁద భావన, ఇట్లన్నిటిమీఁద విశ్వాస మొనర్చుటచే భావన దృఢమగును, మీప్రతిమ యందు చైతన్య

భావము లేనిచో మీపూజ ఉపచారమాత్రమే యగును. శ్రద్ధ భావన లున్నచో నాపూజ యేవిధిగాఁ జేసినను భగవానుఁడు ప్రసన్నుఁడగును. ఈ భావనకు సంబంధించి యీకాలములో ననేక దృష్టాంతములు కలవు.

ఒక పూజారి చాల సరళుఁడు. నిత్యము భగవంతుని మిక్కిలి ప్రేమతోఁ బూజించుచుండెను. సాయంకాలమున రాజు నిత్యదర్శనమునకు వచ్చును. అప్పుడు భగవంతుని నిర్మాల్య హారమును ప్రసాదముగ నొసంగును. ఒకదినము రాత్రి చాల ఆలస్యమయ్యెను. నేఁడు రాజు రాఁడని పూజారి అనుకొనెను. అతఁడు నిర్మాల్య హారమును స్వయముగ ధరించి శయనము నేర్పాటుచేసికొనుచుండెను. ఇంతలో రాజువచ్చిన సూచనతెలిసి, గబగబ నాతఁడు తన మెడలోనిమాలను దీసి భగవంతునకు వైచి నిలుచుండెను. రాజు వచ్చెను. దర్శన మొనర్చి పంచా మృత ప్రసాదమునుగ్రహించెను. పూజారిహారమును దీసి రాజున కొసంగెను. పూజారికి పెద్ద పెద్ద తెల్లని జుట్టుండెను. తొంద ఱగాఁ దీయుటచే నొకటిరెండు వెండ్రుకలు హారమున కంటు కొనెను. దైవవశమున రాజుదృష్టి తెల్లని వెండ్రుకలపైఁబడెను. రాజునకు కోపమువచ్చెను. పైకినవ్వుచు నిట్లనెను:- "ఏమయ్యా పూజారీ! భగవంతుఁడు ముసలివాఁడైనాఁడా యేమి? హారము నకీ వెండ్రుకలెట్లు వచ్చినవి?"

పూజారి తడబిడపడి యిట్లనెను:- "కొంచెముగ ముసలి వాఁడైనాఁడేమో?"

రాజు క్రోధస్వరముననిట్లనెను:-"మంచిది, రేపు చూపింపక పోయినచో నీకు గుశలములేదు. నీకు కఠినదండన మొనంగఁబడును,"

పూజారి యేమియును నిర్ణయించుకొనఁజాలక పోయెను. అత్యంత భయభీతుఁడయ్యెను. వెంటనే ఆతని నోటినుండి యిట్లు వెలువడెను:- "భగవదేచ్ఛ ననుసరించి జరుగఁగలదు." రాజిట్లని వెడలిపోయెను గాని పూజారికి శాంతియెక్కడిది? ఆతఁడతి విహ్వలుడయ్యెను. రాత్రియంతయును నాతనికి నిద్ర లేదు. భగవంతుఁడు పాషాణ ప్రతిమ యను భావమతనికి లేనే లేదు. ప్రాతఃకాలము కాఁగానే యేడ్చుచు నేడ్చుచు నాతని పూజను బ్రారంభము కావించెను, ప్రతిక్షణమును నాతఁడు రోమ రోమమున భగవంతునే ప్రార్థించుచుండెను:- "ప్రభూ! నేఁడు నామానమును గాపాడుఁడు. నేఁడు భక్తవత్సలుఁడుఁ కరుణసాగరుఁడను నామమును సార్థక మొనర్చుకొనుఁడు. నీవాఁడనై నేను తలారులద్వారా ఉరికంబము నెక్కఁబోవుటా? నేను మంచివాఁడను గానిండు చెడ్డవాఁడను గానిండు నీవాఁడనే. అందఱును నీపూజారిననియేయందురు." భగవంతున కన్నియును దెలియును భగవంతుని ప్రతిమనుండి యిట్లు శబ్దము వచ్చెను:-"నీవు చింతింపకుము" పూజారికి ధైర్యము కలిగెను. నేత్రములనుండి ప్రేమాశ్రువులు కాఱఁజొచ్చెను. సాయంకాలీన

హారతి నొసంగి దర్శనమునకుఁబోగా నచ్చట భగవంతునకుఁ గిరీటము క్రింద వ్రేలాడుచుండిన పెద్ద పెద్ద తెల్లని వెంట్రుకలు, వ్రేలాడుచుండెను. భక్తుని ఆనందమునకు మేఱలేకుండెను. ఇంతలోనే రాజు దర్శనమునకు వచ్చెను నేఁ డాతఁడు గంభీరుఁడుగ నుండెను,దర్శనమొనర్చి పూజారి మిక్కిలి యుల్లాసముతోఁ బ్రసాదమును జరణామృతమును నొసంగెను.ప్రసాదహారము నొసంగెను.రాజిట్లడిగెను:-"పూజారీ! భగవానుఁడు ముసలివాఁడైనాఁడా. యేమి?"

వినీతభావముతో, బూజారి యిట్లనెను:-"ప్రభూ! ప్రత్యక్షమునకేమి ప్రమాణము? మీరు దర్శించుట లేదా?"

పూజారి దృఢతా స్వరమున నిట్లనెను:-"మహారాజా! నే నెచ్చటినుండి తెచ్చి అతికించెదను. ఇవి భగవంతునికి స్వయముగ నుత్పన్నమైనవి."

రాజు శాసన స్వరమున నిట్లనెను:- "అట్లు పుట్టకుండినచో?"

దృఢతా స్వరమునఁ బూజారి యిట్లనెను:- అట్లు పుట్టకుండినచో అన్నదాతా! గజదొంగ కే శిక్షనొసంగెదరో ఆశిక్షను నా కొసంగుఁడు."

రాజు పూజారి దృఢత్వమును గాంచి రాజు మాటలాడఁ జాలక ఆవేశమున నిండి భగవంతుని వెంట్రుకలను రెండు మూఁడింటిని బలపూర్వకముగ లాగెను. వెంట్రుకలను పెరక

గానే అవి వెల్లగించుకొని వచ్చి, అచ్చటినుండి రక్తధారలు ప్రవహింపఁజొచ్చెను. రాజదిరిపోయెను.నోటమాటరాక నిర్ఘాంత పడి మందిరములో సాష్టాంగ ప్రణామము కావించెను. తన యపరాధమునకు మాటి మాటికిని క్షమాపణము వేఁడుకొనెను.

అప్పుడు భగవంతుని యాజ్ఞ యిట్లయ్యెను. నేటికిఁ బొమ్ము. నీ యపరాధము క్షమింపఁబడినది. కాని నేటినుండి నీ వంశములోని యే రాజును సింహాసనముమీఁదఁ గూర్చుండి నా దర్శనమునకు రారాదు."

సూతుఁడిట్లనెను:-"మునులారా! ఆ మందిర మిప్పటికినిఁ గలదు. ఆ వంశపురాజులు సింహాసన మెక్కక యువరాజుగా నుండు నంతవఱకే దర్శనమునకు వచ్చుచుండెడువారు. సింహాసనముమీఁదఁ గూర్చుండిన తరువాత దర్శనమునకు వచ్చుటలేదు. అందుకనియే సాధుసజ్జనులను, భగవంతుని దర్శించునపుఁడహంకారమును వదలి రావలయును. మహాభాగా! మూర్తి గడ్డిబొమ్మగాఁ గనఁబడుచున్నంతవఱకు భగవంతుఁడు ప్రకటముకాఁడు. భగవంతుని ప్రతిమ సజీవముగను జైతన్యముగను నున్నట్లు భావించుచో దానిలోఁ బ్రభువు సజీవుఁడై ప్రకటమగును. ఈవిషయమున నొకగొప్ప మనోరంజకమగు దృష్టాంతమును వినుఁడు,

ఒకవ్యక్తి ఒకానొక మహాత్మునితో నిట్లనెను:-" స్వామీ! మాకే దేవతాపూజనముచే శీఘ్రముగ సిద్ధికలుగునో చెప్పుఁడు. సాధువొక చక్కని భగవన్మూర్తి నొసంగి యిట్లనెను. "నీవు

దీనిని నిత్యనియమముగఁ బూజించుకొనుచుండుము. భక్తిభావ ముతోఁ బూజించుకొనుచో నీతఁడు శీఘ్రముగ నీకు దర్శన మొసంగి నీకోరికలన్నిటినీయఁగలడు." ఆతఁడు నిర్మలమైన శుద్ధాంతఃకరణము కలవాఁడు. ఏంతో కాలము పూజచేసెనుగాని ఆతనికి భగవంతుని సాక్షాత్కారము కాలేదు. ఇప్పుడాతనికి భగవంతునిపైఁ గోపమువచ్చెను. నేనీతని నెంతో భక్తితోఁ బూజించుకొనుచున్నాను. ఈతఁడు నాయెడల బసన్నుఁడుకాఁడు." క్రోధకారణమున నిప్పుడాతని అష్ఠ పూజనమునుండి తప్పుటచే నింకొక సాధువు కడకుఁబోయి,తనదుఃఖమునంతను జెప్పుకొని యిట్లనెను. "నేనెన్నాళ్ళనుండియో భగవత్పూజన మొనర్చుచున్నాను. నాకేమియును లాభము కనఁబడలేదు.

సాధువిట్లనెను:-"నీవెవరి పూజన మొనర్చుచున్నావు?"

ఆతఁడిట్లనెను:- "నేను చతుర్భుజుండగు విష్ణుభగవానునిఁబూజించుచున్నాను."

ఆసాధువుశైవుఁడగుటచేనిట్లనెను:-" ఓయీ విష్ణుఁడేమి ప్రసన్నుడగును? ఆతఁడు క్షీరసాగరములో నిద్రించుచున్నాఁడు ఆతఁడు మెత్తని శేషశయ్యపై, లక్ష్మీదేవి పాదములు పట్టుచుండ గాఢనిద్రపోవుచు వారివైపునకుఁగూడ చూచుటలేదు. శివపూజ నొనర్చుము శివుఁడాశుతోషుఁడు. ఆతనికి పైనఁగొంచెము నీరుపోసి, కొంచె మఱచినచోఁబ్రసన్నుఁడగును," అని పలికి ఆతఁడొక శివలింగము నొసంగి నిత్యనియమముచేఁ బూజన మొనరించుకొనుమని చెప్పెను,"

ఆతనికి భగవంతునిపైఁగోపమిదివఱకే యుండెను. క్రోధముతో నా భగవత్ప్రతిమను దీసి గోడపైనఁబెట్టి అచ్చట శివ లింగమును స్థాపించెను. మిక్కిలి ప్రేమతో నాతనిపూజ నొనర్చుచుండెను. ఒక దినమున నాతఁడెచ్చటి నుండియో మంచి కస్తూరి కలిసిన సుగంధధూపపు వత్తినిఁదెచ్చెను. శివుని సమ్ముఖమున దానిని వెలిగించెను. ఆ పొగ సరిగాఁబైకిపోవు చుండెను. అచ్చటనే భగవన్మూర్తి పెట్టఁబడియుండెను. ఇప్పు డాతనికి మిక్కిలి కోపము వచ్చెను. ఈస్వామి మిక్కిలి స్వార్థి. మాకు దర్శనమీయఁడు, పైనఁగూర్చుండి శివుని ధూప మును వాసన చూచుచున్నాఁడు, అనియాలోచించి దూదినిఁదెచ్చి భగవంతుని ముక్కులో శక్తి కొలది గట్టిగా దోసెను. ఇంకే మున్నది. భగవంతుఁడాతని యమాయకత్వమునకు నవ్వుకొని యిట్లనెను:- "నేను నీ యెడలఁబ్రసన్నుఁడనైతిని. కావలసిన వరమును గోరుకొనుము."

ఆతఁడాశ్చర్యముతో నిట్లడిగెను:- "స్వామీ! నిన్నుఁ బ్రసన్ను నొనర్చుకొను చక్కని సాధనము నాకు లభించినది. నాకీసంగతి యిదివఱకే తెలిసియుండినచో నింతగా నేల శ్రమ పడెడు వాఁడను? ఇదివఱకే ముక్కులో దూదినిఁగూరి యుందును."

ఇది విని భగవంతుఁడిట్లనెను:-"నాయనా! నేను ముక్కులో దూదిని గూరినఁ బ్రసన్నుఁడ నయ్యెడువాఁడనుగాను నేను

భావమును గోరుదును. నిష్ఠచే బ్రసన్నుఁడనయ్యెదను. ఇంత వఱకును నీభావన మిదియొక ధాతుప్రతిమయని. ఇప్పుడు నీకిది చైతన్యమైన దను దృఢభావన కలిగినది. గంధమును వాసన చూచుచున్నాఁడను కొనగానే ప్రకటమైనది,"

సూతుఁడిట్లనెను:- "మునులారా! భగవదర్చనామూర్తి యందు సాక్షాత్తుగ సచ్చిదానందభగవానుఁడున్నాడను బుద్ధి నుంచు కొని పూజచేసినచోఁ బ్రభువు శీఘ్రముగఁ బ్రసన్నుఁడు కాఁగలఁడు. ఈ సమస్తోపాయములను నసురబాలకులకుఁజెప్పు చుఁబ్రహ్లాదుడిట్లనెను:-"దైత్యకుమారులారా!ఆత్మానుభవమునకు సహస్రోపాయములలో గురుసేవ. సర్వార్పణముఁ సాధు సంగము, హరిఉపాసన, కథాశ్రవణము. ప్రభునామ గుణకర్మ కీర్తనము. చరణచింతనముఁ అర్చా. పూజన. దర్శనాద్యు పాయములను నేను మీసమ్ముఖమున వర్ణించితిని. ఇప్పుడు మీ రేమి వినఁదలఁచుచున్నారు?

అంత దైత్యబాలకులిట్లనిరి:- "సోదరా! ఈసాధన లొన ర్చుటచే నేమి జరుగునో తెలిసికొనఁగోరుచున్నాము."

ప్రహ్లాదుఁడిట్లనెను:-"ఈ సాధనములను చేయఁగాఁ జేయఁగా భగవంతునియందు స్వాభావిక రతికలుగును."

అంత దైత్యబాలకులిట్లనిరి:- "నీవు మాటి మాటికి రతి రతి యనుచున్నావు. రతియన నభిప్రాయమేమి? భగవంతుని

యందు రతి గలుగుటచే మానవుని కెట్టిదశ కలుగును? దయ చేసి యీ విషయములను మాకుఁ జెప్పవలయును,"

అసుర బాలకులిట్లువలుకగాఁ బ్రహ్లాదు డిట్లనెను :- "మంచిది. ఇప్పుడు మీకందఱకును భగవద్రతి సంబంధమును గూర్చి చెప్పెదను. భగవత్ప్రేమయందనురక్తులైన భక్తుల లక్షణములను గూర్చి చెప్పెదను. మీరందఱును సావధానులరై శ్రవణమొనర్పుఁడు."

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:- రాజా! స్రాథననుజెప్పి యిప్పుడు ప్రహ్లాదుఁడు నేనుజెప్పిన యుపదేశమును స్మరించి భగవంతునిపై నెట్టి యనన్యప్రీతి యుండవలయునో, అట్టి భక్తుల కెట్టి యలౌకిక దశ కలుగునో దానిని వర్ణించుట కుద్యుక్తుఁడయ్యెను.

)o(

# ప్రభు పాదపద్మములందు రతి

౪౨౬

శ్లో॥ ఏవం నిర్జిత షడ్వర్గైః క్రియతే భక్తిరీశ్వరే।
వాసుదేవే భగవతి యయా సంలభతే రతిమ్॥

(శ్రీభాగ. ౭ స్కం ౭ అ. ౩౩ శ్లో.)

వ. "...........భాగవత ధర్మంబులపై రతి గలిగు సర్వాభూతంబులయందు నీశ్వరుండు భగవంతుడాత్మ గలండని సమ్మానంబు సేయుచుఁ గామ క్రోధలోభ మోహ మద మత్సరంబులన్ గెలిచి యింద్రివర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణుదేవుని యందలి గతి సిద్ధించు"

....శ్రీ మదాంధ్రభాగవతము.

శ్రద్ధాపూర్వకముగఁ జేయఁబడిన సమస్త సాధనముల కేకైక ఫలము శ్రీకృష్ణచరణార విందంబులందు రతి కలుగుటయే. శ్రద్ధ యొక్క పరిపక్వావస్థయే రతి. రతియే చివరకు భక్తిరూపమునఁ బరిణమించును. శ్రద్ధవలన రతియు, రతివలన భక్తియుఁగలుగును. ఇదియే క్రమము. రతియనుము ప్రేమయనుము దీనిలో భేదములేదు. శ్రద్ధా, రతి, ప్రేమ, భక్తులన్నియును సామాన్యముగ నొక్కటియే. అవస్థా భేదముచే వీనికి నామభేదము లేర్పడినవి. శ్రద్ధసాధారణముగా గుణములకుఁగారణమగును. గుణములు లేకున్న శ్రద్ధ తగ్గిపోవును. ఒకానొకని వ్రాతనుగుఱించియు' వక్తృత్వ కళాకౌశలమును గుఱించియు మనము గొప్ప ఖ్యాతిని వినియుందుము. అప్పుడాతనిమీఁద మనకు శ్రద్ధకలుగును. కాని సాక్షాత్కారమై మనమనుకొన్నంత గాలేకున్నచో మన శ్రద్ధ తొలఁగిపోవును. ఇదివఱలో ఁదపస్వి, సదాచారియని తెలిసియుండుటచే మనకాతనియందు శ్రద్ధకలిగినది. తరువాత నాతఁడుట్టివాఁడు కాఁడని తెలిసినమీఁదట నది

తగ్గిపోవును. శ్రద్ధే పరిపక్వమై, తగ్గని దైనచో దానిని రతియందు సంబంధము బలపడును. ఆత్మీయత యేర్పడును గుణావ గుణ ధ్యానముండదు అతని ప్రతిచేష్టయును, బ్రతిక్రియయును బ్రియముగ నుండును. ఆతనియొడల స్వాభావికానురాగము కలుగును. ఆతనిచేతన యందు, స్మరణమందు, నామమందు, సంయోగమందు, వినియోగమందు, హాసమందు, క్రోధమందు, ప్రీతియందు, తిరస్కారమందు, సత్కారమందు ఇట్లన్నిటి యందును నొక యనిర్వచనీయమగు నానందము కలుగును. ఈరతి పరాకాష్ఠను జెందినపుడు ఇష్టరూపముతప్ప యింకేమి యును గనఁబడదు, అదియే భక్తి. అదియే కాష్ట. అదియే పరా గతి. దీనికావలనేమియును లేదు. ఏమియునులేదు.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుడిట్లు చెప్పుచున్నాఁడు. "రాజా? అసుర బాలకు లడుగఁగఁ బ్రహ్లాదుఁడు రతినిగూర్చి యిట్లు చెప్పుచున్నాఁడు:- "సోదరులారా! భవనమశుచిగ నుండి నచో దానిలోఁజోరులు వసింతురు. అంతవఱకు మంచివాఁడచ్చట నెవఁడును నివసింపఁబోఁడు. అదేవిధముగ మన మలినాతఃకర ణమందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను నీయార్గురు శత్రువులున్నంత వఱకు హృదయమందు ప్రేమ, భగవత్సాక్షాత్కారములగుట అసంభవము. వస్త్రము, జలము ఇవిస్వాభావికముగా, స్వచ్ఛముగ నుండును. వీనికేరంగువైచిన నారంగువికలమగును. జన్మ జన్మాంతర సంస్కారములచే

నంతఃకరణమందు నానావిధములగు గోరికలు నిండియుండుసు, మనయిచ్ఛకు విఘాతము కలిగి, మనోనుకూల కామము ప్రాప్తింపకున్నచోఁ గ్రోధము కలుగును. ముందుగా మానసిక క్రోధ మేర్పడును. అనంతరమది వాక్కుతోవ్యక్తమగును. తరువాత నది యింద్రియములద్వారా ప్రహారాదులద్వారా ప్రకటమగును. అగ్ని యే వస్తువునకుఁ దగుల్కొనిన ముందు దానినిఁగాల్చి తరువాత రెండవదానినిఁ గాల్చును అట్లే క్రోధ మే యంతఃకరణమున నుత్పన్నమగునో, ముందు దానినిఁ గాల్చి యితరులకు హాని కావించును. కావునఁ గ్రోధము మాన వునకు గొప్ప శత్రువు.

ప్రపంచములో భో పదార్థములు పరిమితములు. జీవుల లాలసలపరిమితములు. ఎన్ని భోగసామాగ్రులు లభించినను వానివలనఁ దృప్తి జనింపదు. వస్తువులు ప్రాప్తించినకొలఁది లాలస అధికమగు చుండును. దీనినే లోభమందురు. ఇది యెంత జలముపోసినను నిండని కుండవంటిది. ప్రపంచములోని విషయములన్నిటిని నొక్కనికే యొసంగినను నాలాలస పూర్తి కాదు. ఇంకను బొందవలయునను నభిలాషయుండనేయుండును. కావున హృదయమున నీ భౌతిక పదార్థముల యెడల నత్యధి కమమత్వమున్నంతవఱకు,వీని నధికమాత్రముగాఁ బ్రోగుచేయు చున్నంతవఱకు, సంగ్రహేచ్ఛయున్నంతవఱకు ప్రభుప్రేమ కలుగదు. ధనముమీఁద ప్రేమయున్నంతవఱకు ప్రభువుమీఁద ప్రేమ యెట్లు కలుగును ? మనస్సు ఒక్కటే, దానిని విషయ

ముల మీఁదనైన లగ్నమొనర్పుము, విష్ణువు మీఁదనైన లగ్న మొనర్పుము.

భౌతిక పదార్థములమీఁద నాత్మీయతయు, నొక విధ మగు నాసక్తియు నున్నచో దానిని మోహమందుము. మోహము నకును ప్రేమకును జూచుటకేమంత భేదము కనఁబడదు. భేద మేమనఁగా నశ్వరములగు సాంసారిక పదార్థములందుండు దానికి మోహమనియు నదియే అవినాశియును బరాత్పరుఁడు నగు భగవంతుని యందున్నచోఁ బ్రేమయనియుఁ బిలుతుము. విషయమోహము గలవారి యంతఃకరణమందు విశ్వేశ్వరుఁడు విరాజిల్లఁడు, ఆతనికశుచిత్వము దుస్సంగము ప్రియములు కావు. అతఁడేకాకిగా స్వచ్ఛస్థానమున నుండఁగోరును. మోహ ములేనిచోట మోహనునిస్థానము.

సాంసారిక వస్తువులు, ధన, జన, పద, ప్రతిష్ఠాది అన్యై శ్వర్యములు ప్రాప్తించినపుడొక పెద్దరికము, మిథ్యాభిమానము కలుగును. దానిని మదమందరు. మదమందు మానవుఁడంధుఁ డగును. గురు జనములనైన నవమానించును. అనరానిమాట లనును. చేయరాని కార్యములొనర్చును. నేనట్టివాఁడను, నేనిట్టి వాఁడను, నేనది చేసితిని, యిదిచేసితిని వీనిని గొట్టితిని, వానినిఁ బడవైచితినను చుండును. ధనమదము, విద్యామదము, ఐశ్వర్య మదము, రూపమదము, వయోమదము, జాతిమదము, మది రాది మదము ఈ విధముగ మదములనేకములు, ఈ మదము

లన్నియును మానవుని సంసార గర్తమందు బడవేయునవియే. కావున మదన మోహనుని మనస్సులో నధివసింపఁజేయ నిచ్ఛ గలవారు మదమును దూరమునుండియే త్యజింపవలయును.

ఇతరుల ఉన్నతిఁగాంచి అంతఃకరణమింకొక విధమగు నీర్ష్య, అసూయ పుట్టును. దానిని మత్సరమందురు. మాత్సర్యము కలవారు సాధారణముగ నితరులనుగాంచి మండిపోవుచుందురు. వారి స్వభావము విషమముగ నుండును. ఆతఁడు నాకంటె ధనములో నింతటి గొప్పవాఁడేలయైనాఁడు ? వానికి నలువైపులను బేరేల వచ్చినది ? ఆతని నిందలు పూజించుటేమి ? అని యిట్లనుకొనుచు నెవని హృదయము మండుచుండునో వానిని మత్సరుఁడని తెలిసికొనవలెను."

ప్రహ్లాదుఁడిట్లనెను :- సాధారణముగ మనము మన ప్రకృతి యందుండి లోకలజ్జనెదుటనుంచుకొని వ్యవహార మొనర్చుచుందుము. సాధ్యమైనంతవఱకు అందఱును జూచి నవ్వి వ్రేలుపెట్టి చూపించు పనుల నొనర్పము. సమాజమందు మాటలాడుట, వర్తించుట, కూర్చుండుట, నిలుచుండుట, ఆహార పానీయములను గొనుట వీనిలో నేయే సదాచారములుకలవో వానినిఁబాలించుచుందుము. సమాజమునకు విరుద్ధమగు నాచరణ మొనర్పము. మన నడవడికచే మనము మన సభ్యసమాజమందు సభ్యతను సిద్ధింపఁజేసి కొనుటకు సర్వదా ప్రయత్నించుచుందుము కాని కృష్ణ ప్రేమరూపమగు భూతము శిరస్సునధిరోహించు నప్పుడీ విషయములనన్నిటిని మఱచిపోవు

చుండుము. మస్తిష్కము తిరిగిపోవును. వేడి యెక్కువై పిచ్చి యెత్తినపుడును మానవుఁడు విస్తారముగ మాటలాడుచుండును. తల తోఁక లేక మాటలాడుచుండును. అలౌకికాచరణము కావించును. ఎవ్వరినిఁజూచి శీల సంకోచమును జెందఁడు తన యాలోచనలోనే తానుండును. మనస్సునకు నచ్చినది చేయు చుండును. ఇతరులు మనలనుజూచి యేమను కొందరో యను చింతయుండదు. దీనినే లోక బాహ్యత అందురు. భగవత్ప్రేమ సంబంధమున నిట్టిస్థితి యెంతో యదృష్టమున, జన్మజన్మాంత రములందలి యనంత శుభకర్మఫలస్వరూపమున భగవత్కృప చేతనే ప్రాప్తించును. కావునఁ గామక్రోధాది శత్రువులపై విజయ మును సాధించి వాసుదేవ భగవానుని చరణములందు రతి గలుగునట్లు ప్రయత్నించవలయును."

దైత్య బాలకులిట్లనిరి :- "సోదరా ! ఈ మాటలు నినఁ గుతూహలముకలుగుచున్నది. భగవద్భక్తుల ప్రేమదశలను గుఱించి వర్ణింపుము."

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "మంచిది, వర్ణించెదను. మీరందఱును సావధానులరై వినుఁడు."



# భగవద్భక్తుల ప్రేమ దశలు

౪౮౦

శ్లో॥ నిశమ్య కర్మాణి గుణా నతుల్యాన్
వీర్యాణి లీలాతనుభిఃకృతాని ।
యదాతి హర్షోత్పులకాశ్రు గద్గదమ్
ప్రోత్కంఠ ఉద్గాయతి రౌతి నృత్యతి॥

(శ్రీ భాగ. ౭ స్కం. ౬ అ. ౩౨ శ్లో.)

సీ॥ దనుజారి లీలావతారంబు లందలి
శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుడగువాఁడు వేడ్కతోఁ బులకించి
కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష వైకుంఠ
వరద నారాయణ వాసుదేవ
యనుచు నొత్తిలిపాడు నాడు నాక్రోశించు
నగుఁ జింతనము సేయు నతి యొనర్చు

తే॥ మరలుకొని యుండుఁ దనలోన మాటలాడు
వేన్పు సోకిన పురుషుని వృత్తిఁ దిరుగు
బంధములఁ బాసి యజ్ఞాన పటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాప్తించుదుది భక్తి వివశుఁడగుచు ॥

....శ్రీ మదాంధ్ర భాగవతము.

రసశాస్త్రాచార్యులు రతికనేక భేదములను జెప్పిరి. నవ రసములలోను రతియుండును, కాని విశేషించి రతి యొక్క పూర్ణప్రకాశము శృంగారమందే వ్యక్తమగును. దానికి ప్రధానముగ రెండు భేదములుకలవు. ఒకటి సంభోగరతి. రెండవది విప్రలంభ వియోగ రతి తన ప్రియతమునితో సమస్త విధముల సుఖములను భోగించుటకు సాధారణముగ సంభోగ రతి యందురు-వ్రజరసికులీ విషయవర్ణనమందు పరాకాష్ఠనందుకొనిరి. విప్రలంభములేక విరహావస్థలన్నియును సామాన్యముఁగ జెప్పఁబడినవి. ప్రథమావస్థకు చక్షుఃప్రీతి యందురు. నేత్రములందు దన యిష్టదైవము యొక్క మూర్తి హత్తుకొనిపోవలెను. ఆతని రూపమాధుర్యము నేత్రములలో నిలిచి పోవలయును.

ఒక్క క్షణమైన నాతని సేవింపకుండనుండఁ జాలకుండును.తృషిత నీరనయనములతో నెల్లప్పుడాతనిఁ బ్రతీక్షించుచుండవలెను. ఇట్లుండిన రతి యుదయించినదని తెలిసికొనవలయును. పరవశ నేత్రములచటకే పోవలయును. అతని నన్వేషించుటలోఁ జంచలమగుట విప్రలంభము యొక్క ప్రథమావస్థ రెండవ యవస్థయందు నిరంతరము మనస్సుతో సాంగత్యము కలిగియుండవలెను. మనస్సులో నదేమూర్తి, అదే అందము తాండవింపవలయును.మనస్సు సదా ఆతనినే చింతింపవలయును. ఆతని స్మరణమందే కొట్టుకొనవలయును.

ఆతఁడు లేక జీవింపఁజాలక, ఆమూర్తిని మరువజాలకుండుటకే విప్రలంభరతి యొక్క ద్వితీయావస్థయందురు.

తృతీయావస్థయొక్క పేరే స్మరణ. నిరంతర మాతని స్మరణమే, ఆతని చింతనమే. క్షణ క్షణము నాతని నామమే, ఆతనిరూపస్మరణమే జరుగుచుండ వలెను.

తన ప్రియతముని నిరంతరము స్మరించుటతో నెట్టిసుఖములేక దుఃఖము కలుగునో దానినిభుక్తభోగి తప్ప యింకెవరు నుదెలిసికొనఁజాలరు, కావున నీవిషయములో సాధారణులు చెప్పుట అనధికార చేష్టయే యనుకొనవలయును.

విరహము యొక్కనాల్గవ యవస్థకు పేరు నిద్రాభేదనము. ప్రియునిస్మృతి యెంత ప్రయత్నించినను నిద్రకూడ రానంత టిదిగనుండును. నిద్ర ప్రియతముని దగ్గఱకు బోయి మరల నెంతపిలిచినను రాదు.

"అస్మాకంతు గతేకృష్ణేగతా నిద్రాపి వైరిణీ"

ఈవిధముగ రాత్రిందినము లొకే విధముగ విలవిలఁ దన్నుకొనుచు ప్రియుని స్మృతిలో మేల్కొని యుండవలెను. దీనినే జాగరణము లేక నిద్రాభేదనమందురు.

అయిదవ అవస్థపేరు 'తనుతా,లేక కృశతా. నిద్రానాశనమైన తరువాత భోజనము మీఁదను గోరికయుండదు. అహార పానీయములను గొనవలయునని యుండదు. ఆవశ్యకతయును గనఁబడదు. శరీరము పంచభూతములతోఁ జేయఁబడినది. అన్నముచేతనే ప్రాణము ప్రబలును. శరీరమున్నకాహారము లభింప కుండినచో దుర్బలము, కృశమగును.ఎచ్చట విరహిణి గుఱించి

వర్ణించినను గృశలుగా వర్ణించిరి. ఒకానొక విరహిణి మంచము మీఁదఁ గనపడకపోఁగా నొకఁడు విదిలించినచో దొరకవచ్చును ఎచ్చట నైన నంటుకొని యున్నదేమో. అనఁగా విరహిణి యెండి పోయి కంటకమువలెనైన దన్నమాట శ్రీకృష్ణ విరహమందు వ్రజవనితలకు వచ్చిన దశలు, వారికి మించిన కృశతా, వ్యాకులతనుగూర్చిన ఉదాహరణములు మఱెచ్చట లభింపఁగలవు? శ్రీకృష్ణ విరహమందు గోపికలే కృశతను జెందలేదు గోధనము, గోవత్సములు శుక, పిక, కాకాదులును నేమియును దినకతనుతను ప్రాప్తించినవి.

ఆఱవ విరహావస్థ విషయ విరక్తి. ప్రియతముని విరహమునఁబుష్ప, మాలా, గంధ తైల, పరిమళములు, పరుపు. దిండు, గాన వాద్యములు, సుస్వాద భోజనాది సుఖకర విషయములందు విరక్తి కలుగుట.

ఎప్పుడైనను బ్రియతముని దర్శనమగునను నాశచేఁ గేవలము మలిన వసనము, మలోవృత కృత శరీరమందు ప్రాణములు నిలిచియున్నవి.

విరహముయొక్క సప్తమావస్థ "లజ్జా ప్రణాశనము". ప్రేమయందు లోకలజ్జ, కులపరివారమందలి పెద్దలు, వృద్ధుల మాటలకు భయపడుట యుండదు. మన యీ దశనుగాంచి

యితరులేమను కొందురో యను చింత యుండదు. ఇతరులేమైన ననుకొందురా వాగనిండు.

విరహము యొక్క అష్టమావస్థ "ఉన్మాదము" ఉన్మాదమనునది వీర్య సంబంధమగు నొక రోగము. ఆరోగము సంభవించిన వారికి శాంతిలేదు. ప్రతిక్షణము వ్యాకులతను జెందియుందురు. మనస్సునకు వచ్చిన దంతయును వాగుచుందురు. శరీర స్పృహ యుండదు, లోకలజ్జ, శీల సదాచారముల ధ్యానముండదు. పిచ్చివాని స్థితియుండును.

ఈ ప్రేమోన్మాదము శ్యామసుందరుఁడువచ్చి నాడిని పట్టుకొని చూచి, వైద్యుఁడై యుపచరించును.

విరహముయొక్క నవమావస్థ మూర్ఛ; క్షణక్షణము తెలియకఁబడిపోవుటయును, శరీరస్మృతి లేకుండుటయును. మూర్ఛయను నొకరోగము కలదు. దానిలో రోగి తటుక్కునఁ గ్రిందఁబడిపోవును. శరీర స్పృహ యుండదు.

ప్రాణము బడలికచెందును. అనఁగా మూర్ఛితయై వికలతను జెందును, ఈ తొమ్మిది అవస్థలు చెప్పుటకే. పదవది మరణావస్థ. ఇచ్చట మరణమనిన సాక్షాన్మరణముకాదు. మృత్యువుతో సమానమగు అవస్థయని తెలిసికొన వలయును. దీనికేమి యుదాహరణ మొసంగఁగలను. ప్రహ్లాదుఁడు తన యుపదేశమందు ప్రేమలోని యీ విభిన్నావస్థల నన్నిటిని మిక్కిలి తెలివిగా దిగ్దర్శనముగఁ జెప్పియున్నాఁడు.

ప్రహ్లాదుఁడసుర బాలకులతో నిట్లనెను :- సోదరులారా ! భగవంతుని మీఁద ప్రేమగలిగి, ఆతని శ్రీచరణముల మీఁద నన్య ప్రీతి యుత్పన్నముకాఁగా నాతని లీలావిగ్రహముల ద్వారా చేయఁబడిన కర్మములను స్మరించిన భక్తునకు విభిన్న లోక బాహ్యదశలుకలుగును. భగవంతుని యనుపమ సౌందర్య మాధుర్యములను స్మరించి, ఆనంద నిమగ్నుఁడై మాటిమాటికి ఱెక్కలు విదల్చుచుండును. ఆతని రోమరోమమునఁ జలి పుట్టును. క్షణక్షణము వణకుపుట్టును. వెంట్రుకలు నిక్కఁబొడుచును. రోమముల కుదుళ్ళుబ్బియుండును. కంఠము గద్గదికమగును. నోటినుండి స్పష్టముగ వాక్కు వెడలదు. ఒకటిమాటలాడఁదలచిన నొక శబ్దము వెడలును. స్ఖలిత వాక్కులతోఁ దన వేదనను బ్రకటించును. అదియును సరిగవ్యక్తముకాదు. కాని చిత్తమంగీకరింపదు. లోపలనుండిన భావములు పైకిరాఁదలఁచును. అంత కాలమున నవ్యక్త భావనలు వ్యక్తముజేయఁదలఁచును. గాయన మందు ఆమె తన హృద్గతభావములను వ్యక్తపఱచును. పాడఁగాఁబాడఁగా నామె విరహవేదనము వృద్ధి పొందును. తన ప్రియతముఁడు తనకు దర్శన మొసంగడనుకొనును. ఈ విషయము జ్ఞాపకమునకు రాఁగానే యేడ్వనారంభించును. కన్నుల నీరుగార్చును. తన ప్రాణ నాథుఁడు తనను గలిసి కొనుటకు వ్యగ్రుఁడగుచున్నాడను ననుభవమును జెందును. దద్భావభావితుఁడై, నృత్య మొసర్ప నారంభించును.

ఆమె చేష్టలన్నియును లోకబాహ్యము లగును. దయ్యము పట్టినపుడు మానవుడు అవ్యక్త ప్రలాపములు పలికినట్లును, శిరస్సును సమస్తావయవములు వణఁకునట్లును అసంబద్ధ ప్రలాపము లొనర్చినట్లును,వ్యర్థచేష్టలొనర్ప మొదలిడును.ఒక్కొక్కడేడ్చి విలపించును. "ఓశరణాగత వత్సలా ! నన్ను వీడి యెచ్చటికిఁ బోయితివి. ఓ హరీ! నేను నీవులేక యెట్లు జీవింపఁగలను. ఓ కరుణాసాగరా ? దయతో దర్శన మొసంగుము. ఓ అశరణశరణా ! సాగరమున మునుఁగుచున్న నథముఁడను నకించ నుఁడనగు నన్నుద్ధరింపుము. గోపీజన వల్లభా ! నాక భయప్రదాన నేత్రములు మొసంగుము. విలపించి విలపించి యలసిపోఁగా నేకాంతమందు నేత్రములు మూసికొని ధ్యానములో దీనత్వముత్పన్న మగును తానత్యంత హేయుఁడుగ ననుకొనును. అందఱును తనయందు. కృపఁజూపినచోఁ తన ప్రాణధనము తనకు లభించునను ననుభవము కలుగును. అందువలన నెవ్వారెదురుగఁ గనఁబడినను వారి ముందేడ్వనారంభించును. వారి పాదములను బట్టుకొని గద్గద కంఠముతో నిట్లనెను :- "నన్నుఁ గృపఁజూడుఁడు నాప్రాణేశ్వరుఁడు నాకు లభించునట్లు వర మొసంగుడు. నాదీనతను గ్రహించి కృపాళురాతనికి జెప్పక పోవుదురా ?" అందఱిట్లందురు :- ఈ విధముగ నధీరతతో నుండవలన పనిలేదు. కృపాళుఁడగు గృష్ణుఁడవశ్యము కృపఁ జూచును. దయాసాగరుఁడగు దామోదరుఁడు నిన్ను దయాదృష్టితోఁ జూడఁగలఁడు." ఈ యాశ్వాసము

లను విని ఆతఁడ దేభావములతో భావితుఁడగును. అంతఃకరణ మున నాతనిఁగలసికొనును. ఆతని ధ్యానములోఁ దన్మయు డగును. లజ్జకు దిలాంజలి నొసఁగి సంకోచమును బొత్తుగావీడి, మాటిమాటికి దీర్ఘనిశ్వాసమును విడుచుచుండును. "ఓహరీ! రక్షించుము! జగత్పతే! కృపజూడుము నారాయణా నన్ను విప త్సాగరమునుండి ఉద్ధరింపుము అచ్యుతా! నన్ను దయాదృష్టి తోఁగాంచవలయును." ఈ విధముగఁ బ్రలాపించుచు భక్తుడు మూర్ఛితుఁడగును.

ప్రహ్లాదుఁడసుర బాలకులతోనిట్లనెను :- "బాలకులారా! హృదయమునఁ గృష్ణరతియు, వాసుదేవుని యందలి అనన్య ప్రీతియుఁ గలిగినప్పుడు వానిస్థితి అవర్ణనీయమగును నలౌకిక ముగను నుండును.

)o(

## భగవంతుఁడతి సన్నికటముగ నున్నాఁడు.

శ్లో॥ కోఽతి ప్రయాసోఽసుర బాలకాహరే
రుపాసనే స్వేహృది ఛిద్రవత్సతః।
స్వస్యాత్మనః సఖ్యురశేష దేహినామ్
సామాన్యతః కిం విషయోపపాదనైః॥

(శ్రీభాగ, ౭ స్కం ౭ అ. శ్లో.)

వ........హరి భజనంబు దుర్గమంబుగాదు. హరి సకల ప్రాణి హృదయంబులయందు నంతర్యామియై యాకాశంబు భంగినుండు, విషయార్జనంబుల నయ్యేడిది లేదు."

....శ్రీ మదాంధ్ర భాగవతము.

అజ్ఞాన వశమున జీవికెంతటి మూఢత్వము వ్యాపించి నది. స్త్రీ, పుత్ర, పరివార, భూ, ధన, పరిజన, పురజనులు, ఇంకను దూరమున్న వారియందు మమత్వమును వహించును కాని అన్నసంబధము లేక అతి సన్నికటముగ నున్న ఆత్మను మఱచుచుందురు. దీనికొఱకు ప్రయత్నించు వారుండరు ఆత్మానుభూతికి వంచితులై ధాతువులకు సంబంధించిన నాలుగురాళ్ళను ప్రోగుచేసిన నేమిలాభము?

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా! అసుర బాలకుల యుత్సుకతను గాంచి ప్రహ్లాదుడు వారితో నిట్లుచెప్పఁదొడంగెను:- "ప్రేమవేగమున భగవద్భక్తుఁడు నిరంతరము భగవన్నామమును బలుకును- మిక్కిలి ఆర్తవాణితోఁ గరుణాస్వరముతో నశ్రువుమోచన నామకీర్తన మొనర్చును."

అసుర బాలకులు "దీనిచే నేమగును? ఇట్లు చేయుటచే నేమి లాభమ"ని అడిగిరి.

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ముందుగా మీరు లాభముయొక్క అభిప్రాయమును దెలిసికొనుఁడు. లాభమేమున్నది ? నాలుగు

ధాతువులతోఁ జేయఁబడిన నాణెములే లాభమా ? ఇది అతి
తుచ్ఛ లాభము దీనిచే సంసారబంధనము పెరుగును. సంసృతి
స్థాయి యగును. భగవత్పాద పద్మములందు ప్రీతికలుగుటయే
వాస్తవిక లాభము. ఈ సంసారబంధనము శాశ్వతముగ విలీ
నము కావలయును. మనస్సునందు వాసనారూపమగు జీవుఁ
డున్నంతవఱకు దాని నుండి అంకురముత్పన్నమగుచునే
యుండును. మరల మరలఁ బుట్టుటయును, భక్తిరూపమగు
నగ్నిచే వాసనా బీజము నిర్దగ్ధమైనప్పుడు దాని కెంతటి యెరువు
వేసినను, నెంతటిజలమును జల్లినను నంకురింపదు. ఇంకేమి
చేసినను అంకురింపదు. ఇదే విధముగ శరీరముతో సహా
చిత్తము భగవద్భావ భావితమైనపుఁడు శ్యామసుందర వర్ణ
రంజితుఁడై, ఆతని కనురూపుఁడగును. అప్పుడాతఁడు బంధ
ముక్తులను మాయనుండి బయట పడును.

అసుర బాలకులిట్లనిరి :- "బీజరూపమగు వాసన
దగ్ధమైనచో జనన మరణ మాయతొలఁగును. గాని బ్రహ్మ
నిర్వాణ రూపమగు పరమ పదమెట్లు ప్రాప్తించును ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా ! ప్రయత్నమంత
యును వాసనానివృత్తి కొఱకే. వాసనలు నశింపఁగానే తనకు
దానే ప్రకాశింపఁబ్రారంభించును. దర్పణము మీఁద దుమ్ము
పడిన దనుకొనుఁడు. ఆత్మ దర్శనముకాదు. దానికొఱకై ప్రతి
బింబము నెచ్చటనుండియైనను బ్రయత్నించి తేవలయునా ?

ఆధూళిని తొలఁగించుటయే ప్రయత్నము. ధూళితొలఁగఁగానే ఆత్మదర్శనము కాఁగలదు. అదే విధముగఁ కామక్రోధాది శత్రువులు నశించి వాసనాబీజము దగ్ధమై, అంతఃకరణము పవిత్రమగుచోఁ బవిత్రాంతః కరణమందు భగవద్భక్తి సంచారము కలుగును. అంతఃకరణము భగవద్భావమును జెందుటయే బ్రహ్మ నిర్వాణము. ఇదియే పరమసుఖము. ఇదియే ముఖ్యోద్దేశ్యము ఇదియే పరమ పురుషార్థము."

అసుర బాలకులిట్లనిరి :- "ప్రహ్లాదా ! భగవంతుఁడు కనఁబడఁడు. ఆతనినిఁ బొందుటెట్లు ? ఆతఁడెచ్చట నుండును. ఎచ్చటికిబోయిన నాతని దర్శనము కాఁగలదు. ఎచ్చట భజన మొనర్చిన నాతఁడు లభింపఁగలఁడు ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా ! బయట యెచ్చట నుండియో వస్తువునుదెచ్చినఁ బ్రయాసము కలుగును. భగవదుపాసనమునఁ బ్రయాసయేమున్నది ? నీవు చూడుము, చూడక పొమ్ము. ఆతఁడు బయటనెచ్చటనూ లేఁడో లోపలనున్నాఁడు ప్రతిఘటమునందును వ్యాపించియున్నాఁడు. మాయా జవనికను గప్పుకొని యున్నాడు. ఈయాజ్ఞాన జవనిక తొలఁగినప్పుడు తనకుఁదానే కనఁబడఁగలఁడు. ఆతఁడు సామాన్యముగ సమస్త ప్రాణులకును సఖుఁడు సుహృదుఁడు, బంధువు, హితైషి, శుభ చింతకుఁడు, సర్వస్వమును. ఇట్టి శ్రీహరినిఁ ద్యజించి విషయ సంగ్రహ మొనర్చుటయుందే కాలమును గడుపుట వ్యర్థము."

అసుర బాలకులిట్లనిరి:- "సంసారములో సుఖద పదార్థ సంగ్రహ మొనర్పకున్నచోఁ గల్యాణ మెట్లుకలుగును? సుఖ ప్రాప్తిలభించు టెట్లు?"



ప్రహ్లాదుఁడిట్లనెను:- "సోదరులారా! గంభీరముగ విచారించుఁడు పాముకాటును బొందినవాఁడితరుల నెట్లు రక్షింపగలుగును? నీటదాను స్వయముగ మునుఁగువాఁడితరుల నెట్లుద్ధరింపఁగలఁడు? స్త్రీ, ధన, పశు, పుత్ర, గృహ, భూమి, గజ, తురగ, వాహన. పరిచ్ఛదాది విషయోగ సామగ్రులను సుఖప్రాప్తి సాధనములుగ భావించు చున్నారే యివన్నియును నశ్వరములు, అనిత్యములు, క్షణభంగురములు. అట్టియెడ నివి యీ మానవునకుఁ బ్రియమొనర్చుట యందెట్లు సమర్థములు కాఁగలవు? ఈ నశ్వరములగు విషయభోగోప భోగముచే నవినాశియగు శ్రీహరి యెట్లు ప్రాప్తింప గలఁడు? పదార్థము లిచ్చుటనే యుండును. వాసనలు వెంటవచ్చును. వానికొఱకు మరల మరల జన్మించవలయును, మరల మరల మరణింపవలయును.

దైత్యకుమారు లిట్లడిగిరి:- "మంచిది, యీ సాంసారిక భోగముల నిత్యములు, కాని స్వర్గీయసుఖము. నందన వనమున గల్పవృక్షము నందలి దివ్యపుష్పములు. అమృతము, అప్సరసలు, దివ్యవిమానాదులు పుణ్యముచేఁ బ్రాప్తించు పదార్థములు క్షణికములు కావు."

ప్రహ్లాదుఁడు నవ్వి యిట్లనెను:- "ఈ పదార్థము లెట్టివియో అవియునట్టివే నయ్యా. స్వర్గీయపదార్థములు కొంచెమాలస్య

ముగ నశించును. ఇచ్చట సంవత్సరము తక్కువ. అచ్చట నెక్కువ. ఇచ్చట పదార్థము అల్పమోహకములు. అచ్చటఅధిక మోహకములు. రెండును ననిత్యములే. పరిణామమున దుఃఖములే. అవియున్నను క్షయష్ణువులు. వానిలోను నతిశయ దోషము కలదు. అనియును నిర్దోషములుకావు. నిర్దోషము కలదొక బ్రహ్మమే. పరమేశ్వరునందుగాక మిగిలినఅన్నిటిలోను గొంచముగానో గొప్పగానో దోషములుకలవు. అన్నియును నొకానొకప్పుడు కాలమున కధీనములైనవియే. కావునఁ గాలమునకును గాలమగు నాప్రభువును ఏకనిష్ఠతో భక్తిభావముతో భజింపవలయును ఆతని ననన్యభావముతో నుపాసింపవలయును. ఆతని సర్వాత్మభావముతో నారాధింపవలయును ఈ సాంసారిక కర్మలలో నేమున్నది?"

దైత్యబాలకులిట్లనిరి:- "కర్మయొనర్చు నుద్దేశ్యము సుఖము. దేనిచే సుఖముకలుగునో అట్టికర్మ నవశ్యముచేయవలయును.

ప్రహ్లాదుఁడిట్లనెను:- "కర్మలు సుఖముకొఱకు చేయఁబడుట సత్యమే కాని యేసుఖముకొఱకు, ఆత్మసుఖముకొఱకా, శరీరసుఖము కొఱకా?'

అసుర బాలకులిట్లనిరి: "ప్రపంచములో శరీరసుఖమే సర్వ శ్రేష్ఠముగా నెన్నఁబడుచున్నది."

ప్రహ్లాదుఁడిట్లనెను:- "శరీరసుఖము సుఖముకాదు. ఎన్ని కామ్యకర్మలొనర్చిన నంతగా దుఃఖము కలుగును. కావునఁ

గామననువీడి నిష్కామభావముతో భగవదర్పణబుద్ధితోఁ జేయఁ బడిన కర్మములు శ్రేష్ఠములు.సకామకర్మలకు ఫలము సాధార ణముగవిపరీతములగును.మానవుఁడేశరీరముకొఱకు లోకమందు గామ్య కర్మలు ద్వారా వివిధములగు భవ్యభోగములను బొందు నో ఆశరీరమును శాశ్వతముగా నుండునదికాదు. అస్థాయియై నదే. ఎప్పుడు నిర్జీవమై నశించునో తెలియదు. మరల నింకొక శరీరము వచ్చును. శరీరములు వచ్చుచుండును బోవు చుండును. ఏ శరీరముకొఱకిపాపములన్నియును జేయఁబడుచు న్నవో- ప్రపంచములో నన్నిటికంటెఁ బ్రియమైనదేదో, చివరకు బిడ్డనుజంపియైనను నేశరీరమును రక్షించుకొనుచుందురో, అట్టి యీశరీరమునకే నిలుకడలేకున్న స్త్రీ, పుత్ర సోదర, బంధు, మతాపిత్రాదులందు మమకారమును బెట్టుకొందురు ఈ శరీర మే నిలువకున్న వీరేమి నిలిచెదరు? ఎట్టిమంచి యింటినైనను గట్టుము. ఎట్టిపనితనమునైనను జేయుము, ఎంతటి పరిశ్రమ మొనర్చియైన నన్నమును బ్రోవుచేయము. ఎంతటిరాజ్యమైన నుండనిమ్ము గజతురగాదులు, పశుసంపత్తి. పురజనపరిజనము, మంత్రి అమాత్యాదులు, సేవకులు, అనుయాయు లెంతమంది యైన నుండనిండు అందఱునేదో ఒకదినము నశించువారే. శరీ రముతో బాటుగా వీరి సంబంధమును దెగిపోగలదు.

కావున ననర్థకారియును ననిత్యమునైన భోగపదార్థము లందు మమత్వబుద్ధిని వదలి అత్మచింతనమందు సదాలగ్నము చెంది యుండవలయును."

దైత్యబాలకు లిట్లనిరి:- "సోదరా! ఈసామగ్రులన్ని యును సుఖము నొసంగునవియే. ప్రపంచమందు వీని సహాయ ముచేతనే మానవుఁడు సుఖముగా జీవించును."

ప్రహ్లాదుఁడిట్లనెను:- సోదరులారా? ఈప్రాణికి సుఖ మెక్కడిది? గర్భములో నెంతో దుఃఖము. జన్మసమయమునఁ దల్లికిని పిల్లవానికిని నెంతో దుఃఖము. బాల్యకాలమునను సుఖమే? పండ్లు మొలుచునప్పుడును దుఃఖమే. చెవులు కుట్టున ప్పుడును దుఃఖమే, చదువుటలో దుఃఖము, జీవనమునకు సంపా దించుటలో దుఃఖము, వివాహమందు క్షణకాలము సుఖము కల్గును దీనికెన్నో విపత్తులు ననుభవింపవలసియుండును. ఆమీఁ దట దారిద్ర్యదుఃఖము. వ్యాపారములో నష్టమువచ్చినదుఃఖము. స్వజనులు, బంధువులు బాంధవులు జబ్బుపడిన దుఃఖము. ఆత్మీ యులు చచ్చిన దుఃఖము, తన శరీరములోనున్న రోగముల దుఃఖము. గజ తురగాదులు. మొదట మొదట సుఖముకొఱకై యేర్పడును. చివరకవిదుఃఖముగఁ బరిణమించును. లింగదేహ ముయొక్క ప్రేరణముచేఁ గర్మలానర్చెదము. దానివలననే శరీరము ప్రాప్తించినది. ఇప్పుడు చేసినను జేయకున్నను ప్రార బ్ధకర్మము ననుభవించి తీరవలసినదే. కావున శరీరసుఖముల వైపు ధ్యానముంచక సదా సర్వదా శ్రీవారి చింతనమొనర్ప వలయును,"

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను!-"రాజా! ఇట్లు పలికి ప్రహ్లాదుఁడూరకుండెను."

# భగవంతుని నందఱును భజింపవచ్చును

౪౮౧

శ్లో॥ నాలం ద్విజత్వం దేవత్వమృషిత్వం వాసురాత్మజాః॥
ప్రీణనాయ ముకుందస్య న వృత్తం నబహుజ్ఞతా॥
న దానం న తపో నేజ్యా నశౌచం నవ్రతాని చ।
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్విడంబనమ్॥
(శ్రీభాగ. ౭ స్కం. ౭ అ, ౫౧ ౫౨శ్లో.)

క. చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వమధిక శాంతత్వంబుం
జాలదు హరిమెప్పింప వి
శాలోద్యములార భక్తి చాలిన భంగిన్.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధముసుమ్మీ,
--శ్రీమదాంధ్ర భాగవతము.

శ్రీహరి యేదైన గుణముచేఁగాని, కాలముచేఁగాని, వ్యవహారముచేఁగాని, దానధర్మాదులచేఁగాని ప్రసన్నుఁడగువాఁడగుచో నాతఁడుదీనులకెప్పటికినిదొఱకడు.సదాగొప్పవారికే లభించును.

ద్విజత్వము లభించుట పుణ్యఫలము వలననే అయినప్పటికి, బ్రాహ్మణుఁడు భగవంతుని విభూతియైనప్పటికిని, కేవలము బ్రాహ్మణుఁడైనమాత్రముచేతనే భగవత్కృపాపాత్రు డగునని యేమియునులేదు, బ్రాహ్మణుఁడై, చతుర్వేదములను వల్లించి యును భగవద్భక్తుఁడు కాకున్నచో నాతఁడు భగవంతునకుఁ బ్రియుడు కాఁడు. దీనికి విపరీతముగాఁ జండాలుఁడయ్యు భగవంతున కనన్యభక్తుఁడగుచో నట్టివాఁడు వేదజ్ఞుఁడగు బ్రాహ్మణునికంటెను శ్రేష్ఠుఁడు. భగవంతున కత్యంత ప్రియుఁడు. కావున భగవద్భక్తులలో జాతికృత,వయఃకృత గొప్పదనములు, కొద్దితనములులేవు, ఎవ్వఁడాతని కెంతయు నన్యముగా నుండిన నాతని కంతటి ప్రియుఁడగును.

దైత్యబాలకులతోఁ బ్రహ్లాదుఁ డిట్లనెను :- "సోదరురాలా! భగవంతుఁడు ప్రాణిమాత్రునకుఁ బ్రభువు. ఆతఁడు ఘట ఘటమున వ్యాపించియున్నాఁడు. సర్వజ్ఞుఁడు. అంతర్యామి. ఆతనిని భక్తిభావముతో నెవరు భజించెదరో వారు భాగవతులగుదురు. నేను అసుర కులమున జన్మించితిని. అయినను భగవతుఁడు నామీఁదఁ గృపఁ జూపినాఁడు. నన్ను స్వీకరించినాఁడు. త్రైలోక్యపావనమగు దన సుమధుర నామము నొసంగినాఁడు.

అసురబాలకులిట్లనిరి:- "సోదరా! నీవు కులీనుఁడవు రాజవంశమునఁబుట్టితివి. నీయందు భగవంతుఁడుకృపఁజూపినాఁడు, మేమా అసురకులమున దీనహీనులమై పుట్టితిమి. ధనికులము

గాము. దేవతలము కాము. ప్రభుపు మమ్ములనెట్లు కృపఁజూడఁ గలడు?"

ప్రహ్లాదుఁడిట్లనెను:-"సోదరులారా! దేవతలు కాఁగానే, కులీనులు కాఁగానే యేమియును లేదు.

క॥ దానవదైత్య భుజంగమ
మానవ గంధర్వ సురసమాజములో ల
క్ష్మీనాథు చరణ కమల
ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యతనొందున్॥

బ్రాహ్మణుఁడగుటచేతనే ప్రభుపు ప్రసన్నుఁడగుచో బ్రాహ్మణులందఱును భక్తులయ్యెడువారే. చాలమంది బ్రాహ్మణులు తమ శీల కారణముగ రాక్షసుఁలగుచున్నారు. చాలమంది అధమ యోనులలోఁబుట్టుచున్నారు. దేవతలగుటచేతనే భగవత్కృపాపాత్రులగుదురను నదిలేదు. ఇంద్రుఁడును బతనమైపోవును, ఆతఁడును గర్మవశమున సూకరకూకరాది యోనులందు జన్మింప వలసియుండును. ఋషియగుటయే చాలదు. యోగారూఢులైన ఋషులును భగవద్భక్తి లేకున్నఁబతనమగుటను గాంచుచున్నాము. శీల సదచార, బహుజ్ఞతా, దాన, తప, యజ్ఞశౌచ, వ్రతాదులచేతనే, భగవంతునిఁ ధ్యానించుకొందమా యనిన నది యునులేదు. వీనిద్వారాకూడ కొందఱప్పుడప్పుడు పతనమగుచున్నారు.

ఇది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ప్రహ్లాదుఁడు శాస్త్ర విరుద్ధపు వాక్యములను జెప్పుచున్నాఁడు. జప, మౌన, వ్రత, అధ్యయన, స్వధర్మపాలన, ఏకాంతవాస సమాధి ఇవన్నియును మోక్షసాధనములు. ప్రహ్లాదుఁడు వీనినన్నిటిని నిషేధించుచున్నాఁడు. ఇదేమిటి? మోక్షసాధన భూతములగు నీకార్యములను గూడ మానవుఁడు చేయకున్నచో నింకఁజేసేడు దేమున్నది?"

ఇది విని శీఘ్రముగ సూతుఁడిట్లనెను:- "కాదు కాదు స్వామీ! దీనికర్థమీకార్యములను జేయరాదనికాదు. తప్పక చేయవలెను. కాని భక్తితోఁజేయవలయును. భక్తిహీనమైన నీ కర్మలు వ్యర్థములు. ఇంద్రియములను జయింపక వాసనాయుక్తమగు మలిన చిత్తముతోఁ జేయఁబడిన నీకర్మలు కేవలము సంసారిక భోగముల నొసంగునవగును. ఇవియును నొకవిధమగు వ్యాపారము. పొట్టనింపు కొను సాధనములు కాఁగలవు. కావున నిచ్చట ననుపయోగములనిచెప్పుటకుఁదాత్పర్యమిదియే. భక్తిలేని యీ కార్యములువ్యర్థములుభక్తితోఁజేయఁబడినచో నింక చెప్పవలసినదేమున్నది? సదాచారముచేతనే ముక్తిలభించుచో సదాచారపరులు ముక్తిని-బొందరేల? కేవలము స్వర్గమునకేపోవు టెందుఁకు? దీనికి విపరీతముగ గృధ్రమున కేమి సదాచారమున్నది? అది చచ్చిన జీవుల మాంసమును దినును. అజామిళుఁడేమి ద్విజత్వ సదాచారమును బాలించినాఁడు. ఆతఁడొనర్పని సదాచారమేమున్నది? అయినను భగవంతునకు వీరిపైఁగృపకలిగినది.

గజేంద్రుఁడేమి శాస్త్రమును జదివెనను.భిల్లిని యేమి వ్రతదీక్షలు పాలించినది. కేవలము భక్తివలననే ఆమె భగవదనుగ్రహ పాత్రురాలైనది- నృగమహారాజు నిత్యము అసంఖ్యాకములగు గోవులను దానమొనర్చినాఁడు. చివరకాతఁడూసరవెల్లియై పడి యుంకవలసివచ్చినది. సుదామునకుఁదినుటకే లేదు, దానము లేమిచేయఁగలడు? అయినను భగవానుఁడాతని పాదములను గడిగి, తనయొక్కయైశ్వర్యమును బ్రసాదించెను. ఎందఱో ఋషులు తపస్సుచేసి చచ్చరి. జీవితములో వారు శాపములను బెట్టిలు తపస్సునంతను ధ్వంసముచేసికొనిరి. వ్రజబాలకులు పంచాగ్ని మధ్యమునఁ దపింపలేదు. నీటిలో మునిఁగి సమాధి స్థులు కాలేదు. ఇంటింట నవనీతమును దొంగిలించిరి, గోపికల నేడ్పించిరి. అయినను వీరిని భగవానుఁ డనుగ్రహించెను. వ్యాధుఁడు యజ్ఞమును జేయలేదు. వ్రతములొనర్పలేదు. నిరంత రము పశులను జంపుచుండెను. భగవానుని చరణకమలములను మృగమనుకొని కొట్టెను. అట్లయ్యును నాతఁడు పరమపదమును బొందెను. దీనికి విపరీతముగ దక్ష ప్రజాపతి సమస్త వైభవ పూర్ణముగ మహాయజ్ఞము నొనర్చెను. సమస్తదేవతలను బిలి చెను. నీళ్ళవలెద్రవ్యమును వెచ్చించెను. కాని భక్తిహీనుఁడగుట చేతను, విశ్వనాధుని ద్వేషించుటచేతను నాతని యజ్ఞము ధ్వంస మయ్యెను. వీరభద్రునిచే నాతనిశిరస్సు తెగకొట్టఁబడెను.

సూతుఁడిట్లనెను:-"మునులారా! భగవంతుని ప్రసన్నత కొఱకు యజ్ఞ, తప, శౌచ, వ్రతాది శుభకర్మలు పర్యాప్తములు కావు. భగవంతుఁడు భక్తిచేఁ బ్రసన్నుఁడగును. మిగిలిన దంత యును విడంబనమే. మిథ్యాచారమే. జీవనమును వ్యర్థముగఁ బోగొట్టు కొనుటయే."

ప్రహ్లాదుఁడిట్లనెను!- "దైత్య బాలకులారా! మీరు భేద భావమునకుఁ దిలాంజలు లొసంగుఁడు. అన్నిటిలో నొక్కటే ఆత్మయున్నదని భావింపుఁడు. నీకాలిలో ముల్లు విఱిఁగిన నెంత టిబాధకలుగునో అందఱకు నట్టిబాధయనిగ్రహించి యితరులకు ముండ్లు పొడువకుము. ఎవరైన మిమ్మవాచ్యములను బలికిన మీకవశ్యము మానసిక దుఃఖము కలిగితీరును. కావున మీరు పొరపొటుననైనను నితరులయెడ జెడ్డ వాక్యములను బలుకరాదు. సారాంశ మేమనఁగా నేది నీకు సరిపడని ఆచరణము కలదో దాని నితురులయెడ నొనర్పకుము. జగత్తంతయును హరిమయ మనుకొని మానసికముగా నందఱకును బ్రణామము కావింపుము అందఱినాదరించుము. భక్తిచేతనే అనేకులకు సిద్ధులు ప్రాప్తించి నవి."

అంత శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీవు భక్తినింత గాఁ బ్రశంసిసుచున్నావు.మాకిష్టమే కాని అధికారము ప్రాప్తింప క, జ్ఞానార్జన మొనరింపక ముక్తి యెట్లు కలుగఁగలదు?

అంత సూతుఁడిట్లనెను:-"మహాభాగులారా! భగవంతుని యందు భక్తికలిగిచో జ్ఞానవైరాగ్యములుపిలువకయే వానికవియే

పరుగిడవచ్చును. భక్తికి జాతి, కులము, గోత్రము, ఉచ్చనీచము లుండవు. భక్తిశ్వపచునిఁగూడ పవిత్రుల నొనర్చును. ప్రహ్లాద, బలి. వ్యాస బాణాసురులు వీఱందఱును నసురులే. భగవద్భక్తి కారణమునఁ బుణ్యశ్లోకులైరి, విభీషణుఁడును రాక్షసుఁడే. భక్తి ప్రభావముచే నేఁడాతఁడు జగద్వంద్యుఁడైనాఁడు. వ్రజాంగనలు చదువురానివారే. వారికి శౌచ, సదాచార, శిష్టాచారము లేమి యును దెలియవు. అమాయకులు. గ్రామీణులు, వారి శుద్ధభావము చేతను, అనన్యప్రేమకును వశపడినాఁడు. హనుమంతుఁడు జాతికేమిశ్రేష్ఠుఁడు. కింపురుషుఁడయ్యు నాతఁడు దేవతలకును బూజనీయుఁడు వందనీయుఁడైనాడు గరుడ,గజ, జటాయువులు జంతువులును బక్షులు నైరి, అయినను వారు ప్రభు ప్రసాద మును బొంది అజరా మరులును, త్రైలోక్య వందితులునగు భాగవతులైరి. భగవద్భక్తినిఁజేయుటచే నయోధ్యలోని కీటప తంగాదులు కూడ భగవద్ధామమున కధికారులైరి కావునఁ బ్రపంచములోని భక్తియేసారము. ఏవిధముగనైనను సరియే కామముచేఁగాని, క్రోధముచేఁ గాని, లోభముచేఁ గాని, ద్వేషము చేఁగాని, వైరముచే గాని, ప్రేమచేఁ గాని భగవంతునియందు భక్తినుంచవలయును. ఏదో విధముగ నాతనితో సంబంధమును బెట్టుకొనవలయును, ఆతనియందే చిత్తమునుంచవలయును,

దైత్యబాలకు లిట్లనిరి:- "నీవు చాల విషయములను జెప్పితివి ఇప్పుడన్నిటికిని సారసిద్ధాంతమును జెప్పుము. జీవునకుఁ బ్రధానకర్తవ్యమేమో చెప్పుము."

ఇదివిని ప్రహ్లాదుఁడిట్లనెను:- సోదరులారా! నేను దీనినే ప్రపంచము నందు శ్రేష్ఠసారసిద్ధాంతముగ దలఁచుచున్నాను. జీవునకు ముఖ్యస్వార్ధమిదియే. ఇదియే పరమపురుషార్థము. ఇదియే ఉత్తమోత్తమ కర్తవ్యము. అదేదనఁగా సమస్త ప్రాణుల యందును సర్వత్ర తనయిష్టదైవమగు శ్యామసుందరుని దర్శింప వలయును. భేదభావమును వీడి అందఱిలోను భగవంతునిఁ జూడవలెను. ఇదియే అనన్య ప్రేమ ఇదియే ఉత్తమాద్వైత భావము. ఇదియే ఏకాంతిక భక్తి.ఇదియే పరమేశ్వరునియందు పరానురక్తి. దీనినే చేయవలయును."

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుడిట్లుచెప్పెను:- "రాజా? ప్రహ్లాదుఁడు పలకిన రసయుక్తములును ప్రేమ పరిప్లావిత వాక్యము లను వినియాదైత్య బాలకులు వాని నంగీకరించిరి. ఏలననఁగా నవి యన్నియును శుద్ధాంతః కరణముతోఁ జెప్పబడినవియును, సరళములును, నిర్దోషములైనవిగ నుండెను. ఇప్పుడు వారు గురువు చెప్పిన దానిని మఱచి, అందఱును గలిసి "శ్రీకృష్ణగోవింద హరే మురారే, హే నాథ నారాయణ వాసుదేవ" యని భజన చేయసాగిరి.



## ప్రహ్లాదునిపైఁ దండ్రి మరలఁగోపించుట



శ్లో॥ అథాచార్యసుతే స్తేషాం బుద్ధి మేకాంత సంస్థితామ్।
ఆలక్ష్య భీత స్త్వరితో రాజ్ఞ ఆవేదయద్వథా॥
శ్రుత్వా తదప్రియం దైత్యో దుఃసహం తనయానయమ్।
కోపావేశ చలద్గాత్రః పుత్రం హంతమనో దధే:
(శ్రీ భాగ. ౭ స్కం. ౫ అ. ౨౩ శ్లో.)

వ. అని యిట్లుగురుసుతుండు సెప్పిన కొడుకు లీలని విరోధవ్య వహారంబులు కర్ణరంధ్రంబుల ఖడ్గ ప్రహారంబులయి సోఁకిన బిట్టు మిట్టిపడి పదహతంబయిన భుజంగంబు భంగిఁబవన ప్రేరితంబైన దవానలంబు చందంబున దండ తాడితంబయిన కంఠీరవంబు కైవడి భీషణరోషరసావేశ జాజ్వల్యమాన చిత్తుండును. బుత్ర సంహారోద్యోగాయత్తుండును గంపమాన గాత్రుండు నరుణీకృత నేత్రుండనునై కొడుకును రప్పించి బహుమాన కృత్యంబులు దప్పించి నిర్దయుడయి....

....శ్రీ మదాంధ్ర భాగవతము.

పరమార్థరూపపాదపమునకు బీజము సాధుసమాగమము. కథ ఆపాదమునకుఁ బుష్పము.కీర్తనము దానియొక్క అత్యంత సుస్వాదు మధురఫలము, భక్తి వివర్ధనమొనర్చు పరమ ప్రేమ మరియు కృష్ణకథను వినియు నామగుణకీర్తన మొనర్చునభిలాష

కలిగియుండక పోయినచో సఫలవృక్ష సన్నికటమునకుఁ
జేరియు ఫలములకు వంచితుఁడైనట్లగును. ఫలవృక్షములలోఁ
బుష్పపరిణామము ఫలమెట్లో, అట్లే కథాశ్రవణమునకుఁ పరి
ణామము కృష్ణకీర్తనము.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :-
"రాజా ! విశుద్ధాంతఃకరణముగల ప్రహ్లాదుని హృదయము
నుండి వెలువడిన॥ యుపదేశము నిర్దోషులును, నమాయకులు
నగు దైత్యబాలకుల మనస్సుమీఁద బాగుగాఁ బడినవి. వారిట్లడి
గిరి :- "సోదరా ! ఇప్పుడు మేమేమి చేయవలయును ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "కథ జరిగిన మీఁదటఁ గీర్తన
జరుగవలయును. కావునఁ గీర్తన మొనర్పుఁడు."

అంత నసురబాలకు లిట్లనిరి :- "సోదరా ! మాతండ్రు
లును, దాతలును కీర్తన మొనర్పలేదు. కీర్తనమొనర్చుట
మేమెఱుఁగము."

నవ్వి ప్రహ్లాదుఁడిట్లనెను :- "కీర్తనమొనర్చుట యేమంత
కఠినకార్యముకాదు దీనిని జదివినవారు, చదువనివారు, బాల
కులు, యువకులు. వృద్ధులు, స్త్రీలు, పురుషులు, బ్రాహ్మణులు,
చంచలులు వీరందఱను జేయవచ్చును. దీనికేమియును గళా
కౌశల మక్కఱలేదు. నోటితో నామోచ్చారణమొనర్చుచుఁ
జేతులతోఁదాళములు వేయుఁడు తాళములు కొట్టుటచేఁ బావ
రూపడగు దుష్టపక్షులెగిరి పోఁగలవు. ముందు నేను జెప్పె

దను. తరువాత మీరందఱును నైక్యకంఠమునఁ జెప్పవల యును."

చెప్పుఁడు--శ్రీకృష్ణ గోవింద హరే మురారే
హేనాథనారాయణ వాసుదేవ॥

దైత్యబాలకు లేకస్వరమునఁ బలుకుట కారంభించిరి :- "శ్రీకృష్ణ గోవిందహరే మురారే, హేనాథ నారాయణ వాసు దేవ" ప్రహ్లాదుఁడు స్వరసహితముగఁ దాళమును లయతో వేయుచుఁజెప్పుచుండెను. పిల్లలాతనిస్వరములో స్వరమును గలుపుచు నాతని ననుసరించుచుండిరి. ఇప్పుడు ప్రహ్లాదుఁడు క్రమముగఁ దన గతిని ద్రుతమొనరించెను. తాళములును ద్రుతగతిని మ్రోఁగుచుండెను. అందఱు నూగుచు నూగుచుఁ గీర్తించుచుండిరి. అందఱును దన్మయులైరి. అందఱును గన్నులు మూసికొనియుండిరి. యంత్రములవలె వారు తాళము లను గొట్టుచు నూగుచుండిరి. నీటితో మాధవనామముల నుచ్చ రించుచుండిరి. కీర్తనము మంచి తన్మయములో, రక్తిలో నుండఁగా గురుపుత్రులువచ్చిరి. ద్వారముననే సంకీర్తనము యొక్క సుమధుర ధ్వని వినఁగానే వారు చెవులను నిక్కఁ బొడిచిరి. బయట కుతూహలవశమునఁ జాలమంది నిలుచుండిరి. గురుపుత్రులును వచ్చి నిలుచుండిరి. కాని వారివైపు చూడవల సిన పని యెవరికున్నది ? అందఱును ప్రేమానందమున నిమ గ్నులై శరీర స్పృహను మఱచిరి.

గురుపుత్రులిట్లనుకొనిరి :- "నేనిచ్చట నిలుచుంటిని. ఎవరైనఁబోయి హిరణ్యకశపునితో వారచ్చట నిలుచుండియే కీర్తనముచేయుచున్నారని చెప్పిరి. మా శిరస్సుపై విపత్పర్యంతము విరుచుకొనిపడును. ఎవరైనను బోయి చేప్పుటకు ముందే మేమేపోయి రాజుతో ప్రహ్లాదుఁడు బాలకులనందఱను జెడఁగొట్టుచున్నాఁడని చెప్పుటమంచిది. మేమే ముందుగాఁబోయి చెప్పినచో దోషము మాపైఁబడదు."

అని యాలోచించి గురుపుత్రు లిరువురును బరువిడి దైత్యేశ్వరుని కడకుఁబోయి ఱొప్పుచు రోజుచు నిట్లనెను :- ప్రభూ ! ప్రహ్లాదుఁడందఱను దనవలె నొనర్చినాఁడు. అతఁడు పాఠశాల భవనమును సంకీర్తన భవనమొనర్చినాఁడు."

ఈ దుస్సహవార్తను వినఁగానే హిరణ్య కశిపునకుఁ గోపమునకు మేఱలేకుండెను. ఈ యసహ్య, అప్రియ సమాచారమును వినఁగానే ఆతఁడు క్రోధముచేఁ గంపించెను. ఈతఁడు నాకుల ఘాతకుఁడగు నధమ పుత్రుఁడని లోలోన నిశ్చయించుకొని, వీఁడిప్పటికే ముదిరిపోయినాఁడు. వీనిని స్వయముగ ఖడ్గమున ఖండింపవలయుననుకొనెను."

ఆతఁడు పెదవులను గొఱుకుచు నత్యంత క్రోధ భరిత వాక్కులతో సేవకులతో నిట్లనెను :- "మీ రిప్పుడేపోయి నా దుష్టపుత్రునిఁ బట్టుకొనిరండు. నేఁడు నేను వానినిఁ జంపక విడువను."

"సేవకులు ప్రహ్లాదుని భగవద్భక్తి చేతను, దృఢ నిష్ఠ చేతను నిదివఱకే ప్రభావాన్వితులైరి, వారు లోలోనఁ బ్రహ్లాదుని మిక్కిలి గౌరవించుచుండిరి. కాని భయకారణమున వారు పైకి ప్రకటింపకుండిరి. వారు పాఠశాలకు వినీతభావముతోఁబోయి యిట్లనెను :- "కుమారా : నిన్ను నాయనగారు రాజసభకు రమ్మనుచున్నారు. కావున గృపతో నీవు రాజసభకు వచ్చుట శ్రేయస్కరము. మహారాజు కొంచెము కోపముతో నున్నారు."

ఇది వినఁగానే ప్రహ్లాదుఁడు తండ్రి సమీపమునకు వెళ్ళుటకు సిద్ధపడెను. పిల్లలు చంచలులుగ నుందురు. వారికి నవీన విషయములందు గుతూహలముండును. వారందఱిట్లనిరి :- "కుమారా ! నేఁడు మేమందఱమును రాజసభకు వచ్చెదము. కీర్తమొనర్చుచు పోవుదము. నేఁడు మహారాజు చెవులలోఁగూడ భగవంతుని పావన సుమధుర నామములు పడఁగలవు. దీనిచేఁ జివర కాతనికి సద్గతి లభింపఁగలదు."

ఇందుఁ బ్రహ్లాదునకు బాధయేమున్నది. అందఱను వెంటబెట్టుకొని అతఁడు మిక్కిలి యుత్సాహముతో సంకీర్తన మొనర్చుకొనుచు రాజసభకుఁబోయెను. రాజ పథమునఁ జేతులెత్తుకొని బాలకులతోఁగూడి కీర్తన మొనర్చు కొనుచు బోవుచుండిన ప్రహ్లాదునిఁగాంచి స్త్రీ పురుషులందఱును గలిసి కీర్తన మొనర్చుచు వారి వెంటఁబోయిరి, నగర సంకీర్తనమువలన లాభమిదియే. ఎవరికైన నిష్టమున్నను లేకున్నను వారి కర్ణములలోను భగవంతుని మంగళమయ నామములు పడును.

ఆ కీర్తనమండలిని వెంట బెట్టుకొని ప్రహ్లాదుఁడును దన తండ్రి కడకుఁజేరెను. ఇతరులు హిరణ్యకశిపుని క్రోధము ద్రను గాంచఁగానే ఆతని దగ్గఱకుఁ బోవుట కెవరికిని సాహసము లేకపోయెను. కొందఱాతని రక్తనేత్రములను గాంచి పాఱి పోయిరి. కొందఱు దూరమున నిలుచుండిరి కాని ప్రహ్లాదుఁడు నిర్భయముగ నుండెను. ఆతని కెవరిభయమును లేదు. ఆతఁడు మంచి యుత్సాహముతోఁ దండ్రి సమ్ముఖమునకుఁబోయెను. నిరంతరము భగవన్నామ జప మొనర్చుటచే నాతని నాలుక కదలుచుండెను. బోయి ముందుగాఁ బితృచరణములకు శ్రద్ధా భక్తులతోఁ బ్రణామ మొనరించెను. మరల నత్యంత నమ్రతతో వినయపూర్వకముగ నంజలిబంధించి ఆతని సమ్ముఖమున నిలు చుండెను.

భగవద్భక్తుఁడగుఁ బ్రహ్లాదుఁడు శాంత దాంతుఁడై హిరణ్య కశిపునియెదుట నిలుచుండుటనుగాంచి, యా దుష్టుఁడు వానినిఁ దిరస్కరించుచు నత్యంత కఠోరవాక్కులతోఁబలికెను. ఆ సమయమున నాతని క్రోధమునకు మేఱలేకుండెను. తోక ద్రొక్కిన త్రాచువలె బుసలు కొట్టుచున్నట్లును, ఆఁకలిఁజెందిన పులి హరిణముపైఁబడునట్లును, దిరస్కృతుఁడగు తపస్వి శాప మొసంగ నుద్యుక్తుఁడైనట్లును నా దుష్టుఁడును నిష్ఠుర హృద యుడునగు హిరణ్యకశిపుఁడు తన దృష్టిచేఁ బ్రహ్లాదుని భస్మము చేయఁదలఁచెనా యను నట్టిట్లనెను :- "ఓరీ నీచా ! ఇప్పటికిని నీవు నీ నీచత్వమును వీడలేదు."

ప్రహ్లాదుఁడు మిక్కిలి నమ్రతతో నిట్లనెను :- "నాయనా నేనేమి చేసితిని ?"

సర్పమువలె దీర్ఘ నిశ్శ్వాసములను విడుచుచు నాదైత్య రాజిట్లనెను :- "ఓరీ కులాంగారా ! నీకిప్పటికినిఁ దెలియలేదే. మిక్కిలి దృష్టుఁడవైనావే నాముందు మాటలాడుటకు నీకు భయము వేయుటలేదే. నీవు పాఠశాలలో విపరీత శిక్షణ మొసంగుచున్నావనియు, శత్రు నామకీర్తనమును జేయించు చున్నావనియు, నాతమ్ముని జంపినవాని గుణములనుగానము చేయించు చున్నావనియు, గురుపుత్రులవలన వింటిని. నీవు నన్నుఁదెలిసికొన లేకుండ నున్నావే."

ప్రహ్లాదుఁడు వినీత భావముతో నిట్లనెను :- "లేదు తండ్రీ ! నేను మిమ్ములను హృదయపూర్వకముగ నాదరించు చున్నాను."

కుటిల భృకుటితోఁగ్రోధ పూర్వకముగఁ జూచుచు నాయ నురుఁడిట్లనెను :- "ఆదరించుచున్నావా ? మొద్దు ! నేను చెప్పిన దానికి విపరీతాచరణ మొనర్చుటయును, నా యాజ్ఞను సర్వదా ఉల్లంఘించుటయును ఆదరమేనా ? అది ఆదరముకాదు. అనా దరము. నీవు నన్నుఁదృణమువలెఁ జూచుచున్నావు. దానికిప్పుడే నీకు ప్రతీకారమొనర్చెదను, దానిరుచి చూపించెదను. నిన్నీ క్షణముననే యమ సదనమునకుఁబంపెదను. ఈ ఖడ్గముతో నీ శిరస్సును ఖండించెదను. నీవు నన్ను సాధారణాసురుఁడనని

తలంచుచున్నట్లున్నది. నేను కోపించిన సమస్త దేవతలు, ఉప దేవతలు, లోకపాలురు గడగడ వణఁకుదురు. నీ వెవరి బలమున నీవాగుడు వాగుచున్నావురా? ఎవనియాధారమును జూచు కొను చున్నావు? ఎవని యండన నిర్భయుఁడవై త్రొమ్ము విఱుచుకొని దుష్టతతోఁ బ్రత్యుత్తర మొసంగు చున్నావు?"

ప్రహ్లాదుఁడు వినయభావముతో నిట్లనెను :- "తండ్రీ !

క. బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకుం
బలమెవ్వఁడు ప్రాణులకును.
బలమెవ్వండట్టి విభుఁడు బలమసురేంద్రా॥

....శ్రీ మదాంధ్రభాగవతము.

చీమ మొదలుకొని బ్రహ్మవఱకు నాతఁడే బలప్రధాన మొనర్చుచున్నాఁడు. ఆతని సత్తా వలననే నన్నిటి సత్తాకలదు. చిన్న పెద్ద, స్థావర జంగమ ప్రాణులన్నియును నాతని యధీనములోనున్నవి. మాయెడలను నాతని దయాబలమే కలదు."

క్రోధముతోఁ బెదవులను గొఱకును హిరణ్యకశిపుఁడిట్లనెను :- "ఓరీ దుర్వినీతా! నీవు బ్రాజు పొగడ్తలతో స్తుతించు చున్నావురా ! జగత్తంతయు నా యధీనమున నున్నది. అందఱకును స్వామిని నేను :- నా బలము ముందింకెవరి బలము పనికి వచ్చునురా ?"

ప్రహ్లాదుఁడు సరళతా స్వరమున నిట్లనెను :- "తండ్రీ ! మీ వద్దకూడ ఆతడొసంగిన బలమేకలదు. ప్రపంచములో సమస్త బలవంతులకును బలమా వాసుదేవుఁడే అందఱికును ప్రభువు ఆతఁడే అందఱకును బలి. అతఁడే కాలస్వరూపుఁడు. శరీరమున బలరూపమున, ఇంద్రియములెల్లకోజోరూపమునను, మనస్సున సహనరూపమునను, ఆ శ్రీహరియే కలఁడు. ఆతఁడే జగత్సృష్ట, పాలన కర్త సంహారకర్త.

అత్యంత క్రోధముతోఁగంపించుచు, దంతములను బట పటఁగొరుకుచు నాదైత్యుఁడిట్లనెను :- "ఓరీ నీచా ! జగత్పాలన పోషణకర్తను నేనే సమస్త జగత్తును రక్షించుచున్నాను. నా సంకేతమున సృష్టికార్యమంతయును నడుచుచున్నది. యజ్ఞ భోక్తనునేనే పంచభూతములు నేను చెప్పినట్లు వినును.

ప్రహ్లాదుఁడు :- "తండ్రీ! ఇదియే అసురత్వము దేహము న్మాతగా భావించువాఁడే అసురుఁడు. మీరీ యసురభావమును ద్యజింపుఁడు వీఁడు చిన్న నేను పెద్ద వీఁడు పొష్యుఁడు నేను పోషకుఁడ ననునీవిషయమును మఱువవలెను. బుద్ధిని సామ్య భావమున స్థిర మొనర్పుఁడు. నాపైఁ గోపగింపకుఁడు."

హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునిపైఁ గోపపడి యిట్లనెను :- "నీవు కోపమువచ్చు కార్యము లొనర్చుచున్నావు. నా శత్రువు భజన మొనర్చుచున్నావు. వాని గుణములను గాన మొనర్చు చున్నావు. నీవాతని నిష్టముగా భావించి దాసభావమున నుపా సించున్నావు. శత్రుపక్షపాతి శత్రువే కాఁగలఁడు."

గంభీరముగఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "తండ్రీ ! క్రోధమును శాంతింపఁ జేసికొనుఁడు. చిత్తమును స్థిర మొనర్చుకొనుఁడు. ప్రపంచములో శత్రువునులేఁడు. మిత్రుఁడును లేడు. మన మనస్సే శత్రువు. మనస్సే మిత్రుఁడు. ఈ ప్రపంచమందు అసంయత, కుమార్గము నాశ్రయించు చిత్తమును సమ సమదర్శిగ నొనరించుఁడు. నేను నాది నీవు నీది యను భావమును మఱచిపొండు. అందఱను సమాన భావముతో నాత్మ రూపమందుఁ జూడుఁడు. జీవులలో ద్వైభావమును జూడరాదు. అందఱను నాత్మస్వరూపముగఁ దలంచుడు. ఇదియే సర్వేశ్వరుని యొక్క శ్రేష్ఠ సేవ. అతఁడే శూరుఁడు. అతఁడే విజయుఁడు."

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "ఓరీ ! మూర్ఖా ! త్రైలోక్య విజయుఁడను నేనేరా ! నాముందీ ప్రపంచమున నిలువగలవారలెవరు ? నేను అష్టదిక్పాలకులను వశపఱచు కొన్నాను. వారందఱపై నేను విజయమును సాధించితిని."

సరళతా స్వరమునఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "తండ్రీ ! లోకపాలురను జయించిన నేమిలాభము. బాహ్యవిజయము విజయమనఁబడదు. బాహ్య శత్రువులను జయించితివి; కాని

ఉ. లోకములన్నియు న్గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకము నిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుఁజేయు నీ

భీకరశత్రులాప్వరఁ బ్రభిన్నులఁజేసిన ప్రాణకోటిలో
నీకు విరోధిలేఁడొకఁడు నేర్పునఁజూడుము దానవేశ్వరా.

....శ్రీమదాంధ్ర భాగవతము

సమస్తప్రాణులందును ప్రభువును జూచువారును. అంద అను హరిమయముగ భావించి సమ్మానింప వలయును. అట్టి జ్ఞానమును, విజ్ఞానమును బరమహంసలైన మునులే అజ్ఞాన బంధువులగుఁ గామక్రోధాదిక రిపులను జయింపఁ గలుగుదురు. లోపలి శత్రువులను జయింపఁ గలిగినచో నట్టివానికి బాహ్య శత్రువుగాని అంతఃశ్శత్రువు గాని యుండఁడు. వారజాతశత్రువు లయ్యెదరు. కావునఁ దండ్రీ! మీరు ముందుగ మీ యంతఃశ్శ త్రువుల మీఁదకు దాడి వెడలుఁడు. అప్పుడు నావలన మీకు భయముండదు, అప్పుడు నన్ను జంపుటకు వివిధ చేష్టల నొనర్పరు."

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను :- "రాజా! ఈ విధముగ నిర్భీకుడై ప్రహ్లాదుఁడు స్పష్టముగఁ బ్రత్యుత్తర మొసంగఁగా నా యసురునకు మిక్కిలి కోపము వచ్చెను. అతఁడు క్రోధముచేఁ గంపించుచు బ్రహ్లాదునివైపు చూచుచు నిలువఁబడిపోయెను. క్షణకాలమాతని కేమియును బ్రత్యుత్తర మీయలేదు.

....)o(....

# హరి యెచ్చట నున్నాఁడు



శ్లో॥ యస్త్వయా మందభాగ్యోక్తో మదన్యో జగదీశ్వరః।
క్యాసౌయది న సర్వత్ర కస్మాత్ స్తంభేన దృశ్యతే॥
(-శ్రీభాగ. ౭ స్కం. ౮ అ. ౧౩ శ్లో.)

క. డింభక సర్వస్థలముల
నంభోరుహ నేత్రుడుండు ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ
స్తంభంబునఁ జూపఁగలవె చక్రిన్ గ్రికిన్.

.... శ్రీమదాంధ్ర భాగవతము.

సాధారణనియమమేమనగా గొప్పవారు - ప్రతిష్ఠితులు స్వయముగఁ దమచేతులతో నెవ్వరినిఁగొట్టరు, సాధారణదండము నొసంగరు. కేవలము సేవకుల కాజ్ఞనొసంగుదురు. కారణ మేమనఁగా వారు చిన్నవారినేమైన మాటయనిన మరల వారు త్రిప్పిమాటలాడినను గొట్టుటకు బ్రయత్నించినను నా పెద్ద వారికి దీనిలో ఘోరావమానము కలదు. కాని పెద్దవారత్యధిక కోపమును జెందినప్పుడు, అత్యంత ప్రేమకలవారు తాను ప్రేమించిన వాని కతిస్వల్పమైన సేవనైనఁజేయుటకు సిద్ధపడి నట్లు స్వయముగా దండించెదరు. సాధారణముగఁబుత్రుని, శిష్యునిస్వయముగా దండించుచుందురు. కాని న్యాయాధిశాసన మున గూర్చుండినపుడు సమ్ముఖమునకెట్టి అభియుక్తుఁడు వచ్చి

నప్పటికిని ఆతఁడు తన సోదరుఁడై యున్నను బంధువైనను నియమానుసారముగ దండమొసంగవలయును.

నారదుఁడు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా ! ప్రహ్లాదుని మీద నియమానుసారముగ రాజద్రోహ-రాజాజ్ఞోల్లంఘనాభియోగము తేఁబడెను. కాని హిరణ్యకశిపుఁడు స్వయముగా నాతనిని ద్వేషించుచుండెను. ఆతఁడు ప్రహ్లాదుని నోట భగవద్గుణగానమును విని విసుగుఁజెందెను. అందువలన నాతఁడి తరులచే నాతనిదండిపఁజేయ నిచ్ఛగింపక స్వయముగఁ బ్రహ్లాదుని దండింపనెంచెను. ఆతఁడడుగఁగాఁ బ్రహ్లాదుఁడు తనకు విష్ణువు బలమనియు, తనకేగాదు సమస్త జగత్తునకు, వానికిని నాతఁడే బలమనియు బలుకఁగా నాతఁడు పండ్లు పటపటఁగొఱుకుచు నత్యంత క్రోధముతోఁ బ్రహ్లాదునితో నిట్లనెను:- "ఓరీ ! మూర్ఖా! నీకంత్యకాలము సన్నిహితమైనట్లుతోచుచున్నది, చావఁబోవు వానికి వాతము కుపితమగును.వాతవేగముచే నాతఁడున సంబద్ధ ప్రలాపమును పలుకుచుండును, ఏదేదోపలుకును. జగదీశ్వరుఁడు రక్షించునని నీవు మాటిమాటికిపలుకుచున్నావు. నన్ను మించి జగత్తున జగదీశ్వరుడెవఁడున్నాఁడు ?

ప్రహ్లాదుఁడిట్లనెను :- "అవును, ఉన్నాఁడు."

క్రోధముతో దైత్యుఁడిట్లడిగెను :- "ఎచ్చటనున్నాడు ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "సర్వత్ర ఉన్నాడు"

కోపముతో మండిపడి దైత్యుఁడిట్లనెను :- "సర్వత్ర యెచ్చటరా ? మూర్ఖా !

ప్రహ్లాదుఁడిట్లనెను :- "సర్వత్ర అనఁగా సర్వస్థానము లందు, నాలో మీలో, ఖడ్గములో, స్తంభములో, వృక్షములో, లతలలో, గుల్మములలో."

మధ్యలోనే హిరణ్యకశిపుఁడిట్లడిగెను :- "ఈ రాతి స్తంభములోఁగూడ నీ యీశ్వరుఁడున్నాఁడా ?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "తండ్రీ ! ఆతఁడన్నిటిలో సమానరూపముగ వ్యాపించి యున్నాఁడని నేను చెప్పుచునే యున్నాను గదా ! కావున నీ స్తంభములోఁ గూడనున్నాడు."

అత్యంత క్రోధస్వరమున హిరణ్యకశిపుఁడిట్లనెను :- "ఉండఁడని పలికెదవా ? లేదా ? నీకు గనఁబడుచున్నాఁడా ? లేక యూహచేఁ జెప్పుచున్నావా ? నన్ను మోసగింపవలదు. నిజముచెప్పుము. ప్రత్యక్షముగఁ జూచుచున్నదానినే చెప్పుము.

సత్యవాదియగుఁ బ్రహ్లాదుఁడిప్పుడేమిచెప్పును. హిరణ్యకశిపుని క్రోధము పరాకాష్ఠను దాటిపోయినది. ఆతనికి హరిద్వేషము హద్దులు దాటిపోయెను. ఇచ్చటి ప్రహ్లాదుని, భక్తియును జరమ సీమ నందుకొనెను. భగవంతుడు సాధారణస్థితి యందు ప్రకటముకాఁడు. ఆహారపానీయాది సాంసారిక సుఖములందే సుఖము లనుభవించు వారికిని, తనయొక్క సాధారణస్థితికే సంతోషించువారికిని భగవానుఁడు శీఘ్రముగఁ బ్రక

టము కాదు. అత్యంత కామ భావముచేతను, అత్యంత స్నేహముచేతను మానవుడు హద్దులు దాటిపోవును. భావములు పరాకాష్ఠను జెందఁగానే అచ్చట శ్రీహరి ప్రకటమగును. ప్రహ్లాదుఁడిప్పుడే కాగ్రచిత్తమున భవభయహారియగు భగవంతునిఅత్యంత కరుణాసహితముగఁ బిలువఁగా, సమస్త చిత్తవృత్తులను బంధించి మనస్సు నాతనియందే తల్లీనము గావించి భగవంతుని కృపను, ఆతని సర్వవ్యాపకతను అనుభవ పూర్వకముగ దెలిసికొనెను. భగవంతుఁడు భక్తవశుఁడై యుండును. నిజమగు పిలుపు నందు కొని వరువిడును. ఆ స్తంభమునుండి భగవంతుఁడు చూచుచున్నట్లును కరాళమూర్తిచే అట్టహాస మొనర్చుచున్నట్లును దెలిసికొనెను." ప్రహ్లాదుని హర్షమునకు మేఱలేకుండెను. ఆతఁడు లికిపడి, యఱచి దృఢతాస్వరమున దైత్యరాజుతో నిట్లనెను :- "తండ్రీ! నేను బ్రత్యక్షముగగాంచుచున్నాను. అవశ్య మీ స్తంబమున భగవంతుడు కలఁడు. సాకార స్వరూపమున నున్నాఁడు."

హిరణ్యకశిపుఁడును బ్రహ్లాదుని యీ దృఢవచనములచే, గొంచెము సంభ్రమములోఁబడి, ఆ స్తంభమువైపునకే తదేక దృష్టితో జూడసాగెను. కాని స్తంబముతప్ప యింకేమియును గనఁబడఁజాలదయ్యెను.

అప్పుడాతఁడు రోషస్వరమున నిట్లనెను :- "నీచా! నీవు నన్ను మోసగింపఁదలుచుచున్నావా ? నేఁడు నేను నీశిర

స్సును భేదించెదను. నీభగవంతుఁడెట్లు రక్షింపఁగలఁడో చూచెదఁగాక! ఇప్పుడు నీవు సర్వజ్ఞుఁడగు నీ యీశ్వరుని ధ్యానించుకొనుము. ఇప్పుడాతఁడు వచ్చినిన్ను రక్షింపవలెను నాబారినుండి రక్షింపవలయును,"

ఈ కసరుచేఁ బ్రహ్లాదుఁడు భయపడను లేదు విచలితుఁడును గాలేదు. స్తంభమున భగవంతుఁడు భయంకరరూపమున నాలుకను జప్పరించుచున్నట్లు ప్రత్యక్షముగఁగాంచెను. భగవంతుఁడుఁ క్రోధముతో దైత్యరాజును నాశమొనర్ప నుద్యుక్తుడైనట్లుండెను. ఆతఁ డిట్లరచెను:-"తండ్రీ! స్తంభమందు భగవంతుఁడు ప్రత్యక్షముగనున్నాఁడు. మీరాతనినుండి రక్షింపఁబడుదురుగాక!"

ఇది వినఁగానే ఆ మహాదైత్యుఁడు పండ్లుపటపటఁ గొఱకుచు కన్నులెఱ్ఱఁజేసి 'తనయాసనమునుండి శీఘ్రముగలేచి నిలుచుండి ప్రహ్లాదుని మాటిమాటికి ధిక్కరించుచు వెంటనే సింహాసనము నుండి దుమికి. యిట్లనెను :- "మంచిది, నేను నేడు నిన్ను నీ విష్ణువును నీ చంద్రహాస ఖడ్గముచేఁ బనిపట్టెదను ముందుగా నేను నీ విష్ణువు పనిపెట్టెదను-చెప్పుము ఈ స్తంభములో నున్నాఁడా?

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా! ఇట్లు పలికి ఆతఁడు ఖడ్గమును దీసి ప్రహ్లాదునిపైకి దుమికెను" ప్రహ్లాదుఁడు మరల "అవును ఉన్నాఁడ" నెను,

ఇప్పుడు హిరణ్యకశిపుఁడు నిలువలేకపోయెను. అతఁడు తన శక్తికొలది పిడికిలితో గట్టిగా స్తంభమును గొట్టెను. ఏ పిడికిలిచే నొక్కదెబ్బకే బ్రద్దలయ్యేడిదో అట్టిదెబ్బకు స్తంభము చెక్కుచెదరలేదు, ఇంతేకాదు, దానినుండి యొకానొక అత్యంత భయానక శబ్దమయ్యెను ఆప్రతిధ్వని త్రిలోకములందు నిండిపోయెను. లోకపాలురు భయపడిరి. బ్రహ్మ భయపడి వేదములు బలుకసాగెను. ఋషిగణము స్తుతులు, స్వస్తులొనర్పసాగిరి. బ్రహ్మాండ కటాహము బ్రద్దలైనట్లందఱకును దోచెను.

)o(

# నృసింహ ప్రాదుర్భావము

౪౧౫

శ్లో॥ సత్యం విధాతుం నిజభృత్య భాషితమ్
వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః।
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహన్
స్తంభే సభాయాం నమృగం న మానుషమ్॥
(శ్రీభాగ. ౭ స్కం ౮అ. ౧౮ శ్లో॥)

ఉ. దెంపున బాలుఁడాడిన సుధీరత సర్వగతవ్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహ శరీరముఁదాల్చి చక్రి శి

క్షింపఁగ వచ్చి నాఁడుహరిచే మృతియంచుఁదలంతునైన నా
సొంపును బెంపునందఱును జూడఁ జరింతు హరింతు
శత్రువున్.

శ్రీమదాంధ్రభాగవతము.

భగవంతుఁడజన్ముఁడు. అయినను భక్తులననుగ్రహించు టకై జన్మించుచుండును. అతనికేమియును రూపములేదు. అయి నను నాతఁడాశ్రితుల సంతోషము కొఱకు నానారూపములను ధరించును. భగవంతుఁడందఱకును దల్లియును దండ్రియును ఆతనికి జనకుఁడుగాని, జననిగానిలేరు. అయినను నాతఁడు శరణాగతుల యిచ్ఛనుబూర్తి కావించుటకై ఒకా నొకనికిఁ బుత్రుఁడనిపించుకొనును. ఒకచోట నవతరించును. ఆతనికిఁ జరాచరములన్నియు నొక్కటియే, ఆతనికి దేనియందును భేద భావములేదు. ఆతఁడు సూకరమునగును. కచ్ఛప, మత్స్య, హంస, అర్ధసింహ అర్ధమనుష్యుఁడును గాఁగలఁడు. ఒక్కొ క్కప్పుడొకానొక భాగ్యవతియగు స్త్రీ వడిలోఁ గ్రీడయొనర్చుచు నామెకు పుత్రుఁడనిపించుకొనును. ఒక్కొక్కప్పుడు స్తంభమునే తనకుఁ దల్లియుఁ దండ్రియు ననుపించుకొనును. ఆతఁడు భక్త లను సంతుష్టిపెట్టునేకాని క్షేత్రబీజములను జూడడు. అందఱి కాది బీజమా యనయేకదా! ప్రకృతి ఆయన దాసి. కావున భక్తులకొఱకాతఁడు చీరయందే పెరుగును. స్తంభమును బగు లఁగొట్టుకొని బయటకు వచ్చును భక్తులు భగవంతుని దమ యధీసము గావించుకొనినారు.

నారదుఁడు ధర్మరాజగుయుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా! హిరణ్యకశిపుఁడు సభామధ్యమునఁగల స్తంభమందు ముష్టిప్రహారమొనర్పగా దానినుండి బ్రహ్మాండ కటాహము బ్రద్దలగునంతటి శబ్దమయ్యెను. బ్రహ్మలోకమునఁ గూర్చుండిన బ్రహ్మ చకితుఁడై అటునిటుఁ జూచుచుండెను. అతఁడిట్లను కొనెను:-"ఈ కుసమయమునఁ బ్రళయమెచ్చటినుండి వచ్చినది? ఇంకను బ్రళయ సమయముకాలేదు:"

క్రోధభ్రుకుటినిఁబెట్టి. దంతములచేఁ బెదవులను గఱచుచు నసురుఁడా భీషణ అత్యద్భుత ఘోరశబ్దమును వినెను. సమీపమున నుండిన దైత్యగణమా యసహ్య ఘోరారవమును విని గడగడ వణఁకు చుండిరి కాని వారికా కారణము తెలియ లేదు, దైత్యుఁడు చకితుఁడై స్తంభమువైపునకుఁజూచుచుండెను, కాని శబ్దమెచ్చటిదో తెలియుటలేదు. ఆశబ్దమున కాధార భూత మగు వ్యక్తి దర్శన మాతనికి కాలేదు. వెంటనే ఆ స్తంభము నుండి చతుర్భుజుఁడగు విష్ణువు ప్రకటమయ్యెను.

ఇదివిని ధర్మరాజగు యుధిష్ఠిరు డిట్లడిగెను:- "ప్రభూ! నిర్జీవమగు స్తంభమునుండి భగవంతుఁడేల ప్రకటమైనాఁడు? అతఁడవతరింపఁదలఁచుచో నే జీవజంతువర్గములోనైనను బుట్టవచ్చును గదా! స్తంభమునే తండ్రిగా నొనర్చుకొనుట బాగుండలేదు."

ఇదివిని నారదుఁడు నవ్వి యిట్లనెను:- "మహారాజా! భగవంతునకుఁ దండ్రియును ధాతయును గాఁగలవారెవరు? అతఁడే

అందఱు తాతలకును దాత. జడచైతన్య భేదమజ్ఞులమగు మనకే. ఆతనికి జడమేమి? చైతన్యమేమి? ఈ సమయమునఁ స్తంభమునఁ బ్రకటముగుటకుఁ జాలకారణములు కలవు. మొదటి కారణమే మనఁగా-నేను దేవతను, అసురులు, పశుపక్ష్యాదులు, నీచే సృష్టింపఁ బడిన యేజాతి జీవిచేతను జావఁగూడదని హిరణ్యాకశిపుఁడు వరములను బొందెను. భగవంతుఁడింకెవరికైనను బుట్టియుండినచో వారికి పుత్రుఁడనఁబడును. సగము సింహము సగము నరుఁడైనను నటుమానవుని కడుపుననో లేక సింహము కడుపుననో పుట్టియుండినచో మానవుఁడనియో లేక సింహమనియో పిలువఁబడును. ఇప్పుడు స్తంభమునుండి పుట్టినచో స్తంభమునకుఁ బిల్లలు పుట్టనేపుట్టరు. కావున స్తంభమునఁబుట్టి ఆతని వరమును సత్యము కావించెను. రెండవకారణ మొకటికలదు. ప్రహ్లాదుఁ డీ స్తంభమున భగవంతుఁడు కలఁడని చెప్పెను. భగవంతుఁడు తన ప్రతిజ్ఞనైనను మిథ్యగావించును గాని భక్తప్రతిజ్ఞను నెఱవేర్చుట కేమైనను జేయును. తన భక్తుని మాట అసత్యము కారాదని స్తంభమునుండి యుద్భవించెను. మూఁడవ కారణము కూడ ఇంకొకటి కలదు. ఆతఁడేవైకుంఠముననో క్షీరసాగరముననో, సాకేతముననో, శ్వేత ద్వీపముననో పరిచ్ఛిన్నుఁడుగ నున్నాఁడని అనుకొనకుండు నటులను, శ్రీహరి సర్వత్ర, సమస్త ప్రాణులయందు సమాన రూపమున వ్యాపించియున్నాఁడనియు, నాతనికి జడచేతనములు రాయి, కొయ్య,

దేహము అన్నియు నొకచోయని అసురులు గ్రహించుటకును స్తంభమున నుద్భవించినాఁడు.

ఈ విధముగ స్తంభమునసుండి వెలువడి భగవంతుఁడీ దైత్యుని సమ్ముఖమున నిర్భయుడై నిలుచుండెను. అ సమయమున నాతని శోభ యద్భుతముగ నుండెను, అ సమయమున విశ్వవందితమగు శ్రీహరి విగ్రహము సౌమ్యముగలేదు. ఆతఁడత్యంత భయానకరూపమునఁ బ్రకటమయ్యెను. ఆతని శిరస్సు వెండ్రుకలచే నావరింప బడి గుండ్రముగనుండెను. మస్తకము వెడల్పుగ నుండెను. వెడల్పుగా నున్న ముక్కులగుండా మాటి మాటికి నిశ్శ్వాసములు విడుచుచుండెను. అతని విశాలనేత్రములు రెండును గ్రోధకారణమునఁ దప్తస్వర్ణమువలె నెఱ్ఱగను భయానకముగను నుండెను. అవి విద్యుత్పిండములవలె మెఱయుచుండెను. పైన నున్న ఓష్ఠమందముగను భయంకరముగను నుండెను. దానిమీఁదబెద్ద పెద్ద వెండ్రుకలు మీసముల స్థానమున నటునిటు ఉండెను. ఆతని నోరు పర్వత కందరమువలె భీషణముగను, భయముత్పన్న మొనర్చునట్లుండెను. దానిలో దబ్బనమువలెఁగోరలత్యంత తీక్ష్ణముగ వెలుఁగుచుండెను. కదలుచు ఖడ్గమువలె నున్న జిహ్వతో నాతఁడోష్ఠములను మాటి మాటికి నాకుచుండెను. బొమముడిచే నాతని ముఖమండలము సాక్షాత్తుఁ గఁగ్రోధమే ముఖరూపమును ధరించి ప్రకటమైనట్లుండెను. నిక్క బొడుచుకొనిన పెద్ద చెవులు వెండ్రుకలచేఁగప్పఁబడి.

రెండు శంకువులు గడ్డిలో దాగియున్నట్లుండెను. ముల్లోకములను మ్రింగుటకై నోరు తెఱచెనా యనునట్లుండెను, ఆతని నాసికాపుటముల నుండి బయలు వెడలిన నుష్ణశ్వాసలు జగత్తును భస్మమొనర్పఁ బ్రజ్వలించుచున్నట్లుండెను. అది సాధారణ సింహమువలె పదిపదునైదడుగులది కాదు. సభామండపపుకప్పుబగులఁ గొట్టుకొని ఆతని మస్తకము స్వర్గమును దాకనుత్సహించుచున్నట్లుండెను. ఆతని మెడ మీఁదఁబెద్ద పెద్ద సుందర స్వర్ణరోమములెగురుచుండెను. అవియును నృసింహప్రభుని చేష్టలను దెలిసికొనఁజాలక భయకారణమున గడ గడ వణఁకుచున్నట్లుండెను. మనుష్యులకువలె నాతని వక్షస్థలము విశాలముగను నున్నతముగనుండెను దానియందు శ్రీవత్సలాంఛనము శోభించుచుండెను, కాని కోమలాంగి యగు లక్ష్మీదేవి యీ క్రోధమూర్తి సమ్ముఖమునకుఁబోఁజాలకుండెను. స్కంధరోమము లనుఁ గప్పఁబడి ఆతని స్తనద్వయము గడ్డితోఁగప్పఁబడిన చిన్నపర్వత శిఖరములవలె నున్నతముగ నుండెను.ఆతని యుదరము కృశముగ నుండెను. శరీరమందంతటను జంద్ర కిరణములవలె శ్వేతరోమావళి వ్యాపించియుండెను. ఆతనికి రెండుకాదు, నాలుగు కాదు, ఎనిమిది కాదు అనేక భుజములుండెను. నేఁడాతని చేతిలోఁబ్రియమగు గదయును లేదు. శత్రు సంహారకమగు సుదర్శన చక్రమును లేదు. నేఁడాతని దీర్ఘ తీక్ష్ణనఖములే సమస్తాయుధములుగా పనిచేయుచుండెను. నేఁడా తని శ్రీ విగ్రహమును నుగ్రముగను, దురాసదముగను గావించెను.ఆతని సమీపమునకు

బోవుట కెవరికిని సాహసములేకుండెను. నేఁడందఱును దూర ముననుండియే భయభీతులై యా యసౌమ్యమూర్తిని దర్శించు చుండిరి. ఎవనియొక్క అస్త్రశస్త్రములు పూర్వమున నసురుల యుష్ణరక్తమును బానమొనర్చినవో నేఁడారక్తము కొఱకనేక వజ్రసదృశములగు నఖములువ్విళ్ళూరుచుండెను. ఆతఁడు వెంటనే స్తంభమును బగులగొట్టుకొని అందఱ సమ్ముఖమునఁ బ్రత్యక్షమయ్యెను బగులగొట్టుకొని హిరణ్యకశిపుఁడు చేతిలో ఖడ్గమును బట్టుకొని కింకర్తవ్య విమూఢుఁడై నిలుచుండెను. ఆతఁడిట్లనుకొనుచుండెను:-"ఏమైనఁ గానిండు ఈతఁడే మాయావియగు విష్ణువు. ఈతఁడు మాయలు పన్నుటలో నిష్ణాతుఁడు. అందఱను మించిన మాయావి. బహురూపిఎప్పుడెట్లు కావలయు ననిన నట్టి రూతమును ధరించుచుండును. ఈతఁడనేక శస్త్రములతో నసురులను జంపినాఁడు. ఈతఁడుసూకరుఁడై మా తమ్మునిఁజంపినాఁడు. వీఁడు నన్నును జంపఁదల చియుండును; కాని నన్నేమి చంపఁగలఁడు? తానే చావఁగలఁడు. స్వయముగ మృత్యువునకుఁ గబళముకాగఁలఁడు. ఈతని శౌర్యము, తేజము. బలము, పరాక్రమము నన్నేమిచేయఁగలవు? వీఁడు నాకేమి, హాని కావింపఁగలఁడు?"

హిరణ్యకశిపుఁడు సాహసమును వీడలేదు. భయమును జెందలేదు. ఆతఁడు గదను దీసికొని నృసింహభగవానుఁని మీదకు బ్రహార మొనర్చుటకుఁబరువిడెను; కాని యాతఁడా సచరాచర స్వామిమీదనేమి ప్రహారమొనర్పఁగలఁడు. మిడుత అగ్ని

నార్పబోయి యేమిచేయును. అదియే భస్మమగును. రాత్రిపూటఁ బెట్టఁబడిన దీపము రవి యుదయింపఁగనే తేజోవిహీనమైనట్లు దైత్యుఁడు నిష్ప్రభుఁడై నృసింహుని తేజము ముందు నిస్తేజుఁడయ్యెను. భగవంతుని తేజము వలననే చరాచర విశ్వమందలి తేజస్వులు తేజోవంతులైరి. సృష్ట్యారంభమందు ప్రళయకాలమందలి తమస్సును బానమొనర్చియే ఈతఁడు జగత్తును ప్రకాశితమొనర్చెను. అసురుని తేజముకూడ ప్రభుదత్త తేజమే స్వయముగ సాక్షాత్తుగ ప్రభువే ప్రకటమైనప్పుడు అంశమంశియందు గలిసిపోయెను, దైత్యుఁడు తేజోవిహీనుఁడయ్యెను.

నారదుడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా! ఇప్పుడసురుఁడు సమ్ముఖమున నిలుచుండి నృసింహ భగవానునితో యుద్ధమొనర్ప నిశ్చయించుకొనెను.

## హిరణ్యకశిపు నృసింహుల యుద్ధము

౪౦౬

శ్లో॥ తం శ్యేనవేగం శత చంద్రవర్త్మభి
శ్చరంత మచ్ఛిద్రము పర్యుదో హరిః॥ ।
కృత్వాట్టహాసం ఖరముత్స్వ నోల్బణమ్
నిమీలితాక్షం జగృహే మహాజనః॥ ॥

(శ్రీభాగ, ౭ స్కం ౮ అ. ౨౮ శ్లో.)

వ. అని మెత్తంబడని చిత్తంబున గద యెత్తికొని తత్తరంబున నార్చుచు సకుంఠిత కంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచరకుంజరుండు నరసింహదేవున కెదురు నడచి తదీయదివ్యతేజోజాల సన్నికర్షంబునంజేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁగర్తవ్యంబులు దెలియక నిర్గత ప్రభుండై యుండె నప్పుడద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదా దండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథినేర్పున దితిపట్టుంబట్టి కొనెను....

శ్రీ మదాంధ్రభాగవతము.

అహంకారమే హిరణ్యాకశిపు. దానికి సాత్త్వికవృత్తిచే వివేక మను బుత్రుఁడు పుట్టును. ఆయహంకారము తమోగణముచే వ్యాప్తమై వివేకమునణఁపఁ దలఁచుచో నానావిధములగు యాతనలను బెట్టి, వివిధ కువిచారములను సృజించును, కాని ప్రహ్లాదరూపమగు వివేకము ప్రబలమగుటచే? ఆతనికి శమ, దమ, తితిక్ష, త్యాగ వైరాగ్యరూపమగు ననుచరులు దృఢ పడఁగానే అది ప్రజలమగును అప్పుడా వివేకము ప్రబలము కాఁగానే సకలభూతములలోఁదన యిష్టదైవము, ననుభవము నకుఁ దెచ్చుకొనును. హిరణ్యాకశిపునిరూపము తమోగుణా హంకారము. అది వివేకమును హింసించును. అప్పుడు దానికి దీనత్వము వచ్చును. దానివలన జ్ఞానరూపుఁడగు నృసింహుఁడు

డుత్పన్నుఁడై తమోరూపమగు నజ్ఞానమును నాశము కావించును. భక్తరూపమగు వివేకమునకు విజయము ప్రాప్తించును. ఈహిరణ్యకశిపు వధరహస్యము నెవ్వరెఱుంగుదురో వార్నెన్నటికిని మోహమును బొందరు.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో దేవర్షియగు నారదుఁడిట్లనెను :- రాజా ! హిరణ్యకశిపుఁడు తనకుఁ గాలరూపుఁడగు శ్రీహరిని సమక్షమునగాంచి, గదనుగైకొని భగవానునిపై కురికెను. భగవంతుఁడాతని దృష్టతనుగాంచినవ్వెను. ఆతఁడొకయదటున గదాసహితుఁడగు నసురునిఁ బట్టుకొని యిట్లనెను :- "ఓరీ ! ఇప్పుడేమి చేసెదవురా ?"

అసురుఁడది విననట్లుగనుండి తన శక్తికొలఁది భగవంతుని చేతినుండి బయట బడుటకు ప్రబల ప్రయత్న మొనరించెను, వంతునిచేతబడిన వాఁడెట్లు వదలించుకొనఁ గలఁడు ? కాని భగవంతుఁడు ఘాతుకము చేయఁదలఁచెను. ఆతనికిఁ గ్రీడయనిన నధిక ప్రియము. అందువలనఁ గ్రీడ యొనర్చుటకై ఆతనిని వదలివైచెను. పిల్లవానిని సంతోషపెట్టుటకై తండ్రి వానిని వదలివైచిన నాతఁడు వదలించుకొని పాఱిపోవును. అప్పుడు మిక్కిలి గర్వముతో నాతఁడిట్లనును:- "నేను నాబల ప్రయత్నములచేఁ వదలించుకొంటిని చూచితిరా ?" అదేవిధముగ నాయసురున కభిమానమును బెంచుటకై నరసింహుఁడు వానిని వదలివైచెను. పిల్లి నోటినుండి మూషికము తప్పించుకొని పాఱిపోవునటులను గరుడుని బాఱినుండి సర్పము పాఱిపోవునట్లును, కారాగృహమునుండి బంధితుఁడు తప్పించుకొని పాఱిపోవు

నట్లును, సింహముఖమునుండి మృగము తప్పించుకొని పాఱి పోయినట్లును బాఱిపోయెను.నరసింహుని బాఱినుండి దైత్యుఁడు తప్పించుకొనఁగానే అంతరిక్షమునఁ దమతమ విమానముల మీఁదఁ గూరుచుండిన లోకపాలురు అయ్యో అయ్యో అని కేకలువైచిరి. వారిట్లనుకొని:- "భగవంతుని చేతినుండి తప్పించు కొనిన యీయసురుని వధించుట చాల కష్టము." ఆలోకపాలుర శంకితచిత్తమును, భయభీతులగుటనుగాంచి నరసింహుఁడు నవ్వుకొనుచుండెను. ఇచ్చట హిరణ్యకశిపుని అభిమాన గర్వ ములును ముదిరెను. ఆతఁడిట్లనుకొనెను:- "చూడుఁడు నేనెంతటి బలినో. ఈమాయావియగు విష్ణుని జేతినుండియుఁ దప్పించు కొంటిని. నేనిప్పుడీతనిని వధింపక వదలను."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇప్పుడాదైత్యుఁడు శ్రమః గ్లాని, వికలతను మఱచి భగవంతునిపైకి దుమికెను. ఇప్పుడాతడు గదను విసరెను. చేతిలోనికి డాలు, కత్తినిఁ దీసికొని ఆ రణరంగ దుర్మదుఁడు యుద్ధమొనర్ప నుద్యుక్తుఁడయ్యెను, భగవంతుఁడు యుద్ధ మొనర్చుటకే స్వయముగా అవతరించెను. క్షీరసాగమున నిద్రించి, నిద్రించియును, వైకుంఠధామమున నానందవిహార మొనర్చియు విసుగుచెందినపుడు, తన నిజభక్తు లను నిమిత్త మొనర్చుకొని విపక్షమును స్థాపించుకొని స్వప క్షము నేర్పఱసుకొని స్వయముగ నవతరించును, అప్పుడు నవ్వును, ఆడును, పరువిడును, కొట్టును, దెబ్బతినును. ఇన్ని యేల లోకపల్లీలలన్నియును జేయును. కచ్ఛపావతారమున

నొక దైత్యునిఁ గైకొని మునిఁగెను. మందరాచలము వీపుపైఁ దిరుగుచుండఁగా జిలకు వీపును గోకుచున్నట్లుండెను. మత్స్యావతారమునఁ బాతాళమునకుబోయి దైత్యునిఁజంపి వేదముల నుద్ధరించెను. లక్షలకొలఁది వత్సరములు ఏకావర్ణముగ నున్న ప్రళయజలమందుఁ దిరుగుచుండెను. వరాహావతారమందు హిరణ్యాక్షునితో ద్వంద్వయుద్ధము కావించి, నానామల్లయుద్ధ నైపుణ్యములను జూపించి వానినిఁ జంపెను. వామనావతారమున బ్రాహ్మణుఁడయ్యు బలిని బంధింపఁగా నాతని యనుచరు లస్త్రశస్త్రములను ధరించి యాతనిపైఁకి రాఁగా వారితోడను యుద్ధము కావించెను. ఇంద్రునితోఁగూడి యుపేంద్రుఁడై అసురులతో ఘోరయుద్ధమొనర్చెను. ఇఁకఁ బరశురామావతారమును గూర్చి యడుగకుము. యుద్ధములోఁ బ్రళయదృశ్యమును జూపించెను. బ్రాహ్మణుఁడును నింతటి క్రూరతా యుద్ధమును జేయఁగలఁడను నూతన విచిత్ర విషయమును జూపించెను. ఇరువదొక్కసారి సమస్త పృథివిని నిఃక్షత్రియ మొనరించెను. రామావతారమునఁ దన యాయుధములతోఁబుట్టెను. భూమిలోని రాక్షసుల నందఱను జంపివైచెను. విభీషణాది భక్త రాక్షసులను దప్ప లోకములన్నిటిని గడగడ వణఁకించిన రావణుని, ఆతని బంధుబాంధవులను, కులపరివారమును, సైనికులను సంహరించెను. వీరత్వము యొక్క సజీవదృశ్యమును జూపించెను. శ్రీకృష్ణావతారమును గుఱించి యిఁకఁజెప్పవలసినదే లేదు. పాలుత్రాగు పసితనమునుండి చంపుటఁ బ్రారంభించి,

చివరకు దన పరివారమునుగూడ చంపి చివరకు స్వధామము
చేరెను. వ్రజమందున్నంతవఱకు పూతన, కేశి, ధేనుకాసుర,
అఘాసుర, బకాసుర, తత్సాసురాది అసురులను గ్రుద్దులతోడను,
దెబ్బలతోడను జంపెను. మధురకుఁజేరఁగానే తన యాయుధము
లను స్మరించి యితరులచే యుద్ధము చేయించుచుఁ దాను
మొనర్చెను. ఆతని యన్న బలరాముఁడు పెద్దవాఁడేకాని యెచ్చ
టికి యుద్ధమునకుఁబోవలసి వచ్చిన నచ్చటికిఁ బరువిడును.
బుద్ధావతారము నొక్కదానిని వదలినచో నన్ని యవతారము
లందును యుద్ధతృష్ణయే. కల్క్యవతారము దుష్టవినాశము
కొఱకే వచ్చును. ఆతఁడు గుఱ్ఱముపైనెక్కి స్వయముగ నధార్మి
కులగు దుష్టులను వినాశమొనర్చుటయేకాదు తన గుఱ్ఱపుగిట్ట
దెబ్బలచే నసంఖ్యాకులగు పాపులను నుగ్గుచేయును భగవానునకే
యుద్ధమనిన నింతటి ప్రియముకాఁగా జనులకు యుద్ధ ప్రియుల
నిన నాశ్చర్యమేమున్నది ? అందుకనియే గొప్ప గొప్ప
విద్వాంసులును శాంతి శాంతియని అఱచుచుందురు, అన్ని విధము
లను యుద్ధమును ఖండించెదరు; కాని యుద్ధము మాత్రమా
గదు. ఇదివఱకును నాగలేదు. ఇఁక ముందును ఆఁగబోదు.
యుద్ధమే జీవనము. యుద్ధము లేకున్న జీవనమేలేదు; ఉత్సా
హములేదు, ప్రగతికిఁ బ్రవృత్తిలేదు. వినాశములేదు, ఉన్నతి
లేదు, నూతనత్వములేదు, విజయోల్లాసములేదు. అందువలన

నిందిరారమణుఁడు వెంటనేపట్టుకొని హిరణ్యకశిపునిఁ జంపలేదు. సింహము వేటమృగముతో నాడినట్లు నృసింహుఁడు దైత్యునితో యుద్ధక్రీడ యొనర్చు చుండెను.

హిరణ్య కశిపుఁడు తన బలమును జూచుకొని గర్వ పడు చుండెను. అతఁడు తన సమ్ముఖమున నందఱను దుచ్ఛ ముగఁ జూచు చుండెను. అతఁడిట్లనుకొనెను :- "నా చర్మ మింద్రుని వజ్రమునఁ జీలలేదు. లోకపాలుర దివ్యాస్త్రములే నాముందు కుంఠితములైనవి. ఈ ఆటవిక మృగము నన్నేమి చేయఁగలదు. అని యాలోచించుకొని ఆతఁడు ఖడ్గమును ద్రిప్పుచు నటునిటు నడుగులు వేయుచుండెను. ఒక్కొక్క ప్పుడు ఖడ్గమును ద్రిప్పుచుఁ గుడివైపుగాఁ దిరుగుచుండును. ఒక్కొక్కప్పుడెడమవైపుగాఁ దిరుగుచుండును. ఒక్కొక్క ప్పుడు క్రిందగాఁ బోవుచుండును, ఒక్కొక్కప్పుడెగిరి పైఁగాఁ బోవుచుండెను. ఇట్లుఁ గర్వించును, నటుఁబరువిడును. ఒకానొక బాలుఁడు తన ధృష్టతచే బలవంతుఁడగు పెద్దవానిపైఁ దిరుగఁ బడి నతఁడు నిరంతరము నరహరిమీఁద నాక్రమించుచుండెను. అనవరత మిటునుండి అటు నెగురుచుఁ దనపేచీలు నైపుణ్య మును జూపుచుండెను.

ఆకాశమున నున్న దేవతాగణము భగవానుఁడీతనితో నాడుచున్నాఁడు, అట్లు చేసిన వీఁడు ప్రహార మొనర్చునేమోనని భయపడుచుండిరి. ప్రహ్లాదుఁడు చకిత నేత్రములతో భగవంతు

నిఁజూచుచుండెను. భక్తాపరాధమున భగవంతుఁడు హిరణ్యకశి పునిపైఁ గోపించినను, ప్రహ్లాదున కాతని మూర్తి సౌమ్యముగఁ దోఁచుచుండెను. దీపమాఱిపోవునపుడు పెద్దగ వెలుఁగును. అదే విధముగ నిప్పుడసురుఁడు బలపౌరుష పరాకాష్ఠనందుకొనెను. అప్పుడు నృసింహుఁడు భయంకరాట్టహాస మొనర్చి సరళముగా నాతనిని దన తీక్ష్ణణఖములు గల పంజాతోఁ బట్టుకొనెను. దీని వలన నసురుఁడు మిక్కిలి క్రుద్ధుఁడయ్యెను. తన శక్తికొలఁది భగవానుని పంజానుండి తప్పించుకొనుటకై పెనుగులాడు చుండెను. కాని యీసారి నృసింహుఁడాతనిని గట్టిగాఁ బట్టు కొనెను. ఇప్పుడతనినిఁ జంపక విడువఁదలచలేదు.

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇప్పుడసురుఁడు తన కంత్యసమయ మాసన్నమైనదని తెలిసికొనెను. ఆతనికి బ్రహ్మ వరములు జ్ఞాపకమునకువచ్చి, బ్రహ్మవరములుకూడ అబద్ధ మగునా యనుకొనెను. నాకు వరములున్నను జంపఁగలఁడా ?"

)o(

# హిరణ్యకశిపు—ఉద్ధారము

౪౮౨

శ్లో॥ విష్వక్స్ఫురంతం గ్రహణాతురం హరి
ర్వ్యాలో యథాఖుం కులిశాక్షతత్వచమ్।

ద్వార్యూర ఆపాత్య దదార లీలయా
నకై ర్యథాహిం గరుడో మహా విషమ్:
(శ్రీభాగ. ౭ స్కం. ౮ అ, ౨౯ శ్లో.)

మ.
విహ గేంద్రుండహి వచ్చుకై వడిమహాద్వృత్తిన్నృసింహుండుసా
గ్రహుండై యూరువులందుఁజేర్చి నఖసంఘాతంబుఁ వచ్చెదు
స్సహుదంభోళి కఠోరదేహు నచలోత్సాహున్మహాబహు నిం
ద్ర హుతాశాంతక భీకరున్ ఘనకరున్దైత్యాన్వయశ్రీకరున్.
--శ్రీమందాంధ్ర భాగవతము.

జీవుఁడు చావునకు భయపడుచుండును. ఏలననఁగా నీ సాంసారిక విషయముల నాతఁడు సత్యములనియు, సుఖప్రద ములనియు భావించి సదా వీనిని సేవింపఁదలచుచుండును; కాని నాశవంతము లమరములెట్లు కాఁగలవు? అసత్యములు, మిథ్యా పదార్థములు శాశ్వతము లెట్లుకాఁగలవు ? ఉత్పన్నమగునవి నాశముకాకపోవుటయనునది లేదు. ఈసత్యమును గమనింపక, బ్రహ్మయందు రమింపక ప్రాణములందును, అసువులందుననే రమించువాఁడసురుఁడనఁబడును. అసురులుగ్రతపస్సు ద్వారా మృత్యువును జయింపఁదలఁచుచుందురు. తపము భగవంతుని హృదయము తపో ఫలము వ్యర్థముగఁబోదు. కావున భగ వంతుఁడు మృత్యురూపమున బ్రకటమై వారిని స్వయముగ సంహరించును. హిరణ్యకశిపుఁడు బ్రహ్మను బ్రసన్నునొనర్చ

కాని యెన్నెన్నో దుర్లభ వరములను బొందెను. విష్ణువు తన నేమియును జేయఁజాలఁడనియు, దన నెవరును జంపఁజాలరనియు, బరాజితు నొనర్పఁ జాలరనియుఁ దలంచెను.ఏలననఁగా నేనజరామరుఁడను. కాని యీ యభిమానము చివరకు మిథ్య యని ఋజువయ్యెను.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా ! హిరణ్యకశిపుఁడెక్కువగ నెగిరి దూకుచుండఁగా మాటిమాటికినిఁ గత్తిఁద్రిప్పుచుఁ బ్రభువుమీఁదఁ బ్రబల ప్రహార మొనర్ప నుంకించునంతలో నృసింహభగవానుఁడు వానినిఁ దన పంజాతో నొడిసిపట్టుకొనెను. కాలఁద్రొక్కిన భుజంగము బుసలుకొట్టునట్లు కోపముతో బుసలుకొట్టుచుఁ దన శక్తికొలఁది నరహరి చేతినుండి తప్పించుకొనఁదలఁచుచుండెను; కాని యాతని ప్రయత్నమంతయును నిష్ఫలమయ్యెను, ఇప్పుడాతనికిఁ దన్నాతఁడింకఁ జంపఁగలఁడని దలఁచి, ఆతఁడు క్రోధముతో నృసింహునితో నిట్లనెను :- "నీవు మాయావియగు విష్ణువవని నేను నిశ్చయించుకొంటిని. నీవే సూకర రూపమును ధరించి నాసోదరునిఁ జంపితివి. నీవు నన్ను జంపఁజూచుచున్నావా ? నీవు నన్నుఁ జంపజాఁలవు."

ఇది విని నరహరి అట్టహాస మొనర్చెను. ఆతని హాస ప్రతిధ్వనిచేఁ ద్రిలోకములు ప్రతిధ్వనించెను. దైత్యుఁడు భయపడెను. సాహసములో మరల నిట్లనెను :- "నన్నుఁజంపు సామర్థ్యము నీలో లేదు."

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :- "ఏల ?"

హిరణ్యకశిపుఁ డిట్లనెను :- "నాకు బ్రహ్మ అమరుఁడగునట్లు వరముల నొసంగినాఁడు."

భగవానుఁడిట్లనెను :- "బ్రహ్మ అమరుఁడగునట్లు వరముల నెప్పుడొసంగినాఁడు ? ప్రపంచములో స్థాయియగు నమరత్వమెవరికినిఁ బ్రాప్తింపలేదు. తనకు నూఱు సంవత్సరములు కాగానే బ్రహ్మయును మారిపోవును. తన పదవియే తనకు స్థాయియైనదికాదే నిన్ను మృత్యురహితునిఁగా నెట్లొనర్పఁగలఁడు ?"

అసురుఁడిట్లనెను :- "అవును ఈమాటను బ్రహ్మయును జెప్పియుండెను. కాని నేనాతనిఁదికమకపెట్టి, మాయలోఁ బడవైచి సదా అజరామరుఁడు నగునట్లు దుర్లభవరములను బొందితిని. ఆవరములున్నంత వఱకు నన్నెవరును జంపఁజాలరు."

భగవంతుఁడు నవ్వుచు నిట్లనెను:- "నీవాతని మాయలోఁ బడవైచి యెట్లు వరములను బొందితివోఁ వాటిని సత్యమొనర్చుచు నిన్నుఁ జంపివైచెదను. చెప్పుము. నీవరములేవియో ? బ్రహ్మవరములు మిథ్యలనకుండునట్లు చేసెదను."

అంత హిరణ్యకశిఁడిట్లనెను :- "బ్రహ్మచే సృజింపఁబడిన ప్రాణిచేత నేనుఁ జావరాదని నాకు బ్రహ్మవరమున్నది. అట్టియెడ నీవెట్లు చంపఁగలవు ?"

భగవంతుఁడిదివిని నవ్వి యిట్లనెను :- నీకు బ్రహ్మసృష్టిలోని జీవులవలన నభయము ప్రాప్తించినది. నన్ను బ్రహ్మ

సృజింపలేదు. నేను బ్రహ్మనే సృజించితిని. బ్రహ్మ నాకుమారుఁడు. తండ్రినిఁ గొడుకెట్లు సృజింపఁగలఁడు ! కావున నీకు నాబారినుండి తప్పించుకొని పోఁజాలవు."

ఇది విని యసురుఁడిట్లనెను :- "మంచిది, నీవు బ్రహ్మ సృష్టి కావలివాఁడవైనఁ బోనిమ్ము. నన్నుఁ జంపినను నీ బ్రహ్మాండమందే కదా ! నేనింటిలోనను జావఁగూడదు, ఇంటి బయటను, జావఁగూడదను వరమును బొందితిని. ఇప్పుడు నీవు నన్నెట్లు చంపఁగఁలవు ?"

ఇది విని భగవానుఁడు రాజసభయొక్క తలవాఁకిలి కడఁ గూర్చుండియిట్లనెను:- "ఈతలవాఁకిలి ఇంటికి బయటను నున్నదా? లోపలనున్నదా ?"

ఇది విని దైత్యుఁడు తడవికొని యిట్లనెను :- "ఇది లోపలను లేదు, బయటనులేదు. నాకు ఇంకొక వరముకూడ కలదు. నేను పగలును జావరాదు. రాత్రియందును జావరాదు అట్టియెడ నీవే సమయమునఁ జంపెదవు ?"

అప్పుడు భగవంతుఁడు సూర్యాస్తమయమగువేళ - సంధ్యా సమయమున నని పలికెను - ఇదిగో, ఇప్పుడు పగలును గాదు ఏలననఁగా సూర్యాస్తమయమైనది. రాత్రియును గాదు. ఏలననఁగా నింకను జంద్ర, గ్రహ, నక్షత్రాదులేమియును గనఁబడుట లేదు. దీని నెవరును బగలనరు, రాత్రియు ననరు, ఇది సంధిసమయము."

ఇది విని హిరణ్యకశిపుఁడిట్లనెను :- "స్వామీ ! నీవు మాయలో మాతాతవైనావే. ఇన్ని మినహాయింపులు పెట్టు కొన్నను నీవు వీని నన్నిటిని నిరాకరించుకొనుచుఁ బోవు చున్నావే. బ్రహ్మచే సృజింపఁబడిన జీవివి కావు నీవు; కాని నేనీవరమునుగూడ పొందితిని. నేనే ధాతువుచేఁగాని, కాష్ఠము చేఁగాని నిర్మింపఁబడిన అస్త్ర శస్త్రములచేఁ జావరాదు. అట్టియెడ నీవు నన్ను దేనిచేఁ చంపెదవు ?"

భగవానుఁడు తన పెద్దపెద్ద తీక్ష్ణ నఖములను జూపించుచు నిట్లనెను :- "ఇవి యేధాతువుచేఁ జేయఁబడిన అస్త్రశస్త్రములు. వీని నెవరును నస్త్రశస్త్రములనరు. వీనిచే నీ బొట్టనుదురు బూజాపండును జీల్చినట్లు చీల్చివైచెదను."

హిరణ్యకశిపుని కాంతి క్షీణింపఁజొచ్చెను. ఆతని సాహ సము సడలిపోవుచుండెను. ఆతఁడు ధైర్యమును వహించి యిట్లనెను :- "ఇది యంతయును సత్యమే; కాని నీవు నన్నె చ్చటఁ జంపెదవు ? నేను నేలమీఁదను జావఁగూడదు, ఆకాశ మునను జావరాదను వరమును బొందితిని."

భగవంతుఁడిట్లనెను :- "నీకాళ్ళు నేలపై నిలిచినచో, నేనేదైన నస్త్రశస్త్రములచేఁ జంపుచో నేలమీఁదఁ జంపినట్లగును. నీవాకాశమున నెగురుచుండ, డేఁగ యితరపక్షులను బట్టుకొని చంపినట్లు చంపిన నాకాశమునఁ జంపినట్లగును. నేను రెండు విధములుగ నిన్నుఁజంపను. నామోఁకాళ్ళపైఁ బరుండఁబెట్టు

కొని నీ పొట్టను జీల్చినచో నది భూమిపైనను గాకుండును, ఆకాశముమీఁదను గాకుండును.

హిరణ్యకశిపుఁడు దృఢముగ నిట్లనెను :- "మంచిది, చంపెదవా నన్ను ? నేను నరునిచేఁ జావరాదనియు, మృగముచేఁ జావరాదనియు వరమును బొందితిని."

భగవానుఁడు నవ్వియిట్లనెను :- "నీ కన్నులు పూడిపోయినవా ? బుద్ధిభ్రష్టమయ్యెనా ? నీకుఁగనఁబడుటలేదా ? నన్ను మనుష్యుఁడని యెవరందురు ? సింహమనియు ననరు. శిరస్సుసింహమునకువలెను, మొండెము మనుష్యునకునువలె నున్నది. కావున నేను నరుఁడను గాను, సింహమునుగాను. కొంతనరత్వము, కొంతసింహత్వము కలదు కావున నరసింహుఁడు."

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "నాకింకొక వరమున్నది. దానిని మాత్రము నీవు నిరాకరింపఁజాలవు. ప్రపంచములోఁ జైతన్య, జడములని రెండురకముల వస్తువులు కలవు. కొన్ని ప్రాణముకలవి. కొన్ని ప్రాణములేనివి. రెంటిచే నవధ్యుఁడను. నాకు బ్రాణహీనవస్తువుల చేతను మృత్యువు సంభవింపదు. ప్రాణమును ధరించినవస్తువుల చేతను మృత్యువు సంభవింపదు."

భగవానుఁడిట్లనెను :- ప్రాణములేనివి పెరుగవు. వానిలోఁ జైతన్యముండదు. ఇఁక బ్రాణము కలుగువాటికి వృద్ధియుండును. చైతన్యము కనఁబడదు. కోసిన నొప్పికలుగును.

ఈనఖములు జడములా ? చైతన్యములా జడములైన నేలఁ బెరుగుచున్నవి ? ఇతరావయవములవలె సజీవములగుచో వ్రేళ్ళనుగోసిన నొప్పికలిగినట్లు నొప్పియేలఁ గలుగదు ? కావున నీనఖములు జడములు చైతన్యములు నగుచున్నవి. పూర్తిగా జడములును గావు, పూర్తిగాఁ జైతన్యములును గావు కావున నివియే నీప్రాణాలను దీయఁగలవు."

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "నేను దేవాసుర, నాగ, కిన్నర, యక్ష గంధర్వాది సమస్త దేవతలచేతను నవధ్యుఁడను. అట్టి వరమును నేను బొందితిని."

భగవంతుఁడిట్లనెను:- "నేను దేవతను గాను, యక్షుఁడను గాను, గంధర్వుడను గాను, మానవుఁడను గాను, పశువును గాను, పక్షినిఁగాను. నేనెవఁడనో వాండనే. కావున నసురరాజా ! ఇఁకనీవు తప్పించుకొనఁజాలవు. నీవనేక రక్షణోపాయములను జూచుకొంటివి కాని వాని నన్నిటిని నేను నిష్ఫలమొనర్చెదను. నేఁడు నిన్నుఁజంపి నాభక్తులను నిర్భయుల నొనర్చెదను. వారి దుఃఖములను దూరమొనర్చెదను,"

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితోఁ జెప్పుచున్నాఁడు:- ఇట్లు పలికి క్రోధముచే నేత్రములెఱ్ఱఁ జేసి నృసింహ భగవానుఁడు వానినిఁ దనవంజాతోఁ బట్టుకొని, సభాద్వారముకడకుఁ గొనిపోయి. తన తొడలమీఁద బరుండఁబెట్టుకొని, తీక్షణఖములతో నాతనిపొట్టను జాపలల్లువాఁడు తుంగను జీల్చినట్లును, గరుడుఁడు గొప్పవిషసర్పములను జీల్చినట్లును,

సింహము గజముమొక్క పొట్టను జీల్చివైచి నట్లును, బిల్లలు
కత్తితో దోసకాయను జీల్చినట్లునుజీల్చివైచెను.

నరసింహుఁడు హిరణ్యకశిపుని పొట్టనుజీల్చి దానిలోనికి
దీక్షనఖములుకల కర్కశ కరములను జొనిపి ఆంత్రములను
బయటకు లాగెను. ప్రేవులు బయటకు వచ్చుటచేతను, బొట్ట
చీల్పఁ బడుట చేతను, రక్తము చివ్వునఁ బిచికారీలవలె వచ్చు
నట్లు పడుచు భగవానుఁడు దైత్యుని శరీరముతోఁ హోళీపండుగ
జేయుచున్నట్లుండెను.ఆసమయమున నెట్టునినెత్తురుచే శరీరమంత
టను బూయఁబడినవాఁడై గులాబిరంగుతో శ్రీహరి శోభి
చుచుండెను రక్తబిందువు నాతని స్వర్ణరోమములు పూచిన పగడ
పు చెట్టువలెనుండెను. నెట్టునగు ముఖముమీఁదఁ గ్రోధముచే
నారక్తనేత్రముల మీఁదఁబడి బిందువులు చందనముచే నాతని
ముఖమునఁ బత్త్రావళీ రేఖలున్నట్లుండెను, రక్తరంజితమగు
నాతని వెండ్రుకలు కదలునపు డాతని మృత్యువును సమర్థించు
చున్నట్లుండెను. భగవానుఁడు దైత్యునియుదరము నుండి రక్త
రంజితములగు ప్రేవులను దీసి మాలలుగా మెడలోధరించెను.
దీనివలననాతఁడు భయంకరుఁ డయ్యుఁజాల అందముగ
నుండెను. ప్రేవులను దీసినతరవాత నాతఁడు దైత్యుని పొట్టలో
నికిఁజొనిపి నఖములతో నాతనిపొట్టను దురుమసాగెను.

ఇది విని శౌనకుడిట్లనెను:- "మహాభాగ! హిరణ్య కశి
పునిఁ జంపినజాలును గదా! భగవానుడిట్టి భీభత్స కృత్యమును
జేయనేల?"

ఇదివిని సూతుఁడిట్లనెను- "మహాభాగా! భగవానుఁడు సర్వగతుఁడు. అన్నిటియందును సమాన రూపమున వ్యాపించి యున్నాఁడు, శృంగార, హాస్య ,కరుణా, రౌద్ర, వీర, భయానక, అద్భుత, శాంత, భీభత్సాదులన్నియును నాతని రసములే. అతఁడు సర్వరసమయుడు అతఁడే రసము. అన్నిటి ప్రదర్శన మాతఁడే చేయఁగలడు. దీనినిఁబట్టి భగవంతునకేదో సందేహము జనించినట్లు కనబడు చున్నది. ఎదురుగా నిలుచుండినఁ బ్రహ్లాదునిఁగాంచి భగవంతుఁ డిట్లనుకొనెను:- "ఇట్టి భక్తరత్నమీ యసురునినుండి యుద్భవించినాఁడు, ఈతని కడుపున నిట్టి భక్త రత్నమింకొకఁడెవడైన దాగియున్నాఁడేమోనని అతని ప్రేవులను గంఠమున ధరించి, ఇతనిపొట్టను వెదకి గిరిగిరి చూచు చుండెను. అట్టి భక్తరత్నమింకెవఁడైన దొరికినచోఁ బ్రహ్లాదునితో గూడ ఆతనినిఁగూడ తన హృదయమున ధరింతమను కొనెను. ఇంకొక కారణముకూడ కలదు. ఈతఁడు నాభక్తునిఁ జాల కష్టపెట్టినాఁడు. శరీరము తెగిన నెంతటి కష్టము కలుగునో యీ తనికినిఁ దెలియవలయుననుకొనెను. దీనికి మూఁడవ కారణముకూడ కలదు. సర్పము తెగినను బైరగాలి కొట్టినచో బ్రదుకును. పొరబాటున నొక సర్పమునకు ఫణము వఱకు తెగిపోయినది. ఆ ఫణమెగురుచు వచ్చి, యా కొట్టిన మనుజుని జూడనెరిగి, ఆతని యింటికి వచ్చి, చెప్పులలో దాగి వానినిఁ గాటువైచినది. ఈతఁడును విషధర సర్పము వంటివాఁడే. ఈతని పొట్టలో గొంచెమైనఁ బ్రాణమునిలిచెనా

వీఁడు మరల జీవించునని వెదకి వెదకి ఆతని ప్రాణములను దీయుచుండెను,

నారదుఁడు ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నాఁడు:-"రాజా! అసురుఁడుసురులను విడువఁగానే భగవానుఁడు వానిని వెంటనే నేలపైఁబడవైచెను. అసురుఁడు చనిపోఁగానే వేలకొలఁది ఆతని సేవకులును ననుయాయులును నృసింహభగవానునిఁ జంపుటకు నస్త్రశస్త్రములచు గైకొని పరువిడిరి. భగవంతుఁడొక్కసారి గర్జించి పదియిరువది మందినెత్తి. ఆరోషము తోడనే పట్టుకొని మధ్యకుఁజీల్చివైచెను. ఇంకేమున్నది ? అందఱును బారిపోఁజొచ్చిరి. చాలమంది అసురులు నేలఁబడిచచ్చిరి. మిగిలిన వారలఱ చేతిలోఁ బ్రాణములను బెట్టుకొని పాఱిపోయిరి. కొంద ఱసురులస్త్రశస్త్రములను గైకొని వచ్చిరి, భగవంతుఁడొంటరిగా నుండెను. ఆతనిచేతులే ఆతని సహాయ సైనికులు. పెద్ద పెద్ద తీక్ష్ణనఖములే ఆతని యమోఘ అస్త్ర శస్త్రములు. ఈ బలమునసే ఆతఁడు సమస్తా సురులను జయించెను ఇప్పుడాతని దగ్గఱకు వచ్చుట కెవరికిని సాహసము లేకుండెను. నృసింహుని క్రోధమింకను శాంతింపనేలేదు. ఆతఁడు రోషావేశుఁడై సభామండపమున నటు నిటుఁదిరుగసాగెను.

)o(

# సింహాసనా సీనుఁడగు నృసింహ ప్రభువు

౪౮౮

శ్లో॥ తతం సభాయా ముపవిష్ట ముత్తమే
నృపాసనే సంభృత తేజసం విభుమ్॥
అలక్షిత ద్వైరథమత్య మర్షణమ్
ప్రచండ వక్త్రం న వభాజ కశ్చన॥
(శ్రీభాగ, ౭ స్కం ౮ అ. ౩౪ శ్లో.)

శా॥ రక్షో వీరుల నెల్లఁద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టి క్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనా రూఢుఁడై
యక్షీణాగ్రహుడై నృసింహుఁడుకరాళాస్యంబుతో నొప్పెఁదన్
వీక్షింపం బలికింపనోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్॥
....శ్రీ మదాంధ్ర భాగవతము.

మనకుఁ బూజనీయు లభినందింపఁ బడవలయునని మనకు స్వాభావికేచ్ఛ యుండును. మన పూజను స్వీకరింపవల యుననియు నుండును. మనమాతని పూజకు శ్రద్ధగా సమ ర్పించిన వస్తువును మన ప్రసన్నతకొఱకు గ్రహించవలెనని యుండును. మన వస్తువులను భేదభావములేక నిస్సంకోచ భావ ముతో స్వీకరించవలెను. సాధారణముగ గురుజనులట్లే చేయు చుందురు. తన యాశ్రితుల ప్రసన్నత కొఱకు వారొసంగిన యుపహారములను స్వీకరించుచుందురు. కాని భక్తుడగు శిష్యుని

యైశ్వర్యమును దనదిగా భావించుచుఁదాను నోటితోఁ జెప్పు కున్నను దాని నుపభోగించునెడల నిందులో నత్యధికమగు నాత్మీయత సిద్ధించును. దీనిచే భక్తుని యానందమునకు మేఱ యుండదు.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! ఆ హిరణ్యకశిపుచే సమస్త ఋషులును మునులును, పితరులును, గింపురుషులును, భూత, భేతాళ కిన్నరాదులును, బాధలను బొందిరి. అసంతుష్టినిఁ జెందిరి. ఆతని పేరు వినగానే వీరంద ఱకును దలనొప్పి వేయుచుండెడిది. ఈతఁడు త్రైలోక్య శాసకుఁడగుట యెవ్వరికిని యిష్టములేదు; కాని అందఱును వరములకు వివశులైరి. దానినన్యథా కావించుటకు సాహస మెవరి కున్నది ? ఆతఁడందఱకును బితామహుఁడే. అందఱు నాతనికంటెఁ జిన్నవారే. ఆతనికి గూడ తండ్రియైనవాఁడు వచ్చి దైత్యరాజును జంపగా నందఱ హృదయములు చల్లఁ బడెను. హిరణ్య కశిపుఁడు చావఁగానే దేవతలు హర్షోత్కర్ష ముచే నృత్యము చేయసాగిరి. దేవాంగనలు కల్పవృక్ష పుష్పము లను నంజలులందు నింపుకొని నృసింహ భగవానునిపై వర్షింప సాగిరి. గంధర్వులు గానమొనర్చిరి. ఋషులును, మునులును, సిద్ధచారణులును నృసింహ భగవానుని స్తుతింపసాగిరి. అంత రిక్షమునఁ గోలాహలము వ్యాపించెను. దేవతలు పైనుండి దిగి భూమిమీఁదకు వచ్చిరి; కాని భయముచే భగవానుని దగ్గఱకు

వచ్చుటకు సాహస మెవరికిని లేకుండెను. దూరమున నుండియే వారానందమును ప్రకటించుచుండిరి.

అందఱకంటె నెక్కుడు ప్రసన్నత దేవతలకుఁ గలిగెను. ఏలననఁగా వారితోడనే హిరణ్యకశిపుఁడధిక శత్రుత్వమును వహించెను. వారికి రామరాజ్యము వచ్చినట్లుండెను. ఆతఁడొసంగిన దుఃఖములు పడఁజాలక దేవతలు దయానిధికి ధామమగు క్షీరసాగరము నకుఁబోయిరి. ఎంతోస్తుతింపగా భగవానుఁడు, రెండు ముక్కలు చెప్పెను: ఇప్పుడింకను నాయసురుఁడు చంపఁబడు కాలము రాలేదు, నాకు పరమభక్తుఁడగు ప్రహ్లాదునకు నానా యాతనలు కలిగించినప్పుడు నే నవతరించి వానినిఁజంపెదను. అప్పటినుండియు దేవతలు ప్రహ్లాదుని జన్మకొఱకుఁ బ్రతీక్షించుచుండిరి. ప్రహ్లాదుని హిరణ్యకశిపుఁడు బాధించినకొలఁది భగవంతుఁడవతరింపఁ గలడను నాశవారి కధికమగుచుండెను. నేఁడా భగవంతుఁడు స్తంభమును బగులఁ గొట్టుకొని - విచిత్ర వేషమును ధరించి ప్రత్యక్షమగునప్పటికి దేవతల హర్షముచే ముల్లోకములును గోలాహలము నిండిపోయెను. వారు దేవదుందుభులను బణవాది వాద్యములను ప్రమోగింపసాగిరి. అప్సరసల నృత్యముయొక్క వయ్యారములు, గంధర్వుల గానముయొక్క కమనీయత యెల్లెడల వినిపించుచుండెను. దర్శనార్థులగు దేవతలును, నుపదేవతలును విమానములతో నాకాశమున వ్యాపించిరి. వారందఱును జేతులలోఁ బుష్పాంజలులను గ్రహించి నరసింహుని స్తుతింప నెంచు

చుండిరి. కాని ఆతని వికరాళవదనమును గ్రోధమున మెఱయు చుండిన నెఱ్ఱని నేత్రములనుగాంచి యెవరినోటినుండియు నొక్క శబ్దమైన వచ్చుచుండుటలేదు. సమీపమున కెవరును బోఁజాల కుండిరి. బ్రహ్మ, దేవేంద్రుఁడు, సదాశివుఁడు అన్యదేవగణము, ఋషులు, పితరులు, సిద్ధులు, విద్యాధరులు, నాగులు మనువు, ప్రజాపతులందఱును వాకరి ముఖ మొకరు చూచుకొనుచుండిరి. వారందఱలో బ్రహ్మ పెద్దవాఁడు; కాని సమ్ముఖమునకుఁబోవుట కాతనికిని సాహసము లేకుండెను. కావి అందఱముందు తన భయమును గూర్చి చెప్పుకొనుటెట్లు ? ఈ నాపుత్రులు. పౌత్రు లేమి మాటలాడఁగలరు ? అని యాలోచించి దూరమున నుండియే దండప్రణామము గావించి చేతులు జోడించుకొని బ్రహ్మ యిట్లనెను:- "ప్రభూ! నీ యద్భుత శక్తికి మేఱలేదు. నీ యైశ్వర్యమును నంతులేనిది. నీ కర్మములు సదా మంగళమయ ములు పవిత్రములుగ నుండును. నీవు శివస్వరూపుఁడవు, నీ కారమ్యులేవియును నశివములుగ నుండఁబోవు. నీవీదృశ్య ప్రపంచమును బ్రయాసము లేకయే లీలగా సృజించెదవు. నన్ను సృష్టి కార్యమున నియోగించిన వాఁడవు నీవే. స్వయముగ విష్ణుఁడవై నేను సృజించిన దానిని పాలన పోషణ మొనరించె దవు. చివరకు స్వయముగ శంకరుఁడవై దానిని సంహరించెదవు నీవానందుఁడవు. అచ్యుతుఁడవు. అవ్యయుఁడవు అవినాశివి

అవికారివి, నీ పాదపద్మములకు నేను బ్రణతుఁడనై మాటి మాటికి బ్రణామ మొనరించెదను."

బ్రహ్మయొక్క స్తుతిని వినఁగానే అందఱకును సాహస మినుమడించెను. ఇప్పుడు బ్రహ్మదూరముననుండి స్తుతించు నాచారమును గావించెను. అందఱును నట్లేదూరమునుండి స్తుతింపసాగిరి. అందఱకంటె ముందు బ్రహ్మ నిలుచుండెను. బ్రహ్మ యొక్క స్తుతివందనములు పూర్తికాఁగానే దేవాధిదేవుఁ డగు శంకరుని వంతు వచ్చెను. ఆతఁడును నిలుచుండి చేతులు జోడించుకొని స్తుతింపసాగెను.

ఇంతవఱకును భగవానుఁడగు నృసింహుఁడు క్రోధ ముతో నున్నాఁడని శివుఁడు గ్రహించి ఆతని క్రోధమును శాంతింపఁ జేయుటకై అత్యంత వినయముతో స్తుతించుచు నిట్ల నెను :- "భక్తభయ హారీ ! నీవు కామక్రోధాది వికారములకు దూరుఁడవని మాకుఁ దెలియును ఒక్కొక్కప్పుడు నీవు క్రోధి వగుట వ్యాప్తి విఘాతముకొఱకు కాదు సరిగదా భక్తవత్సలతా కారణముననే క్రోధివయ్యెదవు. ఈ సమయమున నీవట్లే క్రోధ ముతో నున్నావు. ఇఁకనిప్పుడది అవసరముకాదు. ఈక్షుద్ర దైత్యుని కారణమున నింతటి నీకనురూపముగ లేదు. ఒకవేళ నీ దైత్యునిపైఁ గ్రోధము కలిగిన దనుకొనుఁడు ఆతఁడు మరణించినాఁడుకదా ! కారణము విశీనముకాఁగానే కార్యముతోఁ బనియుండదు. ఎవనికారణమున వింతగాఁ గోపమును జెందితివో అట్టి భక్తాగ్రగణ్యుఁడగు బ్రహ్లాదునిఁగృప జూడుము. ఈతని సౌమ్యదృష్టితోఁగాంచి యోదార్చుఁడు."

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! భగవానుఁడిట్టి క్రోధ మిదివఱకెన్నఁడును జెందియుండలేదు. ఒక్క అసురుని కొఱకింతటి యధిక క్రోధము కొంచె మసంగతముగఁ గనఁబడు చున్నది. భగవానునిముందు కీడిపతంగమువంటి యా దైత్యుఁ డెంత ? ఆతనిఁ జంపిన తరువాతఁకూడ భగవంతుఁడేల శాంతింపలేదు ?

ఇది విని శీఘ్రముగ సూతుఁడిట్లనెను :- "మహాభాగా ! భగవంతుని క్రోధము దైత్యునిపైనఁగాదు. దైత్యుఁడాతని సమ్ముఖమున నున్నాఁడాయేమి ? నాఁభక్తుని నీ దుష్టుఁడెంతటి యాతనలు పెట్టి నాఁడనియే ఆతనికిఁ గ్రోధము వచ్చెను. భక్తవత్సలతా కారణముననే భగవానుఁడధిక కృద్ధుఁడయ్యెను. సమ్ముఖమున నమాయకుఁడగు బ్రహ్లాదునిఁ గాంచఁగనే ఆతని క్రోధము నుప్పొంగెను. ఇట్టి యమాయకపు బాలుని దుష్టుఁడెన్నెన్ని కష్టములు పెట్టినాఁడు. ఆతనికిఁ గొంతగాఁ దనమీఁదఁ గూడ నేనిదివఱకే యేల ప్రకటము కాఁగూడదను కోపము కలదు. "మునులారా ! భగవానుఁడు కృపాసాగరుఁడు. ఆతనికిఁ గ్రోధముకూడ భక్తుల నిమిత్తమే. ఆ కోపము వరదానముతో సమానమే."

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! బ్రహ్మ శివుఁడు స్తుతింపఁగానే భగవానుఁడు వారినిఁగసరలేదు. అందువలన నితరులకును స్తుతించుటకు సాహసమేర్పడి వారును గ్రమముగ స్తుతింపసాగిరి.

# ఇంద్రాదిదేవతలు నృసింహుని స్తుతించుట

౪౮౯

శ్లో॥ ప్రత్యానీతాః పరమభవతా త్రాయతా నఃస్వభాగా ।
దైత్యాక్రాంతం హృదయకమలం త్వద్గృహం ప్రత్యబోధి
కాలగ్రస్తం కి యదిదమహూ నాథ శుశ్రూషతాం తే
ముక్తిస్తేషాం నహి బహుమతా నారసింహాపరైః కిమ్॥

(శ్రీభాగ. ౭ స్కం ౮ అ. ౪౨ శ్లో॥)

సీ॥ ప్రాణి సంఘముల హృత్పద్మ మధ్యంబుల
నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు
దింతకాలము దానవేశ్వరుచే బాధపడి
చిక్కియున్న యాపన్న జనుల
రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁజంపి
క్రతు హవ్యములు మాకు గలిగె మరల
మంటిమి నీ సేవ మరగినవారలు
కైవల్య విభవంబు కాంక్ష సేయ

ఆ॥ రితర సుఖములెల్ల నిచ్చగింపఁగనేల,
యస్థిరంబు లివి యనంత భక్తిఁ
గొలువనిమ్ము నిన్ను ఘోరదైత్యానీక,
చిత్త భయద రంహ, శ్రీనృసింహ

శ్రీమదాంధ్రభాగవతము.

ఏ వ్యక్తియైనను మరణించినచో నేదైన హర్షముగాని శోకముగాని ప్రకటించినచో నది సాధారణముగఁ దన స్వార్థము నెదుటఁబెట్టుకొని చేయఁబడును. భార్యనన్నుఁబోషించువారెవర నెదుటఁబెట్టుకొని చేయఁబడును. భార్యనన్నుఁబోషించువారెవర నును. మమ్ములను గనిపెట్టియుండు వారింకెవరని పుత్రుఁడ నును. ఇంక నాకు చీరెలు సారెలు పెట్టువారెవరనియుఁ ప్రేమించు వారెవలనియు పుత్రికయనును. సుఖదుఃఖానుభవము తన మూలముననే సంభవించుచుండును తన దుఃఖముచే దుఃఖ మును, సుఖముచే సుఖమును గలుగును హిరణ్యకశిపుని శాస నముచే సమస్త దేవతలును, నుపదేవతలును దుఃఖితులైరి. ఆతఁడు మరణింపఁగానే తమ తమ దుఃఖములను జెప్పుకొని భగవంతునకుఁగృతజ్ఞతను బ్రకటించుకొనిరి.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "ముందుగా కమలాసనుఁడును, పార్వతీపతియును స్తుతించిన మీఁదట శచీపతియగు దేవేంద్రుఁడు నరహరి సమీపమునకు వచ్చి, దూరమున నుండియే ప్రణామము కావించి చేతులు జోడించుకొని యిట్లనెను :- "ఓ పరమాత్మా ! అఖిలభువనేశ్వరా అశరణశరణా ! మీరు యజ్ఞపతులు వాస్తవముగ యజ్ఞభోక్తవు నీవే. మీ కంశభూతులమగుటచే మేమును యజ్ఞ భాగములను బొందుచున్నాము దాని వలననే మాకు గడుచుచున్నది. ఈ దుష్టుఁడు మా యీ యజ్ఞభాగములను హరించినాఁడు. తానే యింద్రుఁడై యజ్ఞభాగములను గ్రహించుచున్నాఁడు. వానను గూడ అతఁడే కురిపించుచుండెను. మీరీ దుష్టుని సంహరించి

మా యజ్ఞభాగములను మాకిప్పించితిరి. కావున నేము మీకృపచే మీరొసంగిన యీ యజ్ఞభాగములను మీ యంశములచే మీ శక్తి ద్వారా భోగించెదము.

ప్రభూ ! ఇదివఱకు మా హృదయములందు నీయొక్క మనోహర మధురమూర్తి నాట్యముచేయుచుండెడిది. ఇదివరలో మా హృదయకమలములు మీ కృపాకిరణములు ప్రసరించుట చేతను! అనుగ్రహవారిచేతను సదా ప్రఫుల్లితమై వికసితమై యుండెడివి. నిశారూపియగు నీ దుష్టుఁడు రాఁగానే కర్కశతా రూపమగు ఋరద క్రమముగ నెండఁగానే మా మనముకుర ములువాడి మూసుకొని పోయినవి. నేఁడు మీ కృపావృష్టిచేఁ, ప్రేమరూపమగు వారిచే ప్లావితముగావించి అప్రచండ తేజో రూపమగు దివాకరుఁడుదయింపఁగా దానికి మరల నవజీవన దానమొనర్చి వికసిత మొనర్చినది. సర్వేశ్వరా ! మీ పాదపద్మ ములకు పునఃపునః ప్రణామములు.

ఓదేవా ! మమ్ముఁలనందఱును స్వార్థులమందురు :- మేము సాధారణముగ భోగప్రధానులముగ నుందుము, కాని మీ పాద సన్నిధికి వచ్చియును భోగములను యాచించుట అత్యంత క్షుద్రతాకార్యము. భోగమోక్షముల నొసంగు స్వామిని నశ్వరములగు నీతుచ్ఛ సాంసారిక భోగముల నడు గుటేమిటి ! ఇవన్నియును నశ్వరములు, కాలగ్రస్తములు, నీ కృపను బొందినవారికి ముక్తియును దుచ్ఛమే కాఁగలదు. ఇక

భోగముల సంగతి చెప్పవలసిన దేమున్నది ? కావున ప్రభూ ! మాకు మీదయ కావలయును. మీరు మాపైనను గ్రహవృష్టిని గురిపింపవలయును. కృపాదృష్టిచే మమ్ములను జూడవలయును.

శతక్రతువగు దేవేంద్రుఁడు మెదలకుండిన తరువాత సమస్త ఋషిగణము తమ గడ్డలమును, జడలను సవరించుకొని చేతులలోఁ బుష్పములను గైకొని యిట్లనిరి ;- "తపోమూర్తీ ! ఆదిదేవా ! నీవిదివఱలో సృష్టినొనర్చి నప్పుడు, మా పూర్వజుఁడగు బ్రహ్మ నుత్పన్నము గావించినపుడాతఁడు సృష్టి రచనలోఁగర్తవ్య విమూఢుడై యుండెను. ఆ సమయమున మీరాతనికి దపమొనరింప నాదేశించిరి. తపము చేతనే అతఁడు విశ్వమును సృజిచెంను. తపముచేతనే సృష్టివృద్ధిని గావించుటలో సఫలుఁడయ్యెను. తపస్సుచేతనే ఆతఁడు సమస్త సిద్ధులను బ్రాప్తించెను. ఆయమోఘ సిద్ధిప్రాప్త్యుపాయములను దెలిసికొని కమలాసనుఁడు పరమ ప్రసన్నుఁడయ్యెను. అతడా యుపదేశమును మాకందఱకు నొసంగెను. అప్పటినుండి మేమందఱమును దపోనిరతులమైతిమి. మధ్యలో నీ పురుషుఁడు త్పన్నుఁడైనాడు. వీఁడు సమస్త జప, తప, నియమ, సాధనాదులన్నిటిని నాశముగావించినాఁడు. మేమందఱమును దపోహీనులమై దుఃఖితులమైనాము. గాని మీరు వీనినిఁజంపి, మరలఁ పూర్వరీతినిఁ దపస్సును జేయకొనఁగలము. తపస్సు ద్వారా మీయారాధన మొనర్పఁ గల్గుదుము. ఓ తపోధిపతీ ? మీ చరణకమలములకు మా ప్రణామములు.

ఇంతలోనే పితరులును సమ్ముఖమునకు వచ్చిరి. పితరులను గాంచి ఋషిగణమొక ప్రక్కకుఁ దొలఁగిరి. పితరులందఱును దుర్బలులుగ నుండిరి. వారివెంట వారిభార్య స్వధాదేవియు నుండెను. స్ఖలిత వాక్కులతో వారిట్లనిరి :- "ప్రభూ! మాకు వ్యవసాయములేదు, వ్యాపారమును లేదు, నౌకరి, చాకరి ఇంకే వృత్తియును లేదు. భూలోకముననున్న మాపుత్రులును, పౌత్రులును, నొసంగు పిండములను తర్పణ జలములను గ్రహించి పొట్టఁబోసికొనుచున్నాము. ఈ చోరుఁడా పిండములన్నిటిని దొంగిలించి తనపొట్టన బెట్టుకొన్నాఁడు. నేఁడు న్యాయాధీశుఁడగు నీవా దొంగిలించిన వస్తువు లన్నిటినిఁ బొట్టఁ జీల్చి బయటకుఁ దీసివేయుటే కాదు గాయమును గూడ శాశ్వతముగ మాన్పితివి. ఇప్పుడు మేమిఁక స్వస్థులము, పుష్టికలవారలమయ్యెదము. కావున జీవికా ప్రదానమొనర్చునో ప్రభూ! మీ పాదపద్మములకుఁ బ్రణామము."

పితరులిట్లు స్తుతించుటచే శ్రమితులుగఁ గనఁబడుటచే శీఘ్రముగ సిద్ధులిట్లనిరి :- నరహరీ! మమ్ములను సిద్ధులనుచుందురు. మాకు సిద్ధులు జన్మతోడనే ప్రాప్తించును. కాని యీ యసురుఁడు సమస్త సిద్ధులను నశుద్ధములు కావించెను. మాశక్తినంతను నపహరించినాఁడు. మేమసిద్ధులయ్యును శక్తి హీనులమును నైతిమి. ఈతని కడుపులోనికి సమస్త సిద్ధులును సన్నిహితములైనవి, మీ రీతనిని పొట్టను జీల్చి సమస్తసిద్ధులు బయటకు లాగితిరి. కావున మీ పాదపద్మములకుఁ బ్రణామము.

ఇప్పుడు మేము మీ దర్శనముచేతను నసురుని మృత్యువుచేతను మరల సిద్ధులమైతిమి."

సిద్ధుల వెనుక విద్యాధరులు నిలుచుండిరి. అందఱును గొంచెముగనో గొప్పగనో నేదో చెప్పుకొనవలయును. గావునఁ దమదుఃఖ వృత్తాంతమును జెప్పుకొని నృసింహుని స్తుతింప వలయుననుకొని యిట్లనిరి :- "విభూ ! మేము వివిధ విద్యలను మాధారణచే ధారణచేసితిమి "కావున విద్యాధరులమైతిమి. కాని యీ యసురుని సమ్ముఖమున మా విద్యలేమియును బనిచేయ లేదు. ఈతఁడు మా విద్యలన్నిటిని వ్యర్థము కావించినాఁడు. మమ్ములను విద్యారహితులు గావించినాఁడు. నేఁడు మీ రీతని ప్రాణములను వ్యర్థముగావించితిరి. ఈతని గర్వమును ఖర్వ మొనర్చితిరి, కావున నో విశ్వేశ్వరా ! మేము నయనాభిరామ ములగు మీ తీక్ష్ణనఖయుక్తములగు పాదములకుఁ బ్రణమిల్లు చున్నాము.

విద్యాధరులను, నాగులును నుపదేవులు, వీరు మిక్కిలి అందమైన వారుగనుందురు. వీరివద్ద గొప్పగొప్ప బహుమూల్యా ములగు మణులుండును. హిరణ్యకశిపుఁడు నాగలోకమునకుఁ బోయి నాగ స్త్రీలను, రత్నములను మూల్యవంతములగు మణులను బలవంతముగ నపహరించినాఁడు. నేఁడా యసు రుఁడు చచ్చుటనుగాంచి సుందరులగు సమస్త నాగకన్యలును నంతఃపురమునుండి బయటకువచ్చి నాగులతోఁ గూడి నాగ లోకమునకుఁ బోవుటకు మిక్కిలి సముత్సుకులై యుండిరి,

ఆతనినిఁగాంచి నాగులొక్కొక్కరిట్లు పలికిరి :- "ప్రభూ ! మీచేఁజంపబడిన యీ దుష్టుఁడు మా మణులను హరించుటయే కాదు, మా స్త్రీరత్నములను గూడ బలవంతముగ హరించి నాడు. నేఁడు వారందఱును హార్దికాభినందన మొనర్చు చున్నారు, ఈ యబల లందఱకును సుఖమునొసంగు నో సుఖా ర్ణవా ! మేము భక్తితోఁ బ్రణామ మొనర్చు చున్నాము.

నాగగణము స్తుతించిన తరువాత మనుగణము వచ్చిరి. ఇంత వఱకు దేవతలు స్తుతించుచుండిరి. ఇప్పుడు మనుష్యాకార ములతో వచ్చిన మనువులను గాంచి నృసింహుడు కన్నులెఱ్ఱఁ జేసిమీరెవరని యడిగిరి.

ఇది వినఁగానే మనువులకు భయమువైచి అందఱును వినయస్తుతులొనర్ప మఱచిరి. భయపడుచు స్ఖలిత వాక్కులతో నిట్లనిరి :- "దేవా ! మేము మీ యాజ్ఞను బాలించు మనువు లము."

గర్జించి నృసింహుఁడిట్లనెను :- "మీరేమి పనినిఁ జేయు చుందురు ?"

మనువులిట్లనిరి :- "స్వామీ ! మాకు కార్యములొనర్చు సామర్థ్య మెచ్చటనున్నది ? మీ రేర్పఱచిన హద్దులననుసరించి మీ యాజ్ఞలను బాలించు చుందుము. ఈ దుష్టుఁడు మీ హద్దుల నుల్లంఘించినాఁడు."

కసరి భగవానుఁడిట్లనెను :- "ఇప్పుడు మీ కేమి కావల యును ?"

మనువులిట్లనిరి :- "స్వామీ ! మాకు మీ యాజ్ఞ కావల యును. మేము మీకే సేవను జేయుచుందుము ?" ప్రభూ ! మేము మీకు దాసులము. మా వలనఁ గావలసిన సేవ యేదైన నుండిన నాజ్ఞాపింపుఁడు.

ఇట్లుపలికి మనుగణము వెనుకకు తగ్గిరి. వారి వెనుక ప్రజాపతిగణము చేతులు జోడించుకొని నిలుచుండిరి. నృసింహు డిప్పుడు మాటలాడసాగెను. అయితే రోషముతో మాటలాడు చుండెను. ఒకవేళ మీదఁకెక్కి కూర్చుండినచో గోవిందాయ నమోనమః కాఁగలదు. కావున నిప్పుడెవ్వరును స్తుతించుటలేదు. భగవంతుఁడడిగిన దానికి భయపడుచు జవాబు చెప్పుచుండిరి.

భగవానుఁడిట్లడిగెను :- "మీ రెవరయ్యా ?"

గడగడ వణఁకుచుఁ బ్రజాపతిగణ మిట్లనిరి :- "పర మాత్మా ! మేము మీచే నేర్పఱుపఁబడిన ప్రజాపతులము."

రోష స్వరమున భగవానుఁడిట్లడిగెను :- మీ రేపనికి నియుక్తులరైతిరి ?"

ప్రజాపతులిట్లనిరి :- "స్వామీ ! మీరే మమ్ములను బ్రజా పతులుగ నొనరించితిరి,"

భగవానుఁ డిట్లనెను :- మీరెంత ప్రజావృద్ధినిఁ గావించితిరి."

ప్రజాపతులిట్లనిరి :- "స్వామీ ! ఏమి చేయగలము. ఈ దుష్టుఁడు మా క్రియలను నిరోధించినాఁడు. అందువలనఁ బ్రజా

వృద్ధిని జేయఁజాలక పోయితిమి. ఈ దుష్టునణఁచి నారిది మా యదృష్టము ఇఁక మేము ప్రజావృద్ధిని గావించెదము. లోకము లన్నిటికిని మేలు కలుగును. అందఱును సుఖపడెదరు. మీ యీసత్వ ప్రధానమగు నవతారము లోక కల్యాణము నిమిత్తము కాఁగలదు."

వెనుక నిలుచుండిన గంధర్వులు మువ్వలు కట్టకొని మాటి మాటికి నడుగువేయఁబూనుచుండిరి. వారు నృత్యము చేయఁదలఁచు చుండిరి. కాని భగవానుని క్రోధమూర్తినిఁగాంచి ఆతఁడు మధ్యలో నొక్క గర్జింపు గర్జించినచో రసము నీరస మగునని చాల భయపడిరి అప్పుడు సుఖము పాడుకాఁగలదు. అందువలన వారు చేతులు జోడించుకొని ప్రజాపతుల పార్శ్వ మున నిలువఁబడిరి. వారి వేషమును గాంచి భగవానుఁ డిట్లడి గెను :- "ఓరీ ! మీరెవరురా ! ఆ చంకలోఁ బెట్టుకొనినదేమి?"

గంధర్వులిట్లనిరి :- "భక్తభయహారీ భగవాన్ ! మేము మీ యెదుట నాట్యమాడి పాడెడు గంధర్వులము. ఇవి మాతాం బూర, వీణ, మురజాతి వాద్యములు, ఆజ్ఞయైనచో మేముకొంచ ముగ సంగీతమును వినిపించెదము."

భగవానుఁ డిట్లడిగెను :- "ఇప్పటివఱకు మీరేమి చేయు చున్నారు ?"

గంధర్వు లిట్లనిరి :- "స్వామీ ! ఇప్పటివఱకు మమ్ముల నీ పాపత్ముఁడు తనబల వీర్యముచే బలవంతముగఁ దన యధీ నము కావించుకొన్నాఁడు. అనిచ్ఛా పూర్వకముగ నీతని గుణ

గానమొనర్చు చుంటిమి. ఈతని సమ్ముఖమున నృత్యము చేయు చుండెడు వారము. మాలో నేదైనఁ బొరపాటుజరిగెనా ఈతఁడు కాలితోఁదన్నెడు వాఁడు. నేఁ డాతఁడు కాళ్ళుజాపి వెల్లకిలఁ బడి పోయినాఁడు. పొట్టరెండు చీలికలైనది ప్రభూ ! ఎవరెట్లు చేయు దురో దాని నట్టనుభవింపఁజేయుట నీ విధానము.

ప్రక్కన నిలుచుండిన చారణులను "మీరును దైత్యుని అనుచరులా ?" అని అడిగెను."

ఇది వినఁగానే చారణులరక్త మెండిపోయెను. భయముచే గడగడ వణఁకసాగిరి. వారిట్లనిరి ;- "కాదుస్వామీ ! మేము భవభయహారములగు మీపాద పద్మములను గ్రహించితిమి. మీరీ దైత్యునిఁజంపి గొప్ప పుణ్యకార్యము నొనర్చితిరి నాథా ! సాధుజనుల హృదయములకు శూలమువలె నున్న యీ దైత్యుని మీ రంతము గావించితిరి. మే మీతని అనుయాయులము గాము. మేము మీకు దాసాను దాసులము."

వికృత వేషముగల యక్షులనుగాంచి భగవానుఁడిట్లనెను :- మీ రెవరురా ? అట్లు ముంగి ముఖములతో నిలుచుండినారు ?"

యక్షులు-ఈతని కోపమంతయును మనమీఁదకు విఱచుకొని పడదుగదా యని యనుకొని యిట్లనెను :- "స్వామీ ! మేము మీకు ప్రధాన దాసులము."

భగవానుఁడిట్లనెను :- "మీలో నేమి ప్రధానతకలదు ? మీరు చినిగిన మాసినగుడ్డలను గట్టుకొన్నారే. చేతిలోఁ బాలకీ దండమును బట్టుకొని యున్నారేమి ?"

యక్షులు వణఁకుచు నిట్లనిరి :- "కాదుస్వామీ ! మేము గొప్పగొప్ప మనోహర కర్మలొనర్చెదము. ఈ దుష్టుఁడు మమ్ములను బలవంతముగఁ బల్లకిమోయు పనిలో నియుక్తులుగాఁజేసినాఁడు. ఏమిచేయుదుము. వివశులమై చేయుచుంటిమి. కాకున్న మేము పృథివ్యాపస్తేజోవాయు రాకాశములు,పంచభూతములు, దశేంద్రియములు, పంచతన్మాత్రములు, మనోఽహంకారములు, మహత్తత్వము ప్రకృతి యను నీ చతుర్వింశతి తత్వములకు నియంతలము మేము. ఇరువదైదవ తత్వము పురాణ పురుషుఁడవగు నీవే. నీవీ దుష్టునిఁ జంపితివి-మాకేమి ఆజ్ఞాపించిన దానినిఁ జేయుదుము."

గంధర్వులేదో చెప్పఁదలఁచు నంతలో భగవానుఁడు కింపురుషుల వైపునకుఁజూచి యిట్లనెను :- "మీరెవరు ?"

వారుభయపడుచు నిట్లనిరి !- "ప్రభూ ! మేము కింపురుషులము."

రోషస్వరమున భగవంతుఁడిట్లనెను :- మీరేమి చేయుదురు."

ఇప్పుడేమి చెప్పఁగలము, శీఘ్రముగ నిట్లనిరి :- "స్వామి! మేము కవిత్వమును జెప్పెదము."

భగవానుఁడిట్లనెను :- "ఎట్టి కవిత్వమును జెప్పెదరు ?"

కింపురుషులు భయపడి వెంటనే తడబిడఁ బడుచు నిట్లనిరి :-

క. పురుషోత్తమ నేరము కిం
పురుషుల మల్పులము నిన్ను భూషింపఁగ దు
ష్పురుషున్ సకల సుజన హృ
త్పరుషం జంపితివి జగము బ్రదికె నధీశా.

శ్రీ మదాంధ్రభాగవతము.

ఇప్పుడు భగవానుఁడు కవిత్వమునుగూడ వినుచున్నాఁడు. ఈ పారితోషికము కింపురుషులకు లభించునేమోనని వైతాళి లిట్లనిరి :- "స్వామీ ! పెద్ద పెద్ద సభలందును, నెంతో వైభవముగ జరుగు యజ్ఞోత్సవములందును మేము సదా మీ యశోగానము నొనర్చుచుందుము. మే మచ్చట చాల దాన, దక్షిణలు, కానుకలు, పూజలు, పారితోషికములను బొందెదము. వానినన్నిటి నీ దుష్టుఁడు నష్ట భ్రష్టము కావించినాఁడు. ఇప్పుడీ దుష్టుఁడు మరణించినాఁడు. ఇప్పుడిఁక మాస్థానము మాకు లభింపఁగలదు. మరల కానుకలు, పారితోషికములు లభింపఁగలవు."

కిన్నరు లిట్లనుకొనిరి :- "ఇప్పుడా జీవికా ప్రశ్న యుదయించినది. ఇచ్చట నియమింపఁబడినవారు శాశ్వతులుగ నెన్నఁబడుదురు. సింహాసనము మీఁదఁ బ్రభువు విరాజమానుఁడై యున్నాఁడు. ఎవరికే యాజ్ఞ వచ్చునో వారికది లభించును. కావున వారు దీనతాస్వరమున నిట్లనిరి :- ప్రభూ ! మా మొఱలను గూడ వినవలయును. మేము మీకు ముఖ్యానుచరులము.

ఈదుష్టుఁడు మమ్ములను విష్టియందు అనఁగా ద్రవ్యమీయకయే వెట్టిచాకిరినిఁ జేయుటలో నియమించియున్నాఁడు. ఇంతవఱకు వివశులమై చేయుచుంటిమి. ఇఁక మా కట్టిదిలేకుండఁ జేయవల యును. ఈదుష్టుఁడు మరణించిన తరువాత నిప్పుడు మాకున్నతి కలుగుననిఆశించు చున్నాము."

నంద, సునంద, గరుడాది భగవత్పార్షదులు వచ్చిరి. అందఱును మాటి మాటికి దుష్ట, ఖల, నీచాదులని పిలుచు చుండిరి. ఇట్లనుట వీరి కసహ్యము. ఈ హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు వారివలెనే భగవంతుని పార్షదులగు జయ విజయులని హరిఁకిదెలియును. నేఁడు వీరు సనకాదుల శాపముచే నసుర యోనిలోనికి వచ్చిరి. వీరు వైకుంఠ నాథుఁడును, నత్యంత మనోహరుడగు చతుర్భుజుడగు భగవానుని దర్శించుచుండెడు వారు.ఆరూపమునకు వీరాద్యులు. నేఁడిట్టి వికరాళముఖమును, బెద్ద పెద్ద గడ్డములను, భయంకరాకృతినిఁగాంచి వారు భయపడు చుండిరి. భయపడుచు భయపడుచు నిట్లనిరి :- "ప్రభూ ! ఈ విచిత్రరూప దర్శనమును నేఁడు మేము మాజీవితములో మొట్టమొదటిసారిగా నిప్పుడే చూచున్నాము. మీరు మా ప్రభువు లని మాకు దెలియును; కాని మీరిట్టియద్భుతరూపమును ధరించి తిరి. వీరందఱునుమాటి మాటికి దుష్టుఁడు దుష్టుఁడని పలుకు చుండిరే, ఈతఁడు మీకాజ్ఞాకారియగు దౌవారిక దాసుఁడు. మీకుఁ బ్రియపార్షదుఁడు. విప్రకాశముచే నీతనికి యధమయోని

ప్రాప్తించునది. వీనినిఁజంపి మీరు వీనికి మేలే యొనర్చితిరి. మీ క్రోధమును వరదానతుల్యమే. ఈమా సహచరునిమీఁద మీ యొక్క అగాధమగు ననుకంపకలదు. ప్రభూ ! మమ్ము లను మఱవకుఁడు."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఈ విధముగ నందఱును గలిసి వివిధ విధముల నృసింహునిఁబ్రనన్ను నొనర్పఁదలఁ చిరి; కాని ఆతని ముద్రలో అణుమాత్రమైనను బరివర్తనము రాలేదు. ఆతఁడదేవిధముగఁ గ్రోధభరితములగు నెఱ్ఱని నేత్ర ముల నొనర్చుచు మాటిమాటికినిఁ గ్రోధముతోఁ బెదవులను గొఱకుచు సింహాసనము మీఁదఁ గూర్చుండెను. అందఱి మొఱ లను వినుచుండెను. గాని యెవరిని గొట్టుట లేదు. దీనివలన దేవతలకు కొంచెము సాహస మినుమడించెను. మెల్లఁగాఁ బాద ములకడకు జేరుకొనినచో మనమీఁదఁ గ్రోధమున్నదియు, లేని దియుఁ దెలియఁగలదనుకొనిరి. అందువలనఁ దమలోఁదాము దగ్గఱకు వెళ్ళుటకు గుస గుస లాడసాగిరి.

)o(

# ప్రహ్లాదుని మీఁద నృసింహుని అనుకంప

౪౯౦

శ్లో॥ స్వపాదమూలే పతితం తమర్భకమ్
విలోక్య దేవః కృపయా పరిప్లుతః।
ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్య దధాత్ కరాంబుజమ్
కాలాహి విత్రస్తధియాం కృతాభయమ్॥

(-శ్రీభాగ. ౭ స్కం. ౯ అ. ౫ శ్లో.)

.... శ్రీమదాంధ్ర భాగవతము.

వ. ........మహాభాగవత శేఖరుండయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మంద గమనంబున నమందవినయ వివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగ దండప్రణామంబు సేసిన భక్తపరాధీనుండగు నయ్యీశ్వరుండాలోకించి :-

ఉ. ప్రాభవమెప్ప నుత్కట కృపామతియై కలియంగఁ జీరిసంశోభిత దృష్టి సంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లోకాభినుతుండు పెట్టె నసురాంతకుఁడుద్భట కాల సర్ప భీతాభయ దానశస్తము ననర్గళ మంగళ హేతు హస్తమున్.

....శ్రీ మదాంధ్ర భాగవతము.

తన యిష్టదైవమును భక్తుఁడే బాగుగాఁ దెలిసికొనఁ గలఁడు. అనన్య ప్రేమచేతను, భక్తిచేతను ప్రకట మగుచో దాని యొక్క యథార్థరహస్యమును దెలిసికొనుటకష్టము.

తండ్రి యెంత కుపితుఁడైనను దండ్రియేగదా. సింహమందఱి యందును గ్రోధమును వహించును, కాని తన పిల్లను హృదయ ముతోఁ గౌఁగిలించుకొనును. సింహమును గాంచిన నందఱును భయపడుదురు. కాని సింహము పిల్ల దానినిఁజూచి యేమియును భయపడదు. పిల్లియెలుకలను నోటఁగఱచుకొని తీసికొనిపోవును. అదే విధముగఁ దన పిల్లలనుగూడ తీసి కొనిపోవునుఁ ఎలుగలు దానినోటఁబడగానే గిజగిజకొట్టుకొని, భయభీతినిఁజెంది గడ గడవణకును; కాని దానిపిల్లలకే చింతయు నుండదు: దుఃఖము లేదు; శోకములేదు, భయములేదు, కారణ మేమనఁగా, బిల్లల కది తమ తల్లియనియును, దానివలన నే హానియును గలుగ దనియును విశ్వాసము కలదు. దీనికి విపరీతముగ నెలుకలు అది తమకు ఘాత యొనర్చుననియు, నది తమ్ముఁజంపి తిని వేయు ననియు దృఢవిశ్వాసము కలదు. భావనయే బలవంత ముగ నుండును. "భావగ్రాహిజనార్దనః" జనార్దనుఁడు భావ మును గ్రహించును, "యద్భావంతద్భవతి"ఎట్టి భావముండునో అట్లే సిద్ధించును.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లు చెప్పు చున్నాడు :- "రాజా! దేవగణము సింహాసనస్థుఁడగు నృసింహు నకు దూరమున నిలు చుండియే స్తుతిని జేయు చుండిరి; కాని భయకారణమున నెవరునుముందునకుఁ బోవుటలేదు. దేవతలందఱును బ్రహ్మతో నిట్లనిరి :- "ప్రభూ ! మీరే అంద

అకు బెద్దలు. ముందుగా భగవానుని పాదపద్మములను స్పర్శించుడు."

ఇది విని బ్రహ్మ అందఱను గసరుచు నిట్లనెను:- "మీరు చాలానన్యాయ మొనర్చుచున్నారు. ఇట్టి సందర్భములలో యువకులు ముందుకుఁ బోవలయును."

బ్రహ్మయొక్క యీ మాటలను విని దేవతలు శివునితో నిట్లనిరి :- "మేమందఱమును సాధారణ దేవతలము. మీరు దేవాధి దేవతలగు మహాదేవులు, కావున మందగా మీరు ముందుకుఁ బొండు. మీరే ముందుగా నడువవలయును."

శివుఁడిట్లనెను :- "నేను ముందుకుఁ బోయిన బాధ యేమియును లేదు. మీకు నాస్వభావము తెలిసినదే. నా రూపము కద్ర రూపము. తమోగుణ ప్రధానమగుటచేఁ గ్రోధమునుకలిగి యుండుట నాపని. ఆతఁడును నిప్పుడు క్రోధముగనున్నాఁడు. నాకుఁ గ్రోధము వచ్చినచో నాకేమియును బాధలేదు గాని అందరును మీఁ మీద విఱుచుకొని పడఁగలడు."

ఇదివిని యింద్రుఁడిట్లనెను :- "లేదు, లేదు స్వామి! మీరు వెడలుట ఉచితముకాదు. బాగుగా నలంకారము చేసికొని వయ్యారముగనాడు నీ యప్సరసలను బంపుఁడు స్వామి! మూఁతులు త్రిప్పుదురు, కనుసన్న లొనర్పఁ గలరు. సదామదమత్తలై యుందురు. తమ ముందట నెవరిని లెక్కజేయరు. నేఁడు వీరి హావభావ కటాక్షపరీక్ష జరుగఁగలదు."

ఇది వినఁగనే అప్సరస లందఱును నిట్లనిరి :-
"దేవేంద్రా! ప్రభూ మీరు మమ్ముల నెచ్చటకుఁ బంపుచున్నారు?
లేకున్న మమ్ముల నగ్నిలోఁ బడవేయరాదా ? ఒక్కసారి
గోరును విసరెనా మాకు దుర్దశ కలుగఁగలదు. మేమోడితిమి.
ఇచ్చట మా సౌందర్యమాధుర్యములు పనిజేయఁజాలవు. మే
మేమిటి ? ఈ ప్రపంచములు సుందరాతి సుందర స్త్రీలును
నీభయంకరమూర్తియైన ప్రభువును ప్రసన్నము కావింపఁ
జాలరు.

సమీపముననే లక్ష్మీదేవి నిలుచుండి యుండెను. ఆమెకీ
వాక్యములు నచ్చలేదు. ఆమె అప్సరసలను గసిరి యిట్లనెను :-
"అప్సరసలారా! మీరు స్త్రీజాతి నవమానించుచున్నారు. పురుషుఁ
డెంత క్రోధముతో నైననుండనిండు. స్త్రీ ప్రేమభరిత దృక్కు
లతో స్నేహపూర్వకముగ నాతనివైపునకుఁ జూచినచో నాతని
క్రోధమంతయును గర్పూరమువలెఁ గఱగిపోవును. మీవారాంగ
నల విషయము వేఱు. ఏ సతీసాధ్వి తన పతియొక్క క్రోధ
మును శాంతింపఁ జేయఁజాలకున్నది ?"

అప్సరస లీమాటలను విని మెదలకుండిరి, వారికి వారి
పొరబాటునకు బశ్చాత్తాపము కలిగినది. ఈ విషయమున దేవ
తల కాధారము చిక్కెను. వారు చేతులను జోడించుకొని యిట్లు
నిరి:- "అమ్మా ! ఇప్పుడు నీ ద్వారానే భయము దూరము కావ
లయును. నీవే కోపగించిన ప్రభువును శాంతింపఁజేయ సమర్థు

రాలవు. నీవులేకున్న మాకు గతిలేనేలేదు. త్రాణనమున కుపాయములేదు."

లక్ష్మీదేవి గర్వముతో నిట్లనెను :- "మీరు భయపడుచుంటరేల ? చూడుఁడు. నేను భగవానునెదుటకుఁబోగానే ఆతఁడు నవ్వఁగలఁడు. నా దృష్టియును, భగవానుని దృష్టియును గలియఁగానే రెండు కన్నులు నాలుగుకన్నులుకాఁగానే ఆతఁడు క్రోధము చెందుదమన్నను జెందఁజాలఁడు."

వినయముతో దేవతలిట్లనిరి :- "అయితే అమ్మా ! మీరు దయ చేయుఁడు. ఆ యప్సరసలు ముసుఁగువైచికొని ముఖములు త్రిప్పుకొనిరి. లక్ష్మీదేవికి తలను దువ్విరి. నేత్రములకు గాటుకయును. బెదవులకు రంగును, నోట సువాసన ద్రవ్యములను వేసుకొని ఈ విధముగ షోడశ శృంగారములను గావించి, వస్త్రాభూషణాదులతో బాగుగ నలంకరించుకొని నూపుర, మంజీర కంకణధ్వనులతో ఝుంకార మొనర్చుచుఁ బ్రేమ భరిత నేత్రములతో నోరచూపులు చూచుచు, హంసనడకలతో మంద మందముగ మందహాస మొనర్చుచు ముందుకుఁబోయెను .అమె ముంతుకుఁబోఁగానే నృసింహ భగవానుఁడు కొంచెముగ నోటినిఁదెఱచి, గ్రుడ్ల నురిమి, లక్ష్మీదేవి వైపునకుఁబంజాను దెఱచి హుంకరించుచు నొక్కసారి గర్జించెను. గర్జింపు వినఁగానే లక్ష్మీదేవి భయముచే నదరిపోయెను. కన్నులు భ్రమ చెందెను. సైగలొనర్చుటను మఱచిపోయెను. ఎదుట గడగడ వణఁకసాగెను. తలలోఁ దురుముకొనిన పూలమాల జారిపడెను.

పైనున్న పైట జారిపోఁగా, ఆభరణములు రాలిపోఁగాఁ జారి పోవుచుండఁగా నామె కుటిలాలకములు విరియఁబడి యెగురు చుండెను. నీలాంబరము వాయువులో నెగురసాగెను. ఆమె యొక్క అంగప్రత్యంగములు సువర్ణసమానములుగఁ గనఁబడు చుండెను. కంఠమందలి మాలల స్తవ్యస్తములయ్యెను. అప్సరస లును భయపడిరి. వారి మధ్యలోనికి వచ్చి కమలాదేవి గడగడ వణఁక నారంభించెను.

అప్సరసలిట్లనిరి :- "ఏమైనదమ్మా తల్లి ! తల్లికేమైనఁ దెలిసి యుండిన చెప్పవచ్చును. ఆమె భయపడినది.వాక్కురుద్ధ మయ్యెను. ఆమె తడబడుచు నిట్లుపలికెను :- "అక్కలారా ! నేనింతటి భయంకర రూప మిదివఱకెన్నడును జూడలేదు. ఈతఁడు మావారేనా లేక యింకొకరా యని సందేహముగ నున్నది. నా ప్రాణనాథుఁడిట్లెన్నడును గర్జింపలేదు, ఇట్టి గర్జన మును నేనెన్నడునువినలేదు. నోట గుడ్డనుబెట్టుకొని ముఖమును ద్రిప్పుకొని నవ్వసాగిరి. వృద్ధుఁడగు ధాతకుఁగూడ లక్ష్మీదేవి స్థితినిఁగాంచఁగానే దయకలిగెను. అతడిట్లనుకొనెను :- "ముడి యెట్లుపడినదో అట్లే వీడిపోఁగలదు. ఈ ప్రభువు ప్రహ్లాదుని మీఁద గృపచేఁబ్రకటమైనాఁడు కావునఁ బ్రహ్లాదుఁడు కోరిన యెడలఁబ్రసన్నుఁడు కాఁగలఁడు." కావున నాతఁడు ప్రహ్లాదుని దగ్గఱకుఁబిలిచి యిట్లనెను :- "వత్సా ! ప్రహ్లాదా ! నీవుప్రభువు యొక్క పాదపద్మముల కడకుఁబోఁగలవా ?"

ప్రహ్లాదుఁడు దృఢతాస్వరమున నిట్లనెను :- "అవును స్వామీ ! నాకేమి భయము. మీ యాజ్ఞయైనచో నేనాతని పాదములను బట్టుకొనఁగలను. తండ్రినిఁగాంచినఁ బుత్రునకేమిభయము సింహము తన బిడ్డను ప్రేమించదా ?"

దేవతలానందమును బ్రకటించుచు నేకకంఠమున నిట్లనిరి :- "అవునవునయ్యా ! నీవు పొమ్ము. నీవు భగవానునిఁ బ్రసన్ను నొనర్పఁగలవు."

అందర యాజ్ఞను బొంది ప్రహ్లాదుఁడత్యంత సరళ భావముతో నడుమునకు వస్త్రమును బిగించి, భగవానుని సమీపమునకుఁబోయి సింహాసనమునఁ గూర్చుండిన నృసింహుని పాద పద్మములకుఁ బ్రణామ మొనరించెను. ప్రేమాశ్రువులచే నాతని పాదములను గడిగెను."

ప్రహ్లాదుఁడు తన పాదములమీఁదఁబడుటను గాంచి, ప్రేమతోఁ బరిపూర్ణ హృదయుఁడగు బ్రభువు. ఆతనిని దన కర కమలములతో లేవనెత్తి, గట్టిగాఁ గౌఁగిలించుకొని, ఆతని మస్తకమును మూర్కొని కాలవ్యాళముచే భయభీతులైన వారిని నిర్భయుల నొనర్చుటకు, తన కరకమలములను నాతని మనోహర మస్తకమున నుంచెను. వడిలోఁ బ్రేమపూర్వకముగఁ గూర్చుండ బెట్టుకొని ప్రేమించి లాలించెను. వాత్సల్య ప్రేమ యుప్పొంగుటచే నాతఁడు మాటిమాటికిని నాతని ముఖమును ముద్దుబెట్టి

కొచుచుండెను. ప్రహ్లాదుఁ డదేవిధముగ నానంద నిమగ్నుఁడై అమాయకముగ సరళశిశువు తన్నుఁ బ్రేమించు తండ్రి వడిలోఁ గూర్చుండినట్లు కూర్చుండెను.

భగవంతునియొక్క సుఖస్పర్శచే నాతని రోమరోమము ఆనందముచే నుప్పొంగెను. ఆతఁడొనర్చిన కర్మలన్నియును నశించెను. అతనికి భగవానుని వాస్తవిక స్వరూపము బాగుగాఁ దెలిసెను. ఆతఁడు కృతార్థుఁడయ్యెను. స్వరూప సాక్షాత్కార మగుటచే నాతనికి భూత, భవిష్యద్వర్తమానకాలములు తెలిసెను. హృదయ సాగరమునఁ బ్రేమప్రవాహము పెల్లుబికెను. స్నేహప్రేమలు తుఫానువలె వచ్చెను, నేత్రములనుండి ఆనందాశ్రుబిందువులు బొటబొట గారసాగెను. అతడు భగవంతుని మనోహరమూర్తి దర్శించి తృప్తి చెందుటలేదు. కనుఱెప్ప వేయక నిర్నిమేషభావముతో భగవంతుని వైపుచూచు చుండెను.

నారదుఁ డిట్లనెను :- రాజా ! కొంచెము ప్రేమ వేగము తగ్గగానే కొంచెము కొంచెముగ బాహ్యజ్ఞానముకలుగ సాగెను. అప్పుడు ప్రహ్లాదుఁడు గద్గదకంఠముతోఁ బ్రేమోద్రేకమున భగవానుని స్తుతింపసాగెను.

-() () ()-

# ప్రహ్లాదుఁడు నృసింహుని స్తుతించుట

౪౯౧

శ్లో॥ బ్రహ్మాదయః సురగణా మునయోఽథ సిద్ధాః ।
సత్త్వైకతానమతయో వచసాం ప్రవాహైః ॥
నారదితుంపురుగుణై రధునాపి పిప్రుః
కిం తోష్టు మర్హతి సమే హరిరుగ్రజాతే ॥

-(శ్రీ భాగ. ౭ స్కం. ౯ అ. ౮ శ్లో॥)

మ. అమరుల్ సిద్ధులుసంయమీశ్వరులుబ్రహ్మాదుల్ సతాత్పర్యచి
త్తములన్ నిన్ను బహుప్రకారములనిత్యంబున్ విచారించి పా
రము ముట్టన్ నుతిసేయ నోపరఁట నేరక్షస్తనూజుండ గ
ర్వముదోద్రిక్తుఁడ బాలుఁడన్ జడమతిన్ వర్ణింప శక్తుండనే.

- శ్రీ మదాంధ్రభాగవతము.

పరా, పశ్యతి, మధ్యమా, వైఖరులని వాక్కులు నాల్గు విధములు, సర్వసాధారణులమగు మనము వైఖరీవాక్కుతోడనే మాటలాడుదుము, వృత్తులంతర్ముఖమగు కొలఁది భగవత్కృపయు, నిష్టదేవతానుగ్రహమును ననుభవమునకు వచ్చును. వాక్కుయొక్క గతి సూక్ష్మమగు కొలఁది శ్రేష్ఠమైనదగును. శరీరమున నశుభ సంస్కారము లున్నంతవఱకు వాక్కుగూడ అశుభముగనే వెడలు చుండును, పాపములు నశించినకొలఁది వాక్కుకూడ విశుద్ధమగు చుండును. భగవంతుఁ డెవరిని

సంస్పర్శించినాఁడో, కృపతో భగవానుఁ డెవని మస్తకముపైఁ గృపాపరిపూర్ణమును, గాలసర్పముచే భయభీతులగు వారి కభయ మొసంగు తన వరదహస్తమునుంచినాడో అట్టివానిని అశుభములన్నియును నాక్షణమందే నశించిపోవును. అప్పుడాతని వాక్కు వేదవాక్యమువలె శుభమును గళ్యాణకారిణియునగును. ఆతని యుచ్చారణముతో నొనర్చిన స్తోత్రము పరమశక్తిశాలి యును. ప్రభుకృపాప్రాప్తికి సుఖదసాధన స్వరూపమును గాఁగలదు.

ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు నారదునితో నిట్లనెను :- "రాజా ! శ్రీహరి తనకు శరణాగతభక్తుఁడగు ప్రహ్లాదునిపైఁ గృపతో నాతని శిరస్సునఁ దన వరదహస్తము నుంచినాఁడో అప్పుడు ప్రహ్లాదుని సమస్తాశుభములు నశించిపోయెను, ఆతని ప్రజ్ఞ విశుద్ధమయ్యెను. ఆ విశుద్ధ వాక్కులతో నాతఁడా విశ్వేశ్వరుఁడగు నరహరిని స్తుతియొనరించెను.

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను :- "ఋషులారా ! ప్రహ్లాదుఁడు స్తుతించిన స్తోత్రములలోఁ బ్రతిశబ్దమును నమూల్యము. స్తుతియేమిటి. అది సరశాస్త్రముల సారము. జ్ఞానరూపమగు సముద్రమును మథించి ఆతఁడు స్తుతిరూపమగు నమృతము నుత్పాదింపఁజేసెను. అది భక్తిరూపమగు క్షీరముల పైనఁ దేలిన మధుర మనోహరమగు మీగడ, దానిలోనున్నది, ప్రహ్లాదుని వాక్కేకాదు, హృదయావేదన, సాధనప్రణాళిక.

సర్వప్రపంచమునఁ బ్రహ్లాదుఁడసురుఁడగుటచేఁ దన ధీన తను బ్రదర్శించెను. తరువాత భగవంతుని కడ నుచ్చనీచ భేదములు లేవను సిద్ధాంతమును దర్శింపఁజేసెను. అంత యిరు వైపులకుఁ దిరిగి వారు దుఃఖితులగుటను గాంచి ప్రభువుతో క్రోధపరిత్యాగ మొనర్పుఁడని ప్రార్థించెను.

ప్రహ్లాదుఁడీ విధముగఁబెద్ద పెద్ద జ్ఞానవిషయములను నిర్భయుఁడై పలుకఁగా భగవానుఁడు మిక్కిలి ప్రేమతో నిట్ల డిగెను ;, "వత్సా ! నీకు నాభయానకముఖమును, జప్పరించు జిహ్వను, బెద్ద జూలును గాంచిన భయమగుట లేదా ?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను ;- "ప్రభూ ! ఎచ్చటనైనఁ తల్లి దండ్రులను గాంచినఁ బుత్రుఁడు భయపడునా ? నేనిప్పుడే మీ నోటి లోనికి నాచేతిని బెట్టెదను." ఇట్లు పలికి ఆతఁడు భగ వానునియొక్క తీక్ష్ణమగు గోరులను లేత రావియాకులవలెఁ గోమలముగనున్న తన చిన్నచిన్న అరుణ కరకమలములతోఁ బట్టుకొనెను. నృసింహ భగవానుఁడిది చూచి నవ్వెను. దేవతల భయము దూరమయ్యెను. భగవంతుడు నవ్వినాఁడు. అంత బ్రహ్లాదుఁడు దాస్యభావమును గూర్చి మిక్కిలి ప్రశంసించి దాస్యభావమును గూర్చి తనకు బోధించి తన్ను దాసునిగాఁ జేసుకొనుమని ప్రార్థించెను. నీవే నాకు తల్లివి, దండ్రివి,బంధువు సర్వస్వమును. ఇదిగాక నింక నాతఁడు సంసార చక్రమును గూర్చి చెప్పుచు నిట్లనెను :- "స్వామీ ! నీ ప్రేరణము చేత

నీసంసార చక్రమెట్లు తిరుగుచున్నది? నీ కృప యెవరి మీఁద నుండునో వారే దీనినుండి బయటఁబడఁగలరు, కావున నాథా! నాపైఁగృపఁ జూపుఁడు. నన్నీ చక్రమునుండి బయటఁబడ వేయుఁడు. ప్రభూ! నీవు నన్నెట్లు కృపఁజూచితివో అట్లు నీ పుత్రుఁడగు బ్రహ్మను గాని, నీ గృహిణియగు లక్ష్మినిగాని నీయంశభూతములగు దేవతలపైఁగాని దయ చూపలేదు,"

మ॥ ఖర దంష్ట్రాభ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే
సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ
నరసింహాకృతిఁజూచి నే వెఱవఁబూర్ణక్రూర దుర్వారదు
ర్భర సంసార దవాగ్నికిన్ వెఱుతు నీ పాదాశ్రయు జేయవే

\- శ్రీ మదాంధ్ర భాగవతము.

అంతఁబ్రహ్లాదుఁడు వివిధ విధములోగ భగవానుని స్తుతించెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా! నేనా స్తుతివర్ణన మును నీ కథా ప్రసంగమునఁ జేయనసమర్థుఁడను. అవసరము లభించినపుడు దివ్యస్తోత్ర వర్ణనమును వేఱుగా స్తోత్రప్రకరణ మునఁ జేసెదను."

శౌనకుఁడిది విని యిట్లనెను :- "సూతా! ప్రహ్లాదుని విషయములో మేమొకదానికంటె వేఱొకటిఆశ్చర్యప్రదము లగు విషయములను వినుచున్నాము. మహాభాగా! ఆ స్తోత్ర మునువిని భగవంతుడేమనెనో మాకు చెప్పవలయును."

అంత సూతుఁడిట్లనెను :- "మహాభాగా ! ప్రహ్లాదుని స్తుతినివిని నృసింహుఁడాతని హృదయముతో గట్టిగాఁగౌఁగిలించుకొని ప్రేమించెను, ఆతనిని ముద్దుపెట్టుకొని యిట్లనెను :- "వత్సా ! ప్రహ్లాదా ! నేను నీ సరళతకును, నిష్కపటతకును, నేక నిష్ఠకును నహైతుక భక్తికిని నత్యంత ప్రసన్నుఁడనైతిని. నికిష్టము వచ్చిన వరమును (గోరుకొనుము. నన్నుఁ బ్రసన్ను నొనర్చి వరమును గోరుకొనుటకు సంకోచింపవలదు. ఎవరి హృదయములో భక్తిలేదో, ఎవరు తానే కర్తయని యనుకొందురో, ఎవరీ సాంసారిక పదార్థములను సర్వశ్రేష్ఠముగ నెంచెదరో అట్టి వారికి సంకోచము కలుగుచుండును. ఆయుష్మాన్! భక్తిద్వారా నన్నుఁ బ్రసన్నుఁజేసిన వారికెన్నటికిని తరుగుండదు. అట్టివాఁడెన్నడైన నేవస్తువు విషయములోనైనను నాదాన ప్రదాన విషయములో లోభసంకోచము లుండవు. నా దర్శనము కానంతవఱకే వస్తువుల యభావజన్య క్లేశము ప్రాణులకుఁగలుగు చుండును. నా దర్శనమైన తరువాత నింక నాకు ఫలానికోరిక నెఱవేరలేదనునది యుండదు. భగవద్భక్తులగు సాధుజనులు సమస్తమును ద్యజించి నా ప్రసన్నతకొఱకు సతత ప్రయత్నమేల జేయుచుందురురనఁగా బ్రసన్నతలోనే సమస్త సిద్ధులును కలవుసన్నిహితములైయున్నవి. నీవు నన్ను భక్తిభావముచేఁ బ్రసన్నునిఁగావింకొంటివి. కావున నీకేమి కావలయునో వరములను గోరుకొనుము."

సూతుఁడిట్లనెను: "మునులారా! బాలకుఁడగు ప్రహ్లాదునకిది యెంతో గొప్ప ప్రలోభనము. ఈ విషయములను దుచ్ఛముగ భావింపని వానిని, ఇంద్రియములను జయించిన వానిని భగవంతుఁడు ప్రసన్నుడై వరమునుగోరుకొమ్మనగా నాతఁడవశ్యము జారిపోవును, ప్రలోభపడును. కాని ప్రహ్లాదుఁడు సేవాసంయుమములద్వారా తన సమస్తేంద్రియములను సంయమము కావించియుండెను. ఆతని దృష్టిలో నీ సాంసారిక పదార్థము లతితుచ్ఛములు. గర్హనీయములు. అందు వలన నీతనికింతటి ప్రలోభము లొసంగినను నాతనిమనస్సులో నణుమాత్రమైనను వికారముత్పన్నము కాలేదు. ఆతఁడల్లే వష్కాముఁడయ్యెను.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:-"రాజా! ఈవిధముగఁ బ్రభువుప్రసన్నుఁడై మాటిమాటికినిఁ బ్రహ్లాదుని వరములడుగమని బలవంత మొనర్చగాఁ బ్రహ్లాదుడు కొంచెము సేపు, మౌనముగనుండి, దీనినిగూర్చి గంభీరముగ విచారించి; భక్తియోగమార్గపధికునకు సాంసారిక భోగములు కావలయు నని యడుగుట విఘ్నకారకములని నిశ్చయించుకొని, అతఁడు నవ్వుచు భగవానునితో నేదోమాటలాడుట కుద్యుక్తుఁడయ్యెను.

)o(

# ప్రహ్లాదుని విచిత్ర వరదానము

౪౯__౨

శ్లో॥ యది రాసీశమే కామాన్ వరాంస్త్వం వరదర్షభ!
కామానాం హృద్యసంరోహం భవతస్తు వృణేవరమ్॥
శ్రీభాగ, ౭స ౧౦,౧౦౯,౮ శ్లో॥

వ........దేవా వరదుండ వయ్యేదవేని(గామ(బులు వృద్ధిబొందని వరంబు కృపసేయుము. కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమాన విభవుండగు నరసింహ పరమాత్మ పురుషోత్తమ యని ప్రణవపూర్వకంబుగా నమస్కరించెను.

....శ్రీమదాంధ్రభాగవతము.

భగవత్కృపాను భవమును బెందిన వారీసాంసారిక భోగములలో నేలబడెదరు? ఈ సాంసారిక భోగములు పరిణామమున దుఃఖదములు. సుఖస్వరూపు(డగు శ్రీహరిని( బ్రసన్నుని(గావించుకొని అతని విషయసుఖముల నడుగుట కల్పవృక్షము క్రిందకు(బోయి ఒక గుప్పెడు సెనగలనో, ఉండుటకొాక పూరిగుడిశెనో ఆడిగినట్లుండును. చక్రవర్తిని( బ్రసన్నునొనర్చుకొని వరితౌడడుగుకొని నట్లుండును. మోక్షపతియగు ప్రభువు సమీపమునకు(బోయియు బంధన మొనరించు వస్తువుల నడుగుట బంధనముకాక మరేమిటి?.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా! భగవానుఁడు మాటిమాటికి ప్రహ్లాదుని వరమడుగుమని బలవంత మొనర్పఁగా బ్రహ్లాదుఁడు ప్రేమరోషమున నిట్లనెను:- ప్రభూ! నాపైఁగృపఁజేయుడు. ప్రమత్తున కధిక సురాపానము నొసంగకుఁడు అంధుని బదభ్రష్టునిఁగావింపకుఁడు. పడినవాని నింకను బడవేయకుఁడు పుండుమీఁద శస్త్రమును నడుపకుఁడు. అకలిగొన్న వానికి వ్యంజనముల నాశగొల్పకుడు. కాముకున కధికాధిక కామ సామగ్రినీయకుఁడు. నేను స్వాభావికముగ భోగాసక్తుఁడను. పైగా మీరు నన్ను వరాములచే లోభపెట్టు చున్నారు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను:-"నశ్వరములగు- న్యూన ములగు భోగములవలన దుఃఖములు కలుగును. నీవు యథేష్టములగు భోగములఁను బర్యాప్తముగఁ గోరుకొనుము, సాంసారిక భోగములుకాదు. దివ్యములును, జిరస్థాయియగు స్వర్గభోగముల నడుగుము. అక్షయలోకముల నడుగుము."

ప్రహ్లాదుఁడిట్లనెను:-"ప్రభూ! భూలోకము మొదలు బ్రహ్మ లోకము వఱకుగల ప్రార్థివ, దివ్యలోకములన్నియును నశ్వ రములే, కొన్ని కొలది కాలమునకును. గొన్ని అధిక కాలము నకును నశించితీరును. ఇవన్నియును నంతవంతములు. ఇవన్ని యును క్షయిష్ణువులు. మరల మరల జనన మరణ చక్రమందు

బడవేయునవి. అశాశ్వతములు, బంధనకారణములు. నేనీ బంధనములనుండి బయటపడుటకే శరణుజొచ్చితిని. భోగములయొక్క భోగములచే భయభీతుఁడనైతిని."

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను:- "నాయనా! నేను నీకహితమును గోరుటలేదు. ఇంతవఱకును నిన్ను నీతండ్రి చాల కష్టములను బెట్టినాఁడు. ఇప్పుడిఁక నీవు సుఖపూర్వకముగనుండవలయుననియే వరములను గోరుకొనుమనుచున్నాను."

శీఘ్రముగఁ బ్రహ్లాదుఁ డిట్లనెను :- "కాదు స్వామీ ! ఇది నాయభిప్రాయముకాదు. మీరు నాకహితమొనర్చుటకై విషయసుఖముల నొసంగుటలేదు. అట్లనినఁబతితుఁడనగుదును. మీరు నన్నుఁ పరీక్షించుచున్నారు. అందులకనియే సంసారమును వృద్ధినిఁబొందించు విషయములవైపునకుఁ బ్రేరేపించుచున్నారు. వీనికి విషయముల మీఁద నెంతటి ప్రేమకలదో మీరు కనుఁగొనఁదలఁచుచున్నారు. కావున నోజగద్గురూ! నేను విషయాసక్తుఁడనే. ఆ విషయములయొక్క దుస్సహ దుఃఖములకు భయపడి మిమ్మాశ్రయించితిని. మీరు నన్ను విషయములలోఁ బడవైచుటకు వరములీయఁదలఁచుటలేదు. మీరట్లేలఁజేయుదురు. కేవలము పరీక్షార్థ మడుగుచున్నారు? ప్రభూ! నా ప్రయత్నముచే నేను బరీక్షలో నుత్తీర్ణుఁడనుగాలేదు. మీరే కృపచేయవలెను. మీరు త్తీర్ణు నొనర్పదలంచుచోనుత్తీర్ణుఁడనగుదును."

భగవానుఁడిట్లనెను:- "ప్రేమయందు కృతజ్ఞతా ప్రకాశన మవసరమగును, ప్రేమికుఁడు తాను బ్రేమించిన వారికుపహార మును బంపును, ఇది వ్యవహారవిషయము. నీవు నాకు భక్తు డివి కావున నేనను నీకు వరమీయవలసియున్నది."

ప్రహ్లాదుఁడు నవ్వి యిట్లనెను:- "ప్రభూ! చేయకుండిన వృత్తి లేదనునది పరమార్థమునలేదు కేవలము స్వామిని తన కోరికల కొఱకే సేవించువాఁడు వాస్తవిక సేవకుఁడు కాఁడు సేవకునిచేఁ గేవలము తన పనినిఁజేయించుకొని వానికిబదులుగా యత్కించిత్తుగ ధన వస్త్రాదుల నొసంగుచుఁ బ్రేమింపక పోయినను దనవాఁడుగ భావింపకున్నను నాస్వామి సరియైన స్వామికాడు సాంసారిక వస్తువులకట్టి మహత్వములేదు. నిర పేక్షమైన ప్రేమయును, నిష్కామభావముతోఁ జేయఁబడిన సేవ యును నిజమైన సేవయగుచున్నది. ప్రభూ ? నేను మీ భక్తి విషయ భోగములకొఱకై చేయలేదు. మీరును దీనికి బదులుగా విషయములకు సంబంధించిన వరములనొసంగి భక్తి మహత్వ మును తగ్గించవలదు. నేనుమీకు నిష్కామ భక్తుడను. మీరు నాకు నిజమగుఁబ్రభువు. కావున మీరునన్ను స్వీకరించుఁడు. ఈ సాంసారిక వరముల లోభమందుఁబడ వేయకుఁడు."

ప్రహ్లాదుని యిట్టి యుక్తియుక్తములగు వాక్యములను వినిభగవానుడిట్లనెను:-"నాయనా! ఈ యాదాన ప్రదానములు ప్రేమ లక్షణము. నిర్ధనుఁడగు తండ్రి తనపుత్రికనెట్టి ధనికున కిచ్చి వివాహమొనర్చినను వస్త్రాదుల నొసంగును. మిత్రుఁడును

మిత్రులకొసంగును. ఇచ్చునపుడు వస్తువులయొక్క మహాత్త్వము లేదు. ప్రేమ నిరాకారమగు వస్తువు. ఈవస్తువులతో బాటుగా వారు ప్రేమదానము నొసంగుదురు. ఇచ్చుటయనునది ప్రేమ యొక్క అభివ్యక్తి. ప్రేమను ప్రకటించు సాధనము. ఇచ్చి పుచ్చుకొనుటలోఁ బరస్పరము ప్రేమవృద్ధినిఁ బొందును. కావున నన్ను నీవేదైననడుగుము, దాని నొసంగుటలో నాకా నందము లభింపఁగలదు."

ఇది విని ప్రహ్లాదుఁడిట్లనెను:- "వరదాతలలో శ్రేష్ఠుఁడ వైన నో స్వామీ! మీరు బలవంతమొనర్చినచో, మీరు నాకు తప్పక వరమీయవలయునని తలఁచుచో నేను మిమ్ముల నొక్కవరమును గోరెదను. దానిని మీరొసంగెదరా?"

భగవాఁడు ప్రేమతో నిట్లనెను:-"వత్సా! నాకీయరానివస్తు వేమికలదు. నీవడుగఁదలచినదేదో నిస్సంకోచముగనడుగుము.

అంత ప్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రభూ! మీరీయఁదలఁచి నచో నాకీవరము నొసంగుఁడు. నా మనస్సులో నేవిధమగు గోరికయుఁబుట్టఁగూడదు. విషయభోగేచ్ఛ నాయంతఃకరణ మందంకురింపరాదు."

ఇది విని భగవానుఁడు నవ్వి మిక్కిలి ప్రేమతో నిట్లనెను:- "ఓయీవత్సా! ఇది యేమి వరము? కోరికలకు నీనింతగా భయపడెదవేల!"

ప్రహ్లాదుఁ డిట్లనెను:- ప్రభూ! హత్యలకు మూలమీ కోరికలే. మానవుల హృదయములోఁ గోరికలుత్పన్నమయ్యెనా

సమస్తేంద్రియములును జంచలములుగును. మనస్సువిక్షేపమును
జెందిదానినే నిరంతరము చింతించుచుండును. బుద్ధికి సద
సన్నిర్ణయము నొనరించు శక్తికుంఠితమగును. ప్రాణములగతి
ద్రుతమగును. దేహమందలి రోమరోమమునకును నదే వాసన
నిండిపోవును. ధర్మవిచారముండదు. ధైర్యము నశించును.
లోకాభిమానమునకు దిలాంజలి నొసంగి తనకోరికలు నెఱవేర్చు
కొనుటకై నిరంతరము ప్రయత్నమొనరించును. అతని శ్రీ,
సమృద్ధి, ప్రభావాదులు న్యూనత జెందును, తేజము క్షీణమగును.
స్మృతి విభ్రమము కల్గును. సత్యాసత్యములను విచారింపక
నేవిధముగనైన సరియే తన కోరికను నెఱవేర్చుకొనఁజూచు
చుండును. కావునఁ ప్రభూ! ఆత్మ పతనమగుటకుఁగామమునకు
మించిన వస్తువీప్రపంచమునలేదు. విషయ భోగములనుభ
వించుటయే జీవికకు జీవత్వమని భావించును. ఏ సమయ
మున జీవుని కోరికలన్నియును నశించునో అప్పుడాతఁడు శివ
స్వరూపుఁడగును. కావున నశరణా శరణా ! జగద్గురూ । పర
మేశా! పరమాత్మా నృహరీ ! విష్ణు! నామనస్సులో విషయ
వాసనలు రాకుండునటుల వరమొసంగుఁడు."

ప్రహ్లాదుని యిట్టి నిష్కపట. ఛలఛిద్రరహిత నిష్కామ
వచనములను విని భగవానుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యిట్లు
నెను:- "వత్సా! ప్రహ్లాదా! నీవంటి నిష్కామ అనన్యభక్తుఁడు
పృధివీభోగములనుగాని, స్వర్గీయభోగములనుగాని కోరకున్నను
నేనేదో వారికుపయోగపడవలయును గావున వారికిఁగోరిక

లేకున్నను గొంతకాల మైశ్వర్యము నొసంగెదను. కావున నీమన్వంతరమంతయును నీవసురులకు జక్రవర్తివైనా వివిధ భోగములననుభవింపుము. రాజసింహాసనమునఁ గూర్చుండుము. వివాహమును జేసికొనుము. పిల్లలను గనుము."

ప్రహ్లాదుఁడిట్లనెను:- "స్వామీ! ఇట్టివర మొసంగితిరేమి? ఈ పిల్లల జల్లల మాయలో నన్నుఁబడవేయకుఁడు. స్వామీ! ఇది నాకొఱకే కాదు, సమస్తప్రాణులకును శ్రేయస్కరమగు సర్వోత్తమ కార్యమని తలఁచుచున్నాను. ఆత్మపతనమునకు హేతుభూతమగు నీగృహ, దారా, పుత్రాదులతోఁగూడిన గృహస్థాశ్రమ రూపమగు నంధకారమునఁబడక, దానినుండి బయటపడి, యేకాంతముగవనమునకుఁబోయి సర్వాత్మభావముతో మీయుపాసనమును జెయవలయును. ఈ భార్యాపిల్లల గోలలో నన్నుఁబడవేయవలదు. అచ్చట భార్య యెట్లాడించిన నట్లాడవలసియుండును. నేఁడిది తీసికొనిరా, అది తీసికొనిరా యనుచుండును. దీనితోడనే కాలముగడచిపోవును. నిన్ను మఱవఁగలను."

భగవానుఁడిట్లనెను :- "కాదు నాయనా ! మఱవవలసిన పనియేమున్నది? విషయసుఖమునేసర్వోత్తమముగ భావించువారు మఱవఁగలరు. తానే కర్తననుకొని విషయములను బ్రోవుచేయుటలో సంలగ్నుఁడగును. నీవు గృహస్థాశ్రమమును నాసేవగా భావింపవలయును. ఇది భగవదాజ్ఞ యనుకొని, కర్తవ్యబుద్ధిచే

సర్వమును జేయుచున్నాననుకొనవలయును. సాంసారిక కార్యముల నొనర్చుచు నొక్కవిషయమును మఱవఁగూడదు. సమస్త భూతములందును సమానముగ నుండు యజ్ఞేశ్వరుఁడగు నన్ను సర్వదా హృదయమందు ధరించి, సదా అవ్యగ్రభావముచే నా యొక్క సుమధుర కథల నవశ్యము వినుచుండవలయును. నన్ను మనస్సునందుంచుకొని నా కథల నవగ్రభావముతో వ్యవధాన రహితముగ నిత్యమును వినుచుండవలయును. అట్టి వానికి సంసార బాధ యుండదు. కావున నా కథలను వినుటను మఱవరాదు. ఏ రోజున నీవు కృష్ణకథలకు వంచితుఁడవయ్యెదవో ఆదినమును వ్యర్థముగ భావింపవలయును. నీవు నిత్యనియమముతో నా కథలను వినుచు సర్వకర్మలను నాకర్పణమొనర్చుచు భక్తియోగము ద్వారా నన్నారాధించుచుండినచో నీవు గృహస్థాశ్రమమున నున్నను నీకు బంధనము కలుగదు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- ప్రభూ ! సమస్త విధముల మీ యాజ్ఞను శిరసావహింపవలసినదే; కాని కర్మ నెట్లొనర్చినను దానికి శుభాశుభములు గలిగి తీరును. కర్మయే బంధనమునకుఁ కారణము. నేనీ సంసారబంధనమునుండి ముక్తుఁడనుగాఁగోరుచున్నాను. అట్టి యెడ మీరు నన్నుఁ గర్మలలోఁబడవేయ గోరుచున్నావు.

భగవానుఁడిట్లనెను :- "నా ప్రాప్తికై యొనర్చిన కర్మములు బంధన కారణములుకావు. ఇంకను బుణ్యపాపరూపమగు ప్రారబ్ధము నీకున్నది. ప్రారబ్ధములేక యీ శరీరము నిలువదు.

పుణ్య శేషమును సుఖభోగములచే క్షయింపజేసికొనుము. యజ్ఞాదులొనర్చుటచేఁ బాపము క్షయించును. నీ పాప పుణ్యములు రెండునుక్షయింపఁగా జివరకు నీవు నన్నుఁ బొందఁగలవు. నీ యనన్యభక్తిగాథ త్రిలోకములందును వ్యాప్తము కాఁగలదు.నీవు ముక్తుఁడవయ్యెదవు. నా యొక్కయు నీ యొక్కయు కథలను విన్నను, జెప్పినను నీవు చేసిన స్తోత్రములను పఠనమొనర్చినచోఁగర్మబంధములనుండి ముక్తులు కాఁగలరు. నాయనా ! నీవు నన్ను వరమడుగలేదు. నీవు నన్ను వరమడిగి యుండినచో నాడు సంతోషమయ్యెడిది."

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:- "రాజా! భగవానుఁడు మాటిమాటికి వరమడుగుమని యడుగఁగాఁ బ్రహ్లాదుఁడాలోచనలోఁబడి, ఆలోచించి ఆలోచించి భగవానుని వరమడుగుటకుద్యుక్తుఁడయ్యెను.

)o(

# ద్వేషియగుఁదండ్రి యెడలను బ్రేమ ప్రదర్శనము

౪౯-౩

శ్లో॥ వరం వరయ ఏతత్తే వరదేశాన్మహేశ్వర
యదనిందత్పితా మేత్వామవిద్వాంస్తేజ ఐశ్వరమ్॥

తస్మాత్పితా మే పూయేత దురన్తా ద్దుస్తరాద ఘాత్।
పూతస్తేఽపాంగ సందృష్ట స్తదా కృపణవత్సల ॥
(శ్రీభాగ, ౭ స్కం ౧౦ అ. ౫౧-౫౭ శ్లో.)

సీ॥ దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు
నీవు చంపుటఁజేసి నిగ్రహమున
మాతండ్రి రోషనిర్మగ్నుఁడై
సర్వలోకేశ్వరుఁబరము నిన్నెఱుఁగలేక
పరిపంథి వగిది నీభక్తుండనగు నాకు
నపకారములు సేసె నతఁడునేఁడు
నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ
గావునఁబాపసంఘంబు వలనఁ

తే॥ బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర,
వరము వేఁడెద నాకిమ్ము వనజ నేత్ర
భక్త సంఘాతముఖపద్మ పద్మమిత్ర,
భక్త కల్మష వల్లికా పటుల విత్ర॥

....శ్రీమదాంధ్ర భాగవతము.

హృదయహీనులగు కృతఘ్నులను దీసివేయుఁడు. సాధారణముగ నందఱును దనను ప్రేమించువారి నందఱును ప్రేమించెదరు. దొంగలును, దోపిడిగాండ్రును, హంతకులును ప్రేమకలిగియుందురు; కాని వైష్ణవులు తమ్ము ద్వేషించువారినిఁ గూడ ప్రేమించెదరు. దుఃఖమును బొందినవాఁడు తనకొసంగిన

దుఃఖమును గూర్చి చింతింపఁడు, తనకు దుఃఖమును బెట్టిన వానిని గూర్చి చింతించును, వారిట్లను కొందురు :- "ఈతఁడు పొరపాటున భ్రమవశమున బాధను బెట్టుచున్నాఁడు. దీనివలన నీతఁడనవసరముగ నరకయాతనల ననుభవింపవలసి వచ్చును; కావున నాతఁడు భగవానుని దీనుఁడై యిట్లు ప్రార్థించెను :- ప్రభూ ! ఈతనికి మేలే చేయుము. ఈతఁడు దుర్గతినిఁబొంద రాదు." భగవద్భక్తులయొక్కయు మహాత్ముల యొక్కయు ననేకోదాహరణములు కలవు. ఒకా నొక కృషికుఁడు జొన్న కంకులను గోసికొనఁగా నొక సాధువును గొట్టెను. ఆ సాధువు రాజునకు గురువు. ఇది రాజునకుఁదెలియఁగానే ఆ కృషికునిఁ బట్టి తెప్పించి మహాత్మ నిట్లడిగెను :- "ఈదుష్టునకే దండనము నొసంగవలయును."

మహాత్ముఁడిట్లనెను :- "మేమాకలిచే నే పొలములో జొన్న కంకులను గోసికొంటిమో ఆ పొలమునకు శాశ్వత ముగఁబన్ను లేకుండ జేయవలయును." రాజట్లే యొనరించెను. దీనివలన సాధు సంగము ఏ భావనచేఁజేసినను, నెట్లు చేసినను గల్యాణకారియే కాఁగలదు. సాధుసంబంధము సమస్త దశ లందును సదా సర్వదా సుఖప్రదముగను గల్యాణ కారిగనే యుండును.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! భగ వానుఁడు ప్రహ్లాదునితో మాటి మాటికిని వరమును గోరుకొమ్మ

నగాఁ బ్రహ్లాదుఁడు కొంచెముగ నాలోచించి యిట్లనెను:- స్వామీ! నేనొక వరమడిగెదను ఇచ్చెదరా?"

భగవానుఁడిట్లనెను ;- "నీ వేమి మాటలు మాటలాడు చున్నావు ? భక్తులకు నేనీయరానిదేదియును లేదు. నీ యిష్టము వచ్చినది కోరుము."

అప్పుడు ప్రహ్లాదుఁడిట్లనెను!- "మంచిది, మీరు వరమిచ్చె దనని బలవంత మొనర్చుచో, నేను కోరినవర మీయఁ దలచిన చోఁ మా తండ్రి పవిత్రుడగునట్లు వర మొసంగుఁడు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "నీతండ్రి కేమైనది?"

ప్రహ్లాదుఁడిట్లనెను :- "స్వామీ ఏమియును గాలేదు; కాని ఆతఁడు చాలాపాపము నొనర్చినాఁడు సదా సర్వదా మిమ్ము లను ద్వేషించినాఁడు. నిన్ననరాని మాటలనినాడు. మీ యీశ్వ రతేజము నెఱుగకపోవుటచే విష్ణువు నాసోదరుని జంపినాఁడు కావున నాతఁడు నాశత్రువను మిథ్యాదృష్టినిఁ బెట్టుకొను చుండె డువాడు. మిమ్ములను ప్రతిపక్షిగా భావించి మీకు ద్రోహ మొనర్చినాఁడు. మీ భక్తుఁడనగు నాకుఁగూడ ద్రోహమొనర్చి నాఁడు. మీరు ద్రోహినైననుఁ క్షమించెదరుగాని మీ భక్త ద్రోహిని క్షమింపరు. ఈ దోషమును మీ రత్యంత దురంతర ముగను దుస్తరముగను భావించితిరి. దీనబంధూ ! భక్త వత్సలా ! మీరీతని దోషము నుండి, నిర్ముక్తుల నొనరింపవలసి నదని నేను మీపాదములంటి ప్రార్థించుచున్నాను. ఇఁక నీతఁడు పాపియై నరకాగ్నియందు బచనము కారాదు. అదియును గాక

మరణ సమయమున నిన్ను దర్శించిన వారును, నీ కృపా దృష్టినిఁ బొందినవారును బాపరహితులగుదురు. మీ రీతనిఁ గృపఁ జూడవలయునని నేను దీనముగఁ బ్రార్థించుచున్నాను. ఈతనిని మీరు పావనునిఁగావింప వలయును."

ప్రహ్లాదుని యీ దివ్యవచనములను విని భగవానుఁ డత్యంత ప్రసన్నుఁడై నవ్వుచు నిట్లనెను :- "ఓయీ ! వత్సా ! నీవు పిచ్చి వాఁడవువలె నున్నావే ! ఓయీ నా ముద్దులయ్యా ! నీవంటి భగద్భక్తునిఁబుత్రునిగాఁ గనినవాఁడు పాపిగా నెట్లుండఁ గలఁడు ? నిష్పాపా ! నీఁతండ్రి విషయమేమి ? నీవంటి పుత్రుఁడే వంశమునఁ బుట్టినాడో వానికి వెనుక నేడు తరములును, ముందేడు తరములును, తల్లివంశముతోని వారేడు తరములు తన భక్తి ప్రభావముచేఁ దరించెదరు. కావున నీతండ్రి పావనమగుటయే కాదు, నీ వంశములో నిరువదొక్క తరము వారు పావనులైరి. వీనితో నేనును దరించితిని. మీతండ్రి హిరణ్యకశిపుఁడు, ఆతని తండ్రి కశ్యపుఁడు. కశ్యపుని తండ్రి మరీచి, మరీచి తండ్రి లోకపితామహుఁడగు బ్రహ్మ, బ్రహ్మకు తండ్రిని నేను కావున నేను వీనినేమి పావనము చేయఁగలను. వీని సంబంధముచే నేనే స్వయముగఁ బావనుఁడ నైతిని. నా భక్తులెచ్చట పుట్టెదరో ఆ స్థానము పరమపావనమగు దీర్థ మగును. ఇది నాభక్తుల మహాత్మ్యము."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రభూ : మీ భక్తులు పుణ్యక్షేత్రములలో నివసించుచుందురు పవిత్ర వంశములందే వారు పుట్టు

చుందురు. వారు పవిత్రులుగ నుందురు. ఇంక వారికి పవిత్రత యేమున్నది ?

భగవానుఁడిట్లనెను :- "అట్లుకాదు. నా భక్తులు పావన క్షేత్రములందుడవలయుననని యేమియును లేదు. అంగ, వంగ, కళింగాది కిరాట దేశములందుత్పన్నమైనను, నీచవంశ ములందుత్పన్నమైనను, భక్తుఁడే దేశమందుఁ బుట్టిన నది పవిత్రమైనదే. అతఁడే కులమునఁ బుట్టునో ఆ కులము పూజనీయ మగును, నాభక్తులు సమదర్శులుగ నుందురు. వారును నేవలె నన్నేమియును గోరరు. వారు మనస్సుతోనైన నెవ్వరికిని ననిష్ట మును గోరరు. ఇతరు లెవరికిని బాధలను గలిగింపరు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రభూ ! నే నధమ అసుర కుల మునఁ బుట్టితిని, నాతండ్రి సదా నిన్ను ద్వేషించు చుండెడు వాఁడు నాకు నీ చరణములందు దృఢానురక్తి లేదు. కావున నో శరణాగతవత్సలా ! దీనబంధూ ! నేనును మీ భక్తులలో నొక తుచ్ఛ సేవకుఁడుగ నెన్నఁబడు నట్లాశీర్వదింపుఁడు దాసుఁడ నగుటకు నాకధికారము లేదు, సౌభాగ్యమును లేదు. నేను నీదాసాను దాసుఁడను గావలెను,"

ఇది విని నృసింహుఁడు నవ్వి యిట్లనెను :- "నాయనా ! నీవు భక్తానుచరుఁడవు కావలెననుకొనుచున్నావు. నిన్ను మించిన భక్తుఁడింకొకఁ డీ ప్రపంచమున లేఁడని నేను చెప్పుచున్నాను. నీవు నా భక్తులందఱిలో నాదర్శస్వరూపుఁడవు. నీవు భక్తుఁడ వగుటలో సందేహమేమియును లేదు. ప్రపంచములో నిన్నను

సరించు వారు త్రైలోక్య వందనీయులగు నాభక్తులగుదురు. నీ విప్పుడు నీ తండ్రి విషయమై యేవిధమగు సందేహమును జెంద రాదు. ఈతని కధోగతి కలుగదు. నాయంగస్పర్శచే నీతఁడు పావనులలోఁ బావనుఁడై నాఁడు. అయినను లోకమర్యాద రక్షణ కొఱకు నీ వీతని కౌర్ధ్వ దైహిక కర్మల నొనరింపుము."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "ప్రభూ ! నేను మీ యాజ్ఞననుస రించి మా తండ్రికి పారలౌకిక క్రియల నన్నిటినిఁ జేసెదను. కాని యీ దైత్య సింహాసనమున నింకెవరినైనఁ గూర్చుండ బెట్టుఁడు. నాకింకను ముగ్గురన్నలున్నారు. వారిలో నీకిష్టమైన వారిని రాజుగా నొనర్పుఁడు. నే నిప్పుడు సర్వాత్మ భావముచే మీసేవ చేయఁదలఁచుచున్నాను."

భగవానుఁ డిట్లనెను ;- "నాయనా ! అసుర సింహాస నమునఁ గూర్చుండుటకు సమస్త విధముల యోగ్యుఁడవు నీవే. నేను నిన్నే యాజ్ఞాపించుచున్నాను. నీ కోరికవలనఁగాదు. నా యాజ్ఞను మన్నించి నీవు నీతండ్రి పదమునఁ గూర్చుండుము. నీ వేపని నొనర్చినను వేదవిదులగు మునుల నడిగి చేయు చుండుము. వేదజ్ఞులగు బ్రాహ్మణుల యాజ్ఞల నెన్నటికినిఁ బొరపాటుననైన నుల్లంఘింపకుము. ఈ విధముగ నొనర్చుచో నీరాజ్యము నీకు బంధనము కాఁబోదు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "రాజ కార్యములలోఁ బడినచో మీ భజనము జరుగదే ?"

భగవానుఁడు ప్రేమతో నిట్లనెను ;- "భజనమనిన నేది. నా యాజ్ఞలను బాలించుటయే భజనము. నీవు సమస్త కార్యములను గర్తవ్య బుద్ధితోఁ జేయవలయును. చిత్తము నెల్లప్పుడును నాయందే యుంచుటయును, నా పరిచర్యయందే అనురక్తుడవై యుండుటను, ఇవి చేసినచో నీకు రాజ్యముగాని గృహస్థాశ్రమముగాని యేమియును జేయదు."

ప్రహ్లాదుఁ డిట్లనెను ;- "స్వామీ ! మీ యాజ్ఞ వేద వాక్యము. నాకు రాజమదము, ధనమదము మొదలైనవి. రాకుండునట్లు చేయుఁడు. నా మనస్సున కజ్ఞాన వశమున నహంకారాది దోషములు వచ్చిన శీఘ్రముగ హరించుము. వాని పేరు నా హృదయమునఁ బాతుకొనరాదు."

భగవానుఁ డిట్లనెను ;- ప్రహ్లాదా ! నా భక్తులకు మద మత్సరములుండవు. ఒకవేళ నేకారణముచేనైన వచ్చినచో వాని నతి శీఘ్రముగ వ్రేళ్ళతోఁ బెల్లగించివైచెదను. నాసుదర్శన చక్రము నిన్నెల్లప్పుడును రక్షింపఁగలదు. నీ విపత్తుల నన్నిటిని నివారింపఁగలదు.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను;- "రాజా ! భగవదాజ్ఞనుబొంది ప్రహ్లాదుఁడు శాస్త్రీయ విధిచేఁ దన తండ్రియొక్క ఔర్ధ్వదైహిక క్రియ లన్నిటి నొనర్చెను.

....o....

# ప్రహ్లాదుని రాజ్యాభిషేకము - నృసింహుని తిరోభావము

౪౯-౪

శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్ రాజం స్తత్రైవాంతర్దధే హరిః।
అదృశ్యః సర్వభూతానాం పూజితః పరమేష్ఠి నా॥
తతః కావ్యాదిభిః సార్ధం మునిభిః కమలాసనః .
దైత్యానాం దానవానాం చ ప్రహ్లాద మకరోత్పతిమ్॥

\- శ్రీ భాగ. ౭ స్కం. ౧౦ అ. ౩౧, ౩౩ శ్లో.

వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాది దేవతా సమూహంబుచేఁబూజితుండై భగవంతుడైన శ్రీనృసింహ దేవుండుతిరోహితుండయ్యె ప్రహ్లాదుఁడును శూలికిఁబ్రణమిల్లి, తమ్మి చూలికివందనంబులు సేసిప్రజాపతులకుమ్రొక్కి-భగవత్కళలైనదేవతలకునమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాదిమునీంద్ర సహితుండై దైత్యదానవరాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టె."

\- శ్రీమదాంధ్ర భాగవతము

భగవంతుడు నిత్యుఁడు. ఆతఁడెన్నడును జన్మింపఁడు, శరీర త్యాగమును గావింపఁడు. మత్స్య, కూర్మ, వరాహ, నృసింహాద్యవతారములు నిత్యములు, శాశ్వతములు. వేలువేలు ద్వీపములందును, వర్షములందును నివి యెల్లప్పుడుండును. అచ్చట నుండువారు వారిని శాస్త్రీయ విధిచేఁబూజించుచుందురు. హిరణ్యకశిపునకు ముందు నృసింహుఁడు లేడనుటగాని, ఆతని

పూజ లేకపోవుటగానిలేదు. నృసింహుఁడప్పుడు నట్లే కలఁడు. ఇప్పుడు నట్లేకలఁడు. హిరణ్యకశిపుని సభలోఁ బ్రహ్లాదుని కొఱకై ప్రకటమైనవాఁడట్లే ప్రకటమయ్యెను. అయినను లౌకిక వ్యవహార దృష్టిచే భగవంతునియొక్క యీ నైమిత్తికఅవతార మేయుద్దేశ్యమున వచ్చినదో అనిమిత్తము తీరిపోగానే తక్షణము తిరోహితమగును. కేవలము భక్తిరక్షణార్థమే నృసింహావ తారము వచ్చినది. భక్తలక్షణముతో నాయవతారప్రయోజనము తీరిపోయినది. వాస్తవమున భగవానునకుఁగార్యమును లేదు, దానికి సమాప్తియును లేదు.

ధర్మరాజుతో నారదుఁడిట్లనెను :- "రాజా ! భగవదా జ్ఞచే బ్రహ్లాదుఁడు తన తండ్రికి ఔర్ధ్వదైహిక క్రియలు పూర్తి కావించిన తరువాత, భగవదాజ్ఞచేతనే బ్రహ్లాదునకు విద్యుక్త ముగ రాజ్యాభిషేకమును గావించెను.

హిరణ్యకశిపుని ఔర్ధ్వదైహిక క్రియలకుఁ బూర్వము రాజ్య సింహాసనము రిక్తముగ నుండరాదని సామాన్యరీతిగ రాజ్యాభిషేకము మొనర్చి సింహాసనాధికారి యీతఁడేనని ప్రక టించిరి. అప్పుడాతని కగ్ని సంస్కార మొనర్పఁబడెను. అప్పుడు శుక్రాచార్యులను బిలిపించిరి. ఈతఁడే దైత్యదానవు లకుఁ గులపురోహితుఁడు. ఇతర ఋషులును, మునులును బిలి పింపఁబడిరి. అందఱును భగవంతుని సమ్ముఖమున విధి విధా

నము ననుసరించి ప్రహ్లాదునిరాజుగా నొనర్చి, శ్వేత ఛత్రమును బట్టిరి. అటునిటుఁ జామరములు వీవఁబడుచుండెను. రాజ్య సింహాసనమునఁ గూర్చుండినఁ ప్రహ్లాదుఁడత్యంత సుశోభితుఁ డయ్యెను. భగవానుడాతనికి శిక్షణనొసంగుచు నిట్లనెను :- "వత్సా ! నిరంతరము నా భక్తినిఁ జేయుచు నిష్కామ భావముతోఁ గర్తవ్య భావముతో సమస్త కార్యము లొనర్ప వలయును."

భగవానుఁడు నవ్వుచున్నాఁడనియు, నసురుని యపర కర్మల పూర్తితోఁ బాటుగా నాతని క్రోధమును సమాప్త మైన దనియుఁ, ప్రసన్నతచే నాతని శ్రీ ముఖమత్యంత సౌమ్యమైనదియు, రోషచిహ్నములు లేవనియుఁ దెలిసికొనఁగానే బ్రహ్మకు సాహసము కలిగి శ్రీహరికి మిక్కిలి దగ్గఱకు వచ్చి స్తుతింప సాగెను.

బ్రహ్మయిట్లనెను :- "దేవాదిదేవా ! ఈ యధముఁడగు నసురుని యమసదనమునకుఁబంపితివి. వీని గర్వమును మంటఁ గలిపితివి. వీఁడు చేసిన పాపముల ననుభవించినాఁడు. ఇది చాల ఆనందింపఁదగిన విషయము, ఈ దుష్టుఁడు సమస్త లోకములను సంతప్తము కావించినాఁడు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "వీడింత బలవంతుఁ డెట్లైనాఁడు."

బ్రహ్మ యిట్లనెను :- "స్వామీ ! ఏమి చెప్పుదును ? ఈతఁడు గొప్ప తపస్సుచేసినాఁడు. ఈతని తపస్సుఁచే బ్రసన్ను డనై నేనీతని కిట్టి దుర్లభవరముల నీయవలసి వచ్చినది. దానచే నీతఁడు మదోన్మత్తుఁడయ్యెను, నేను సృష్టించిన నేప్రాణి చేతను జావకుండునట్లు వీఁడు నన్ను వరము కోరినాఁడు. ఈ కారణమునను. దన తపఃకర్మాది కౌశలమునను, శారీరక బలముచేతను, సమస్త దేవతలను జయించినాఁడు. సమస్త లోకపాలకులను సేవకులుగా నొనర్చినాఁడు. సమస్త వేదవిధు లను నుచ్ఛేదము కావించినాఁడు. తన కొడుకునకు గూడ మిక్కిలి దుఃఖమును గలిగించినాఁడు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఇట్టి సమయమున బ్రహ్మ ! నేను ధర్మసంకటమునఁ బడుచుందును. నీవాలో చింపక అడిగిన వరముల నొసంగుచుందువు. ఆపైన నీ క్రూర కర్ములగు నసురులు ప్రజాపీడన మొనర్చుచుందురు. నేనింక దేనినైనను సహింపఁగలను గాని భక్తులకొనర్చిన యన్యా యమును సహించు సామర్థ్యము నాకులేదు. అందువలన నేను గలగలుపు నవతారము నరసింహ రూపమున రావలసి వచ్చినది."

బ్రహ్మ యిట్లనెను :- ప్రభూ ! మీరు సర్వేశ్వరులు, నా వరములను రక్షించుచు దైత్యునిఁజంపి, మీ పరమభక్తుఁడగు బ్రహ్లాదుని దుఃఖములనుండి యుద్ధరించితిరి. ఇది చాల యానం దింపఁ దగినది. ఈ ప్రహ్లాదుఁడును సర్వభావములచేఁ మిమ్ము

శరణుఁ జొచ్చినాఁడు. ఇప్పుడు ప్రభూ ! వీనిమీఁదఁ గృపఁ జూపుఁడు. వీని కభయ ప్రదానము గావింపుఁడు. మీ దర్శనమే సమస్తఅమంగళ భయములను నివారించును. మీరు మీయనన్యాశ్రిత భక్తుని రక్షించితిరి, నా మర్యాదనుగూడ నిలిపి, నన్న సత్య మొనర్చకుంటిరి."

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- బ్రహ్మ ! నీ వరములే పేడబెల్ల మొనర్చినవి. అవియే యీయసురునింతటి యున్మత్తుని గను, నుచ్ఛృంఖలునిగను నొనర్చినవి. ఇఁకముందు జ్ఞాపక ముంచుకొనుము. నీవు పొరపాటుననైన నిట్టి యసంభవ వరముల నొసంగుకుము. మంచివాఁడును, జ్ఞానియు, ధ్యానియు, భక్తుఁడును, దపస్వియు, సదాచారియునగువానికి వరములొసంగినచో శోభించును. ఇట్టి దుష్టులకిట్టి కఠినవరము లొసంగుట తన పాదములను దాను గొడ్డలితో నరుకుకొనినట్లే, ఇంటిలోఁ బాలుపోసి పామును బెంచినట్లే కాఁగలదు.

బ్రహ్మయిట్లనెను :- "మంచిది స్వామీ ! ఇప్పటికైన దేమో ఆయినది. ఇఁకముందు జ్ఞాపకముంచుకొందును." ఇట్లు పలికి బ్రహ్మ భగవానుని విధ్యుక్తముగఁ బూజించెను.

ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు నారదునితో నిట్లనెను :- "రాజా ! బ్రహ్మ పూజింపఁగనే నరహరి అందఱును జూచు చుండఁగా నచ్చటనే అంతర్ధాన మయ్యెను. ఇప్పుడెవరికిని ఆతని మనోహరమూర్తి కనఁబడుటలేదు. భగవానుఁ డంతర్ధాన

మైనతరువాత రాజ్యాభిషిక్తుఁడగు ప్రహ్లాదుఁడు సభలోనున్న దేవతల నందఱను యథాయోగ్యముగ బూజించెను. అందఱి నాదరించి, అందఱను గృపాదృష్టితోఁ జూడవలయునని వారి నందఱను ప్రార్థించెను.

దేవతలును, మునులును, అచ్చటికివచ్చిన సభాసదులను సాధువులను ప్రహ్లాదు నాశీర్వదించి; ఆతనికి మంగళము గలుగుగాక యని యాశించుచు. నాతనిచే సత్కృతులై అందఱును వారి వారి నెలవులకుఁబోయిరి.

అంత నారదుఁడిట్లనెను:- "రాజా! నీవు నన్ను హిరణ్యకశిపుని వృత్తాంతము నడిగితివి. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు భగవానుని పార్షదులగు జయవిజయులని నే నిదివఱకే నీకుఁ జెప్పియుంటిని. సనకాది మహర్షుల శాపముచేఁ గశ్యపవీర్యమున దితిగర్భమున వీరుద్భవించిరి. వీరు భగవంతునిఁదమ వైరిగా భావించి నిరంతర మాతనినే చింతించుచుండిరి. మూఁడు జన్మలతో వారు శాపవిముక్తులు కాఁగలరను వరము కలదు. కావున వీరే మరణించి రావణ కుంభకర్ణులైరి. వారిని రామావతారమెత్తి భగవంతుఁడు చంపినాడు. తదనంతరము వారిద్దరే శిశుపాల దంతవక్త్రులై శ్రీకృష్ణునిచే జంపఁబడిరి.

రాజా! సాయుజ్య ముక్తిని గాంచి ఆశ్చర్యమును జెందుచుంటిరే ఈ సభలోఁ జంపఁబడిన శిశుపాలుఁడెవరోకాదు భగవానుని పార్షదుఁడే. మూఁడవజన్మమున వీనికిప్పుడు ముక్తి లభించినది. ఇప్పుడు నేను బ్రహ్మణ్యదేవుఁడును భర

మాత్మయు నగు శ్రీకృష్ణుని పరమపావన నృసింహావతార కథను జెప్పితిని. దీనిలో నాది దైత్యుఁడగు హిరణ్యకశిపుని వధాప్రసంగమును గలదు. హిరణ్యాక్షుని కథను నేను వరాహావతార ప్రసంగమున నీకు జెప్పితిని.

హిరణ్యకశిపుని వధా వృత్తాంతమును విని శౌనకుఁడిట్లనెను:- సూతా! నీవు భగవానుని యద్భుత కథను జెప్పితివి, శిశుపాలుని మూఁడు జన్మములను గూర్చియుఁ జెప్పితిని. కాని మాకొక సందేహము బాధించుచున్నది. నీవుదానికి సమాధానము చెప్పవలెను."

సూతుఁడిట్లనెను:- "స్వామీ: అడుగుఁడు. నేను యథామతిగా దానికి బ్రత్యుత్తర మొసంగెదను."

శౌనకుఁడిట్లనెను:- "మహాభాగా! బ్రహ్లాదుని గూర్చి నేను వినిన చరిత్రనాకు చాల యాశ్చర్యమును కలిగించినది. బాల్యకాలమునుండియే భగవద్గుణములందనురక్తియును, ఆసురీ భావములందు విరక్తియును- బఠన పాఠనములందును బ్రభు పాదపద్మములందును నాసక్తియు నిది సాధారణ పుణ్యఫలము కాదు. తండ్రి ఆతని నెంతో బాధపెట్టగా వానినుండి రక్షింపఁ బడుట ఆశ్చర్యకరమగు విషయముకాదు. ఏలననఁగా భగవంతుని రక్షకునిఁగాఁగల వాని నెవరు జంపఁజాలరు; కాని నాకాశ్చర్యమును గలిగించు నదేమనఁగాఁ దండ్రి ఆతని కిన్ని కష్టములు కలిగించినను నాతఁడు తండ్రి యెడల ద్వేషమును

వహించక ప్రేమించుచున్నాఁడే! ఆతనికి మొదట నున్న భక్తియే కలదే! ఇంతేకాదు. చచ్చిన తరువాత భగవంతుని నాతఁడు తన తండ్రికి సద్గతిని గలిగింపుఁడని ప్రార్థించెను. మహాభాగా! ఇట్టి విషయమును మే మెన్నడును జూడను లేదు వినను లేదు. ఇంతటి ధైర్యమును, సహనశీలత్వమును నేకారణమునఁ బ్రహ్లాదున కబ్బినవి?"

అంత సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఇది ఒక్క జన్మమున లభించిన పుణ్యముకాదు. ఇంతటి సహనశీలతయు, నిట్టి మహాగుణములును ననేక జన్మములలోని కఠిన సాధనముల చేతఁగానిరావు."

అంత శౌనకుఁడిట్లనెను:- సూతా! నీవు శిశుపాలుని పూర్వజన్మకథను జెప్పితివి, ఇప్పుడు ప్రహ్లాదుని పూర్వజన్మ వృత్తాంతమును జెప్పవలయును. ఆతని కిట్టి సహనశక్తి యెట్లు లభించినది? తన్ను ద్వేషించిన తండ్రియెడల నింతటిభక్తి నెట్లు ప్రదర్శింపఁగలిగినాఁడు. దీనిని వినుటకు మా మనస్సునందు మిక్కిలి కుతూహలము జనించుచున్నది."

అంతసూతుఁడిట్లనెను:- "మంచిది. మునులారా! ఇప్పుడు నేను ప్రహ్లాదునియొక్క పూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను దీనిని మీరు శ్రద్ధగా వినవలయును."



# ప్రహ్లాదుని పూర్వజన్మ వృత్తాంతము

౪౬౫

శ్లో. సవై మహాభాగవతో మహాత్మా
మహానుభావో మహతాం మహిష్ఠః
ప్రవృద్ధ భక్త్యాహ్యనుభావితాశయే
నివేశ్య వైకుంఠమిమం విహాస్యతి॥

శ్రీభాగ. ౩ స్కం. ౧౪ అ, ౪౭ శ్లో....

ఉ. ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల
క్ష్మీమహిళాధినాథుఁ దులసీదళధాముఁ బరేశు నాత్మహృ
త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం
ధా మదిలో హసించు హరిదాస్యవిహార వినిశ్చితాత్ముఁడై॥

శ్రీమదాంధ్ర భాగవతము....

జీవునకు నిష్ఠలేనంతవఱకు ఆతని హృదయమందు ఆస్తికత్వము, ధృఢత్వము, స్థిరత్వము కర్తవ్యమందు తత్పరతయు, సహనశీలతయు నుండదు నిష్ఠసంబంధముచే నేర్పడును అందఱకంటె నధిక సంబంధము తల్లిదండ్రులతోనుండును. వారీశరీరము నొసంగిరి. వీరికంటె నెక్కుడు సంబంధము గురుదేవునిది. ఆతఁడజ్ఞాన నాశముకావించి జ్ఞానజ్యోతినొసంగినాఁడు అందుకనియే మనశాస్త్రకారులు మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవయనిరి. మాతపిత్రాచార్యులను దేవతలుగా

భావించిన వారికెన్నటికిని దుర్గతి కలుగదు. ఇంటిలోఁ దల్లి దండ్రులుండఁగా దీర్ఘయాత్రలొనర్చుట వ్యర్థము. ఇంటిలో జంగమతీర్థములుండఁగా స్థావరతీర్థముల కొఱకు భ్రమింప నేల? తల్లిదండ్రులకుమించిన తీర్థము ప్రపంచములోనేదికలదు?

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను మీకు మహాభాగవతుఁడగు ప్రహ్లాదుని పూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను. దానిని మీరు దత్తచిత్తులరై శ్రవణమొనర్పుఁడు!"

ప్రాచీన కాలమున సముద్రముచేఁ జుట్టుకొనఁబడిన ద్వారకయనునొక పరమపావనమగు పురముకలదు. దానిని గంధర్వులు నాశన మొనర్పఁగా మరల ద్వాపరాంతమందు భగవానుఁడుదానిని మరల నిర్మించెను. ఇది అతిప్రాచీన నగరము. దీనియందు పూర్వకాలమున వేదవేదాంగ పారగులును, బరమ ధార్మికుఁడునునగు శివవర్మయను నొక పరమ తపస్వియగు బ్రాహ్మణుఁడుండెను. ఆతని కైదుగురు పుత్రులు. అందఱకంటెఁ బెద్దవాఁడు యజ్ఞశర్మ, రెండవవానిపేరు వేదశర్మ, మూఁడవవాని పేరు ధర్మశర్మ, నాల్గవవానిపేరు విష్ణుశర్మ, అయిదవవానిపేరు సోమశర్మ. వారందఱును. ధర్మాత్ములును, మాతాపితృభక్తులును పిత్రాజ్ఞ పరిపాలన మొనర్చువారై యుండిరి. వీఱందఱకును నిష్టదైవము తండ్రియే. తండ్రిని మించిన దేవత లేఁడని వీరు భావించుచుందురు. పితృసేవ మొనర్చుచు వారు సిద్ధులైరి. అందఱకును మానసిక సిద్ధి లభించెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ఇది త్రేతాయుగము నాటి విషయము. ఆదినములలో నందఱును సాధారణముగ సదాచారులుగను, నియమసంయమములు కలవారుగను శాంతముగను దాంతులుగను నుండెడువారు. దేవతలు ప్రత్యక్షముగఁ బృథివి మీఁదకు వచ్చి పోవుచుండెడువారు. తపఃప్రభావముచే మానవుఁడు జీవితముననే స్వర్గమునకు వెళ్ళుచుండెడువాఁడు, ఇచ్ఛాను సారముగ తిరిగి వచ్చెడువారు. దశరథ మహారాజు, ఖట్వాంగ మహారాజు మొదలగుననేక రాజపుంగవులు దైత్యులతో యుద్ధమొనర్చుటకై దేవతల పక్షమున వెడలిరి. చాల మంది పృథివియందలి రాజు లింద్రాసనమునఁ గూర్చుండి స్వర్గమును బరిపాలించిరి. తపఃప్రభావముచే నా దినములలో బ్రాహ్మణులకు వరమొసంగుటకును, శాపమును బెట్టుటకును శక్తియుండెడిది. ఎవరిమీదనైనఁ బ్రసన్నులైనచో వరముల నొసంగెడువారు. క్రోధము కలిగినచో శాపమునిచ్చెడివారు. నేఁటి కలియుగ మానవులు వీనిని నమ్మరు. ఏలననఁగా నిప్పుడు జనులలో శ్రద్ధా, సంయమ, సదాచార, సాధుత్వములు లేవు. ఇంద్రియజయము కలిగి, కామినీకాంచనముల జాడలకుఁ బోకున్నచో నేమికావలయుననిన దానినిఁ జేయవచ్చును. తపోనిరతులగు సాధువులకుఁ బరీక్ష కామిని కాంచనములు వారి మనస్సులలోనికి రాకుండుటయే, అందువలనఁ దపస్సు నుగ్రముగఁ జేయువారికడకు దేవేంద్రుఁడు స్వర్గములోని యప్సరసలను బంపుచుండెడువాఁడు.

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! ఈ స్వర్గములోని యప్సరస లున్నారా ? లేక ఆకాశపుష్పములవలెఁ బేరునకేనా? కలియుగములో వారు కనఁబడరే. పూర్వము కొంచె మెవరైనఁ దపస్సును జేసిరా వెంటనే యింద్రుఁడప్సరసలను బంపెడు వాఁడు నేఁడింతమంది తపస్సును జేయుచున్నారు. ఒక్కరి దగ్గ ఱకైనను నప్సరసలురారే. ఎందువలన ?"

ఇది విని సూతుడు గంభీరుఁడై యిట్లనెను ;- "స్వామి! వేదపురాణములలోఁ జెప్పఁబడిన వన్నియును సత్యములే. వానిని విశ్వసింపకపోవుట మనశ్రద్ధావిశ్వాసములలోఁగల లోపమే. వేదశాస్త్రములనుండి పునర్జన్మము, పరలోకములను గుఱించిన విషయములను దీసివైచినచో వానిలో మిగులున వేమున్నవి? క్రిందను బైనను అనేక లోకములు కలవు. వానిలో దేవాసుర, గుహ్యక, రాక్షస, యక్ష, గంధర్వ, కిన్నర, కింపు రుష, భూత, భేతాళాద్యనేక విధములగు ప్రాణులు నివసించు చున్నవి. దేవతలున్నారు, స్వర్గమున్నది, దాని కధిపతియగు నింద్రుఁడున్నాఁడు. అప్సరసలున్నారు ఇవన్నియును బుణ్యము చేతను, దపస్సుచేతను ప్రాప్తించును. కలియుగములో నింతటి పుణ్యమెచ్చట నున్నది ? పూర్వము మాటిమాటికిని గోదా నము, సువర్ణదానము. భూదానమును జరుగు చుండెడివి. ఒక్కొక్కఁడు లక్షల కొలది గోవులను దాన మొనర్చెడు వాఁడు. ఇప్పుడు లక్షగోవులు కనఁబడనే కనఁబడవు. పూర్వము లక్షలకొలఁది వత్సరములేమియును దినకయే తపస్సును

జేసెడువారు. అప్పుడింద్రాసన మూగుచుండెడిది. అప్పుడింద్రుఁడప్సరసలను బంపవలయు నను కొనుచుండెడువాఁడు. ఒక్క రోజున నన్నములేకున్న మన ప్రాణములల్లడతల్లడము కాఁగలవుఁ పూర్వులీ కామినీ కాంచనములను దుచ్ఛముగ భావించి, వీనివైపునకుఁజూడక తపమును జేయుచుండెడువారు. ఈ మర్త్యలోకములోని లలనలమీఁద విసుగు జనించినపుడు స్వర్గములోని యప్సరసలు వచ్చెడువారు. కలియుగ తపస్వులీ మానవ రూపములను గాంచియే జారిపోవుచుందురు. కొంచెము చాకచక్యము సౌందర్యమున్నచో వానినిఁగాంచి చంచలులగుచుందురు. అట్టివారి కడ కింద్రుఁడప్సరసల నేలఁబంపును ? సహజముగఁ జెంప దెబ్బకే చచ్చువారల కస్త్రము లెంపులకు ? కలియుగమందు కామనీ కాంచన లోభము సిద్ధినిఁ బ్రాప్తింపఁజేయును. వీనిలో నాకర్షణ పునాది కాలమునుండియును గలదు. కృతయుగమునను గొందఱు మోహితులగుచుండిరి; కానీ యెవరెంత గొప్ప సామర్థ్యముండెడిదో, ఎవరికెంతగాఁ ద్యాగ వైరాగ్యములుండెడివో వారికట్టి గొప్ప వస్తువు ప్రాప్తించుచుండెడిది. కలియుగ జీవుల హృదయములందు కామినీ కాంచన లోభము నిండియున్నది. పైకి జపతపములును, పూజాపాఠములును, బరోపకారములును, జేయుచుందురు. ఈ శుభకర్మలవలన లోకు లాకర్షింపఁబడెదరు. స్త్రీపురుషులు వారికడకువచ్చుచుఁబోవుచుందురు. కొంచె మనురాగాకర్షణముండినచో గోవిందాయనమో నమః అయినట్లే, కావున మునులారా! మీకు రాముడు

మేలుచేయుఁ గాక ! అందులను గలియుగమున జపతపము లను మఱచెదరుఁ హృదయ ధనమును వీడి సాంసారిక ధన మును సంగ్రహింపఁ దలఁచెదరుఁ రాముని మఱచి రమలను మఱగెదరుఁ ఇట్టి స్థితిలో నప్పరస లేల రావలెను ? అందు కనియే కలియుగములోని కొంగ భక్తులకు భగవద్దర్శన ముండదు. ఇట్టి సందేహముచే నొకానొకదినమున నారదుఁడు భగవానుని ప్రశ్నించెను.

ఇది విని శౌనకుఁడిట్లడిగెను :- సూతా ! నారదుఁడు భగవంతునేమని ప్రశ్నించెను. భగవానుఁడాతని కేమి జవాబిచ్చి నాఁడు. దయయుంచి మాకా కథను జెప్పవలయును."

శౌనకుని మాటలను విని సూతుఁడిట్లనెను :- "ముని లారా ఈ సంవాదమును నేను మీకుఁజెప్పెదను. మీరు దత్త చిత్తులరై శ్రవణమొనర్పుఁడు."

ఒక దినమున నారదుఁడు వైకుంఠనాథుని సమీపము నకుఁబోయి, ప్రణామమును గావించి, చేతులు జోడించుకొని యిట్లనెను :- "స్వామీ ! మీరు కలియుగ జీవులయెడల నింత కఠోరమును బూనితిరేల ?"

భగవానుఁడాశ్చర్యముతో నిట్లనెను:- "ఏమేమి నారదా! ఏమైనది ?" నారదుఁడు విషయమును నొక్కిచెప్పుచు నిట్ల నెను :- "స్వామీ ! అయినదేమున్నది ? ఇతర యుగములలో మీరు స్మరణ మాత్రముననే వచ్చుచుండెడివారు. కలియుగము లోని వారింతగా భజన మొనర్చుచున్నారే, ఇంతగాఁ బిలుచు

చున్నారే, మీరు దర్శనమీయరేల ? మీ భక్తులు మీకొఱకై సదా వ్యాకులత చెందినారే."

భగవానుఁడనన్యమనస్క భావముతో నిట్లనెను:- నారదా! నన్నెవరు పిలుచుచున్నారు ? నన్ను హృదయముతోఁ బిలుచుచుండిన నేను నిలువఁజాలను."

నారదుఁడాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను :- "స్వామీ ! మీరెట్టి మాటలు మాటలాడుచున్నారు. నేను భారతవర్షమునకు నిత్యమును బోవుచున్నాను. అచ్చట నేను భక్తులను జూచితిని. ప్రేమమగ్నులై చాలగ విలపించుచుందురు. ఎక్కువగఁ బాడుచుందురు. చాలమంది కీర్తన చేయుచుఁ జేయుచు మూర్ఛితులగుచుందురు. చాలగ దానములు చేయుచుందురు. చాలమంది తపమొనరించుచుందురు. చాలమంది అఖండకీర్తన మొనరించుచుందురు. ఉదయమున స్నానమునకు వచ్చి మిమ్ముబిలుచుచుందురు; కేకలువేయుచుందురు: కాని యెవ్వరికేకను వినవేమి ? బధిరునివలె నుందురేమి ?"

భగవానుఁడు విసుగుతో నిట్లనెను :- నారదా ! నన్నెవ్వరు పిలుచుచున్నారయ్యా ? మనస్సులోఁ గామము, కాంచనమును నింపుకొని పైకి నన్నుఁ బిలుచుచున్నారు దినమంతయును బాపమును జేసి దానిని గప్పిపుచ్చుటకై భక్తుఁగుడటకుఁ బెద్ద పెద్ద పంగనామములను బెట్టుకొని, మాలను జేతికిఁదీసికొని పెదవులను గదలించుచుందురు. నోట రామనామము,

చంకను నిటికలు ఇట్టి వారే కలియుగ బక భక్తులు; దాన మొసంగిన పేరుకొఱకే, దినమంతయును పాపము నొనర్చి సంపాదించెదరు. దీన దుఃఖితుల రక్తమును శోషింపఁ జేయుదురు. ఆపాపపు ద్రవ్యముచేఁ బ్రతిష్ఠను సంపాదింప దానమొనర్చెదరు. వారేది గోరెదరో దానినే యిచ్చెదను. వారు నాదర్శన సుఖమును గోరరు. చర్మమును జూచియు, డబ్బును జూచియు నవియే సర్వశ్రేష్ఠసుఖములను కొందురు. వారికి నామీఁదఁ గాంక్షలేదు కామసుఖము, కాంచన సుఖముమీఁదనే వారికిఁ బ్రీతి నేను భావగ్రాహిత. ఇతరులందఱను మోసగింపగలరేమోగాని నేనంతర్యామిని, ఘట ఘటములందలి విషయములను గ్రహింపఁ గలను. నాకు తెలియనిదుండదు. నేను భావానుసారముగ ఫలము నొసంగుచుందును. నన్నుఁ గాంక్షించెడు భక్తుని నీవు చూచియుండిన నాకుఁజెప్పుము. ఇప్పుడేపోయి వానికి దర్శన మొసంగెదను.

ఇది విని నారదుఁడు పరమవిస్మితుఁడయ్యెను. తన మాటను సమర్థించుకొనుచు నిట్లనెను :- "విభూ ! మీరు విచిత్రముగఁబలుకుచున్నారు. ఒక్కరుగాదు. వేలకొలఁది భక్తులను నీ కొఱకు ఉత్కంఠితులై యేడ్చువారినిఁజూచితిని. చాల మందికి ఆహారము సత్సంగమే. సత్సంగము కొఱకు వారు చాల దూరము పోవుదురు. చాలమంది నిత్యమును గంగలో మునుఁగుచుందురు. చాలమంది అన్నమును వదలి ఫలపుష్పములను దినుచుందురు. కొందఱు మాటలాడుటను మాని మౌనులని

పించుకొందురు. చాలమంది సత్సంగముకొఱకు భక్తులను దూర దూరములనుండి పిలిచెదరు. చాలమంది నియమముగ సత్సంగ కీర్తనములను గావించెదరు. మీరు ప్రత్యక్షమైనచోఁ జూడుఁ డెందఱు చేరెదరో, ఎందఱు భక్తులానంద తన్మయులయ్యెదరో"

భగవానుఁడిట్లనెను:- "మంచిది, నేను భక్తుల దర్శనము కొఱకు ఉవ్విళ్ళూరుచుందును. ఎవఁడైన భక్తుఁడు లభించినచో నేనును దర్శనము చేసి కృతార్థుఁడ నగుదును."

ఇది వినఁగానే నారదుఁడు పరమానందమగ్నుఁడయ్యెను. ఆతనికి భగవంతుని జీవుల సమ్ముఖముననుంటయే ఆతనికి వ్రతము. దారినిఁదప్పినవారికి దారినిఁ జూపించును. భగవానుని దయాళుత్వమును స్మరించఁగానే ఆతనికి హృదయముప్పొంగెను. ఆతఁడిట్లనుకొనెను :- "అచ్చటికిఁ బోయెదను, ఆ భక్తులకీసుఖద సంవాదమును జెప్పెదను. వారికి భగవద్దర్శనము చేయించెదను," ఇట్లనేకాలోచనలు చేయుచు భగవానుని వెనువెంటనే బయలుదేరెను. నేడుఁ భగవానుఁడు గరుడుని వెంటఁ గొనిపోలేదు. చతుర్భుజరూపముతో నారదుని వెనువెంటనే పోయెను.

భగవానుఁడు నారదునితో నిట్లనెను :- "నారదా ముందుగా నెచ్చటికి పోవలయునో చెప్పుము."

నారదుఁడు కొంచెమాలోచించుకొని యిట్లనెను :- "స్వామీ ! ముందుగాఁ బ్రయాగరాజమునకుఁబోవుదము. అది సమస్త తీర్థములకును రాజు, భూమికి జఘనస్థానము భారత

దేశమునకు కేంద్రము సభ్యతకు ఉద్గమస్థానము పరమపావన
మగు బ్రహ్మావర్త ప్రదేశము. గంగా యమున సంగమము
కల్పాంతమునను నశింపని అక్షయవటము కలదు. ఆ ప్రాంత
మునకుఁ ప్రధానన్యాయాలయము కలదు. సమస్త దేశముల
నుండియు వేలకొలఁది యాత్రికులు సంగమస్థానమునకు స్నానా
ర్థమై వచ్చుచుందురు. అచ్చట నిరంతరము కథాకీర్తనము
జరుగుచుండును.ఇంటింటఁ గీర్తనము జరుగుచుండును. సంగమ
స్థానమున భక్తుల సమూహము చేరియుండును. అచ్చటి కభక్తు
లేల వచ్చెదరు ? అచ్చటికే దయచేయుడు. అచ్చట నొక్క
సారిగా వేలు, లక్షలుగా భక్తుల దర్శనమగును. అచ్చటనుండి
యీ సుఖదసంవాదము సర్వత్ర వ్యాపించును. తర్వాత గాశీకి
బోవుదము. ఇట్లు పృథియందలి సమస్త ముఖ్యస్థానము
లలోని భక్తులకును దర్శనమొసంగి వారి జీవితములను సఫ
లము గావింతము."

భగవానుఁడిట్లనెను :- "పద నారదా ! నేను నీ కధీనుఁ
డను. నీ యిష్టము వచ్చిన చోటకుఁగొనిపొమ్ము." అని పలికి
భగవానుఁడు నారదుని వెను వెంటఁబోయెను నిమిషములోఁ దీర్థ
రాజమగు బ్రయాగకుఁజేరుకొనిరి. గంగాయమునలు పరస్ప
రము కలిసి ప్రేమను ప్రదర్శించుచోటు. మాధవుఁడు ద్వాదశ
రూపములతోఁ బ్రయాగ మండలమున నల్దిక్కులను నివసించు

చోటు, అట్టి సమస్త తీర్థములకును స్వామాట్టగు ప్రయాగ క్షేత్ర మునకు నారదునితోఁగూడ భగవానుఁడు వచ్చెను. సంగమమున కర్ధక్రోశడు దూరమునఁదూర్పుదిక్కున శంఖ మాధవుఁడను పేరనున్నచోటునకు నారదునితో వచ్చె. దట్టమైన మామిడితోటను మందిర సమీపమున సఘన వటవృక్షమును గాంచి భగవానుఁ డచ్చటనే కూర్చుండి నారదునితో నిట్లనెను :- "నారదా! సహజముగ లభించు వస్తువుల నెవరు నాదరింపరు. పరిశ్రమచే లభించిన వస్తువునకు గొంతమహత్వముండును మనము వైకుంఠమునుండి యింత దూరము వచ్చితిమి. ఇప్పుడింటింటికి దర్శన మీయఁబోరాదు. దర్శనాపేక్షకలవారినిఁబిలుచు కొని రమ్ము. నిత్యమును సంగమమునకు వచ్చుచుందురు గదా! సంగమము దగ్గఱనే యున్నది కదా! ఇచ్చటికి భక్తులను బిలుచు కొనిరమ్ము."

నారదుఁడిట్లనెను :- "స్వామీ! చాల బాగున్నది. ఇప్పుడే నేనిచ్చటికి భక్తులను గొని వచ్చెదను. మీరీ వటవృక్షచ్ఛాయన గూర్చుండుఁడు అంతర్ధానము కాఁబోకుఁడు."

భగవానుఁడిట్లడిగెను :- "లేదు నారదా! అంతర్ధానము కావలసిన అవసరమేమున్నది? భక్తులు నాదర్శనము కొఱ కెంతగాఁ దపించెదరో నేనును వారి దర్శనము కొఱకంతగాఁ దపించెదను. నీవు పోయి నా దర్శనము కొఱకురాఁదలచిన వారినిఁదీసికొని రమ్ము దీనిలో నేమాత్రమును భేదమెంచకుము.

ఇది విని నారదుఁడు శీఘ్రముగఁదన వీణనెత్తుకొనెను గ్రీష్మకాలము. వైశాఖమాసము. త్రివేణిఁలో బెద్దసమూహము కలదు. నారదుఁడు వీణాలాప మొనర్చి అందఱతో నిట్లనెను :- "భగవానుని సాక్షాత్తుగదర్శింపఁదలఁచినవారు, శంఖమాధవము కడకుఁబోయి దర్శింపవచ్చును ?

ఇది విని కొందఱు నవ్విరి. కొందఱు ముసి ముసి నగవులునవ్విరి. కొందఱిట్లనిరి :- "భగవానుఁడంతట నున్నాఁడు." కొందఱు "భగవాఁడిట్లు వచ్చునా ?" యనిరి.

నారదుఁడు దృఢముగ నిట్లనెను :- "మీరందఱును గొప్ప శ్రద్ధాళువులు, ప్రత్యక్షమునఁ బ్రణమా మేమున్నది ? శంఖమాధవమెంతో దూరమునలేదు. పోయిచూడుఁడు. ఎవరి కొఱకు మీరందఱింతగా భజన, ధ్యాన, గంగాస్నానము లొనర్చుచుండిరో ఆతఁడు ప్రత్యక్షముగ విజయముచేసినాఁడు." ఈ విధముగ నారదుఁడెంతో ప్రభావశాలియగు భాషణమొనర్చెను. ఇదివిని అందఱును నవ్విరి, యెవ్వరును లక్ష్యపెట్టలేదు. అప్పుడు నారదుఁ డొక్కొ్కక్కరి నడుగసాగెను. కొందఱు తెల్ల గుడ్డలమువారు స్నానము చేయుచుండిరి. వారి నిట్లడిగెను :- మీరేల పోవరు ? ఇంత శ్రద్ధగా గంగాస్నానమొనర్చుచున్నారు వారిట్లనిరి :- "బాబా ! మేమారోగ్యము కొఱకు స్నానమునకు వచ్చితిమి." ఒకానొకఁడిట్లనెను ;- "మేము దుకాణమును దెఱవవలయును." మఱియొకఁడిట్లనెను ;- "నేను నౌకరికి పోవల

యును. తిరిగి వచ్చుట చాల యాలస్యమగును. సమయమునకుఁ బోకున్న నౌకరిపోఁగలదు." ఇంకొకఁడిట్లనెను ;- మేము న్యాయాలయమునకుఁ బోవలయును." స్త్రీ లిట్లనిరి ;- "మేము వంటలు చేసికొనవలయును." సారాంశ మేమనఁగా నెవరును నారదుని వెంట బోలేదు. నారదుఁ డిట్లనుకొనెను ;- "వీరు ప్రతి రోజును వచ్చుచుండెడువారే. అందఱకును దీరికలేదు. నగరము లోనికిఁబోయి అచ్చట నేమైన భక్తులు లభించెదరేమో చూతము. ఇప్పుడు నారదుఁడు మందిరముల లోచికిఁబోయెను. మఠములకుఁ బోయెను. సత్సంగ మందిరములకుఁ బోయెను. సాధుకూటములకుఁ బోయెను. సారాంశమే మనఁగా వారు భక్తులుండు తావులన్నిటికినిఁ దిరిగిరి. ఒక్కొక్కప్పుడు దేనికోఁ పఱువిడుచుండును. మఱియొకఁడేదో చింతలోఁబడియుండును. ఇంకొకఁడేదో కార్యనిమగ్నుఁడై యుండును. నారదుని మాటలను గొందఱు వినుచుండిరి. కొందఱు నవ్వుచుండిరి. కొందఱ కవకాశము లేకపోవుటచేదుఃఖము ప్రకటించుచుండిరి. కొందఱు వివశతను బ్రకటించుచుండిరి. సారాంశ మేమనఁగా నెవఁడును వెంటబోవుటకు నుద్యుక్తుఁడు కాలేఁదు. మధ్యాహ్నమయ్యెను. సరిగా రెండు జాములప్పుడు బయటకెవరు పోఁగలరు. క్రింద నుండి మేడపైకి వెడలుట చాల భారము. నారదునకు మిక్కిలి నిరాశకలిగెను. రెండు జాములు దాటిపోయెను. కార్యాలయము నుండి కార్యమొనర్చుకొని జనులు తిరిగి వచ్చుచుండిరి. నారదుఁడు బొట్టుపెట్టుకున్న వారందఱతోఁ జెప్పెను. అందఱిట్లనిరి

"బాబా ! దయ యుంచుఁడు. పగలంతయును శ్రమను జెంది యిప్పుడే వచ్చుచున్నాము. మీరే భగవద్దర్శనము చేసిరండు. ఇప్పుఁడు నారదునకు దుఃఖమును, నిరాశయును గలిగెను. భగవానుని కడకెట్లు పోవుదునా యని సిగ్గునుగూడ చెందుచుండెను. ఆతఁడిట్లనుకొనెను ;- "ఆవలి యొడ్డునఁ బ్రతిష్ఠానపురము (ఝూసీ)కి వచ్చెను. కనఁబడిన వారి కందఱకును జెప్పెను ;- "నాయనా ! నేను నారదుఁడను, భగవానుఁడు దర్శనమిచ్చుటకు శంఖమాధవమునఁ గూర్చుండియున్నాఁడు. పోయి దర్శనము చేసిరండు. పిల్లలు మేముచదువుకొనవలయు ననిరి. కొందఱు మాకు ఫలాని పనియున్నదనిరి. కొందఱు మేము కథాకీర్తనమునకుఁ బోవలయుననిరి. కొందఱుస్త్రీలను నారదుఁడు కాంచి వారితోడను జెప్పెను. వారిట్లనిరి :- "స్వామీ; ఏమి చేయుదుము ఎంతో పనియున్నది. ఎంతోదూరము పోయి రావలయును. అచ్చటినుండి తిరిగి వచ్చుటయును గష్టము. అచ్చట భగవానుఁడున్నాఁడో లేఁడో అదియును నిశ్చయము లేదు."

అంత నారదుఁ డిట్లనెను ;- "నేను నారదుఁడనై అసత్యమును జెప్పుదునా ?"

స్త్రీ లిట్లనిరి ;- "అయ్యా, ఇచ్చటికి శుకదేవులు, నారదులు, దత్తాత్రేయులు వచ్చుచుందురు. దీనికి తక్కువ వారెవరును రారు."

నారదుఁ డిట్లనెను :- "వారందఱును కపట నారదులు. నేనో యథార్థపు నారదుఁడను."

వారిట్లనిరి :- "స్వామీ యథార్థపు కపట పరీక్ష నెవరు చేయగలరు ? అంతయును సత్యమే. "హరి వ్యాపక సర్వత్ర సమానుఁడు-ప్రేమచేతఁ గనఁబడు భగవానుఁడు" భగవానుఁ డంతట నున్నాఁడు.

నారదుఁడు ముఖము త్రిప్పుకొని మరల త్రివేణికి వచ్చెను. అచ్చటఁ గొందఱు యాత్రికులుండిరి. కొందఱు సాయంకాలము వాహ్యాళికి వచ్చినవారును గలరు. కొందఱు పల్లెవాండ్రును గలరు. నారదుఁడు కోపముతో నుండెను. ఊరక ఒంటరిగాఁబోఁ దలఁచలేదు. ఆతఁటచ్చట నొక ప్రభావశాలి యగు నుపన్యాసము నొసఁగి చివర కిట్లనెను :- "నేను మిమ్మే మియును నడుగఁదలఁచలేదు. ఏ పరిశ్రమమును జేయించను. నా మాటను మాత్రము విశ్వసింపుఁడు. భగవంతుని దర్శించి యీ మానవదేహమును సఫల మొనర్చుకొనుఁడు. భగవానుఁడు కాకున్నచోఁగటిక దొంగకే శిక్షను వేయుదురో అట్టి శిక్షను నాకు వేయుఁడు." అయిదారుగురు ఉత్సాహవంతులగు నవ యువకులుండిరి. కొందరు యాత్రికులుండిరి. కొందఱు భక్తులుండిరి. అందఱిట్లనిరి:- "మాకు పోయిన దేమున్నది. పోదము పద, చూతము. ఒక వేళ భగవానుఁడు లేకున్నచో వాహ్యాళి కాఁగలదు." అని నారదుని వెనువెంట పోయిరి కుతూహల

వశమునఁగొందఱు పల్లెవాండ్రును బయలుదేరిరి. కొందఱు భక్తులును, యాత్రికులును బయలు దేరిరి. అందఱును గలిసి నూరు నూటయేఁబదిమంది నారదుని వెంట బయలుదేరిరి. కొందఱు స్త్రీలుకూడ వెడలఁదలఁచిరి, కాని తిరిగి వచ్చుట ఆలస్యమగునను భయముచేతను ఇంటిలో నేమందురో యనియు పోకుండిరి. రాత్రివేళ నెట్లురాఁగలరు ? ఇంటివారేమందురో ? స్త్రీ జన్మ భగవానుఁడు వృథాగా నిచ్చినాఁడు. ఎప్పుడును బర ముఖాపేక్షతో నుండవలసినదే కదా !" వారిట్లు విధాతను నిందించుచుఁదిరిగి పోయిరి.

నారదుఁడందఱు భక్తులు దొరికినారని మిక్కిలి యుత్సాహముతో ముందుకు పోవుచుండెను. ఆతని సంతోషమదియే. ఇందఱు భక్తులు వచ్చుచుండఁగా భగవానుఁడొకమాయను రచించెను. దారిలో నొక ద్రవ్యపురాశి యుండెను. కొందఱిట్లనిరి ;- "అయ్యో ! అచ్చటనేమున్నది ? వీనిని గట్టుఁడు." కొందఱు దానిపైకురకఁగా నారదుఁడుపన్యసింపనారంభించెను. "ఛీ! ఛీ! చాల విచార కరము. మానవదేహమును బొంది యీ రాగి రూకలకు లోభించి భగవద్దర్శనమునకు వంచితులగుదురా ? భగవద్దర్శనమైనచో సమస్తమును లభించినట్లే, కాని నారదుని మాటను వినువారెవరు ? కొందఱు మూటలను గట్టుకొని తిరిగి వచ్చిరి. కొందఱాతని వైపు చూడకయే పోవుచుండిరి. కొంతదూరము పోఁగానే వెండి రూకల రాశి కనఁబడెను. చాలమంది అచ్చటనే జారిపోయిరి. మిగిలిన వారు

కొందఱు ముందుకు నడిచిరి. ఇంకనుముందుకు పోఁగానే సువర్ణ ముద్రికలు కనఁబడెను. కొందఱచ్చట నిలిచిపోయిరి. ఇంకను మిగిలిన వారికి ముందుకుఁపోగా మణి మాణిక్య ముత్యములు కనఁబడెను. నారదుఁడు వలదనుచున్నను మిగిలినవారు దానిపై విఱుగఁబడిరి. వారిలో నైదుగురు మాత్రము వాటిని నిరాకరించి నారదుని వెంటనే బయలుదేరిరి.

ముందుకు పోఁగా భగవన్మాయచే నిర్మితములైన నత్యంత సుందర యువతులైదుగురు నిలుచుండిరి. వారేడ్చుచుండిరి. ఆ యైదుగురును బోయి యిట్లడిగిరి :- దేవులారా ! "మీరేల నేడ్చుచున్నారు."

వారు వెక్కి వెక్కి యేడ్చుచు లిట్లనిరి :- "మేము రాజు పరివారములోని కులీన కుమారిణులము. మా దేశములో నుప ద్రవములు కలిగినవి. మేమచ్చటినుండిపచ్చివేసితిమి. మమ్ముల నెవరైన వివాహము చేసికొనుఁడు. మావద్ద ధనమున్నది. అనేక మూల్యాభరణములును నాభరణములు కలవు. ఇంతటి సుందర స్త్రీలు, అంతులేని ధనము వీనిలోభమును నా యువకులాపు కొనఁజాలక పోయిరి. అప్పుడు నారదునకు మిక్కిలి కోపము వచ్చెను. ఆతఁడు కన్నులెఱ్ఱఁచేసి యిట్లనెను :- "మీ బుద్ధి భ్రష్ట మైనదా ? వీరు స్త్రీలు కారు, వీరి వద్ద యథార్థమగు ధనమును లేదు. ఇది భగవన్మాయ. మిమ్ములను భ్రమలోఁబడ వేయుటకై. మిమ్ములను బరీక్షించుటకై భగవంతుఁడీ మాయనంతను ప్రద

ర్శించెను. మీరీ యాడుదయ్యముల మాయలోఁ బడవలదు. ఒడ్డునకు వచ్చిన తరువాత నౌకను ముంచవలదు. భగవద్ధర్మ సమున నష్టసిద్ధులును. నవనిధులును ప్రాప్తించును. వీరు పర మార్థమునకు విఘ్నము కలిగించువారు."

ఇది విని వారిలో నొకఁడు కోపముతో నిట్లనెను :- "నీవు సాధువువా రాక్షసుఁడవా ? దుఃఖితులకు సేవ యొనర్చుట తప్పా ? నీవు ధూర్తుఁడవు వలె నున్నావే ?"

నారదుఁ డిట్లనెను :- "ఇదియే పరీక్ష. మీరు నా వెంట రండు. వీరిని వదలుఁడు. మీరు మీ హృదయమునఁ జేతులుంచుకొని చెప్పుఁడు. మీరు పరోపకార బుద్ధిచే స్వీకరింప నున్నారా లోభవశము చేతనా ? మీరు చాల దగ్గఱకు వచ్చినారు. మీరు వీరినిఁ దీసికొని పోఁదలచినచోఁ దిరిగి వచ్చునపుడు తీసికొని పోండు."

అంత నొకక్కఁడిట్లనెను :- "అవును, బాగున్నది. మీరిచ్చట కూర్చుండుఁడు. మేమిప్పుడు చూచి తిరిగివచ్చెదము."

ఇదివిని యాబాలిక లిట్లనిరి :- "ఇప్పుడు సూర్యాస్తమనము కాబోవుచున్నది. మేమీ యరణ్యమున నెక్కువసేపు నిలువఁజాలము. మీరు మమ్ములను వదలిపోయితిరేని మేము నగరమునకుఁ బోయి, ఇంకెచ్చట నైనను శరణమును యాచించెదము."

అంత నొకఁడిట్లనెను :- మునివి. ఇద్దరు వీరి దగ్గఱ కూర్చుండుఁడు, మిగిలిన ముగ్గురీ బాబాగారి మాటలను బరీక్షించి రండు."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈకామినీ కాంచనములు మానవుని వెంటనేవిశ్వసింపనీయనివి. తోఁబుట్టిన వానిని నమ్మనీయవు. ఇప్పుడు వారివద్ద నుండుట ఎవరను వాదవివాదములు సంభవించెను. చివరకొకఁడిట్లనెను :- "మీరుకూడ మనతో భగవద్దర్శనమునకు రావలయును."

అంత నా పిల్లలిట్లనిరి :- "మీరందఱును గుడ్డివారని తోఁచుచున్నది, ఈ బాబాగారి వెంట మేమొక్క అడుగునైనఁ బెట్టమని మీకు స్పష్టముగ జెప్పుచున్నాము. మాకిది యేదో మోసముగఁ దోఁచుచున్నది. సాధువు కోమలస్వభావము కలిగి యుండును. వారికి స్త్రీ పురుష లందఱును సమానులే. ఈతఁడు తప్పక మిమ్ముల నందఱను జాలంమోసమునఁ బడవేయఁదలఁచు చున్నట్లున్నాఁడు. మీరీతని మాయలోఁబడుచో మేము మాత్రము వెడలిపోయెదము."

ఇట్లు పలికి వారు పోవుటకుద్యుక్తులైరిఁ ఇప్పుడందఱి మనస్సులూగసాగెను. అటు భగవద్దర్శనేచ్ఛయును గలదుఁ ఇటు చేతిలోనికి వచ్చిన లక్ష్మి పోవుచున్నదిఁ చివరకు వారిట్లనుకొనిరి :- ఈబాబాను నమ్మినదెవరు? ఇంటికి వచ్చు లక్ష్మినిఁ గాల దన్నుటయా ? "జైఉలూక వాహినీకిజై 'యనుచు వారినిఁ

దీసికొని వెనుదిరిగిరి. నారదుఁడు కేకలు వేయుచునే యుండెను. కానివారు వెనుదిరిగి చూడనైనఁ జూడలేదు.

ఇప్పుడు నారదుఁడు చాల దుఃఖితుఁడయ్యెను. మిక్కిలి లజ్జతోవచ్చి భగవానుని సమీపమునకుఁ జేరుకొనెను. భగవానుఁడు మిక్కిలి యుల్లాసముతోఁనిలుచుండి యిట్లనెను:- రమ్ము, నారదా ! రమ్ము ! నీభక్తమండలి యెక్కడ ? ఆలస్యము చేసినావే." నేనెంతో సేపటినుండి ప్రతీక్షించుచున్నాను. నాకు క్షణక్షణము భారమగుచున్నది.

నారదుఁడు చేతులు జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నీమాయ పారము. మాయవదలినప్పుడే మాయాపతి శరణమునకు వచ్చుట. అందఱును నేదోవిధముగ మాయా విమోహితులైనవారేఁ ప్రభూ ! నీ వెవరినిఁ గృపఁజూచెవో వారే నీ గుణమయమగు దురత్యయ మాయను దాట గలరు. జీవులు నిన్నుఁ గోరరుఁ నీనామము దానికి శస్త్రమని భావింపరు. వారు పాపములనే ప్రేమించుచుందురుఁ పాపములను రక్షించుకొనుట కొఱకై నీ నామమును డాలుగా నుపయోగించుకొందురు.

సూతుఁడిట్లనెను :- "కావున మునులారా ! పరమార్థపథమునకు విఘ్నములీరెండే, కామము, లోభము. వీనిని జయించినవాఁడు సిద్ధుఁడగును. శివశర్మ యొక్క యైదుగురు పుత్రులును నీ రెంటిని జయించిరి. అందువలన వారు తమ సంకల్పములను నెఱవేర్చుకొనుటకై సర్వసమర్థులై యుండిరి. శివశర్మ

యోగి, యోగసిద్ధుల వలన నాతఁడే రూపము కావలయుననిన నా రూపమును ధరింపఁ గలిగెడువాఁడు."

ఒకసారి శివవర్మ తన పుత్రుల నైదుగురును వీరు తన యెడలఁ బూర్ణభక్తులగునా కాదాయని పరీక్షింప నిశ్చయించుకొనెను. ఈ యుద్దేశ్యముతో నాతని పతివ్రతయగు పత్నిని మాయచే రోగినిగా నొనర్చి అల్పకాలమునకే మాయచేఁ జచ్చినట్లొనర్చెను. అప్పుడాతఁడు తన జ్యేష్ఠపుత్రుడగు యజ్ఞశర్మను బిలిచి యిట్లనెను :- "వత్సా ! నీ తల్లి మరణించినది. ఇప్పుడిఁక నీమె వలన మీకేమి ప్రయోజనము. ఈమెను వనములోనికిఁ గొనిపోయి ముక్కలు ముక్కలుగఁగోసి పాఱవైచిరండు," ఇదివిని యజ్ఞశర్మ కాదనలేదుఁ పితృాజ్ఞను శిరసావహించి తల్లి శరీరము నెత్తుకొనిపోయి వనములోఁ బాఱవైచిరి. అంత దండ్రితో వచ్చి యిట్లనెను :- "నాయనగారూ నేను మీయాజ్ఞను అక్షరశః పాలించి వచ్చితిని. ఇప్పుడు నాకేమి యాజ్ఞ ?"

తనపుత్రుని యీ పితృభక్తిని గాంచి యోగసిద్ధుఁడై శివశర్మ అత్యంత ప్రసన్నుఁడయ్యెను. తన పుత్రులైదుగురును పితృభక్తులనియు, సిద్ధులనియు దెలిసినను వారికి లోకమందు ప్రసిద్ధికలుగవలయునని ఆతఁడీ మాయను రచించెను. ప్రథమపుత్రుని పరీక్షకాఁగానే రెండవ పుత్రుడగు వేదశర్మ నాతఁడు పరీక్షింపఁ దలఁచెను. మాయచే నాతఁడు రూపవతియగు స్త్రీని రచించి తన ద్వితీయ పుత్రుడగు వేదశర్మతో నిట్లనెను :-

"వత్సా ! మీరందఱును నాకు మిక్కిలి సేవచేయు చున్నను నీవు పితృ భక్తుఁడవు; కాని భార్యచేసినట్లు సేవ యింకెవరును జేయఁజాలరు. భార్య తల్లి, సఖి మంత్రి మొదలగువారు చేయు పనిఁజేయును. ఆడుదితయారుచేసిన భోజనములోని రుచి మగ వాఁడు చేసిన భోజనములో రాదు. స్త్రీలలో నన్నపూర్ణాంశ యుండును. ప్రపంచములో బురుషునకు స్త్రీకి మించి సుఖ మొసంగువారలు లేరు. నా భార్య చనిపోయినది. నేను భార్య లేకుండఁనుండ జాలను. సమీపమున నన్ను నీ స్త్రీని పునర్వి వాహము చేసికొనఁ గోరుచున్నాను. ఈ స్త్రీ యెట్లు సంతుష్టినిఁ జెందునో అట్లు సంతుష్టినిఁ జెందించి నాకు దెచ్చియిమ్ము, ఆ స్త్రీ లభింపకున్నచో నేను బ్రతుకను.

తండ్రి పలికిన యీ పలుకులను విని వేదశర్మ యిట్ల నెను :- "తండ్రీ ! నేను నా ప్రాణముల నొడ్డియైనను మీ కోరి కను నెఱవేర్చెదను. అని పలికి మాయానిర్మిత సుందరి కడకు బోయెను. అచ్చటికిఁబోయి ఆతఁడిట్లనెను ;- "దేవీ ! నా తండ్రి నిన్ను వివాహమాడఁ దలఁచుచున్నాఁడు. నీవు నా మీఁదఁ బ్రసన్నురాలవై నాతండ్రిని భజింపుము."

ఆ స్త్రీ యిట్లనెను ;- బ్రాహ్మణోత్తమా ! నీవు యువకుఁ డవై యెట్టి యధర్మ కార్యము నొనర్చుచున్నావు. ఆవృద్ధుని వివాహ మాడిన నాకేమి ప్రయోజనము కలదు? ఆతని యింద్రి యములన్నియుసు శిథిలములైనవి రోజంతయును ఖోఁ ఖోఁయని దగ్గుచుండును. కఫముచే నా స్థానమునంతను పాడుచేయు

చుండును. కఱ్ఱను బట్టుకొని పోవుచుండును. యిట్టి ముసలి తొక్కను నేను బెండ్లి యాడఁ దలఁచుటలేదు."

వేదశర్మ యిట్లనెను :- "దేవీ । నా తండ్రి సిద్ధుఁడు, అతఁడేది కావలయుననుకొనిన దానినిఁజేయఁగలఁడు నీవునన్నను గ్రహించి ఆతనిని జేపట్టుము,"

ఆస్త్రీ యిట్లనెను :- "నీవా వృద్ధుని యధర్మపు కోరిక నేల సమర్థించెదవు ? ఆతనికి వృద్ధావస్థలో వివాహమావశ్యకత యేమున్నది ? వివాహసమయము నీది. నామనము నీయందే లగ్నమై యున్నది. నావద్ద మిక్కిలిగ రొక్కముగలదు. నీవు నన్ను వివాహమాడి ప్రాపంచిక సుఖముల నన్నిటిని భోగింపుము. వృద్ధుల బుద్ధిభ్రష్టమై యుండును. ముందుగాఁదమ సుఖమును జూచుకొనవలయును. తాను సుఖముగ నున్నఁ వాఁడు ధర్మకర్మలను జక్కఁగజేయఁగలుగును."

వేదశర్మ యిట్లనెను :- "దేవీ ! నీవిట్టి యధర్మవాక్యములను బలుకకుము. నా తండ్రి నిన్ను వరించినాఁడు కావున నీవు నాకుఁ దల్లితో సమానమైతివి. కావున నిట్టిమాటలు నీకు శోభింపవు. మా తండ్రి కోరిక యెట్లు పూర్ణముగ నెఱవేరఁ గలదో చెప్పుము.

స్త్రీ యిట్లనెను :- "నీవు పితృభక్తి కలిగి యే సిద్ధినిఁ బొందితివి ? దానిని నాకు జూపింపుము. అప్పుడు నేను నీ ప్రశ్నప్రత్యుత్తర మొసంగెదను. నీ వద్ద యున్నచో నాకు దేవతా దర్శనము చేయించుము.

ఇదివినఁగానే వేదశర్మ దేవతలను మనస్సుతో నాహ్వానించెను. వెంటనే అచ్చటకు దేవేంద్ర, వరుణ, కుబేరాదిదేవతలు ప్రత్యక్షమైరి. వేదశర్మతో నిట్లనిరి :- "అయ్యా ! మేము నీ పితృభక్తికి సంతుష్టులమైతిమి. నీకు కావలసిన వరమును గోరుము.

వేదశర్మ యిట్లనెను :- "నా పితృ దేవుని చరణముల మీదఁనా కనన్య భక్తినిఁ బ్రసాదింపుఁడు. ఇది తప్ప యింకేమియును గోరను" దేవతలు తథాస్తని అంతర్ధానమైరి. అప్పుడా మాయాస్త్రీ యిట్లనెను :- దేవతలను గాంచిన నాకేమి యొరిగినది. నీవు నిజమగు పితృభక్తుఁడ వయ్యెదవేని నీ శిరస్సును నీ చేతితోఁ గోసి నాకిమ్ము." ఇది వినగానే వేదశర్మ యెరిగి యిట్లనెను :- "ఆహా ! నేను ధన్యుడను. ఈ మానవ శరీరము దేనికిఁ బనికి రాదని అందఱను చుందురు. ఈ శరీరమువలన నా తండ్రికేదైన సేవ లభించినచో నీ శరీరము ధరించుట సార్థకమైనట్లే" అని పలికి ఆతఁడు వెంటనే ఒకతీక్ష్ణ ఖడ్గముచేఁ దన శిరస్సును నఱకుకొని ఆ స్త్రీ కొసంగెను."

ఆ స్త్రీ ఆశరీరమును దీసికొని ఆతని తండ్రికడకుఁ బోయి చూపఁగానే తన పుత్రుని శిరస్సా స్త్రీ చేతిలో నుండుటను గాంచఁగానే పుత్రుని యొక్క పితృభక్తికి ప్రసన్నుఁడయ్యెను. పుత్రవియోగ కారణమున దుఃఖితుఁడయ్యెను. బ్రాహ్మణుని యితరపుత్రులా స్త్రీ సాహసమును గాంచి గడగడ వణఁకుచు వేదశర్మ భాగ్యమును గూర్చి ప్రశంసించు చుండిరి.

తండ్రియగు శివవర్మ తనమూఁడవ పుత్రుఁడగు ధర్మ శర్మను బిలిచి యిట్లనెను :- "నాయనా ! నేనీ స్త్రీని బెండ్లాడఁ దలఁచినాను కాని నాయాజ్ఞాకారియగు వేదశర్మ జీవించనంత వఱకు నాకు శాంతియును లేదు, సుఖమును లేదు. నీవీ పిల్ల వాని శిరస్సును గొనిపోయి వాఁడు జీవించు నుపాయ మొన ర్పుము." ఇది విని ధర్మశర్మ యిట్లనెను :- "ప్రభూ ! నా సోదరుఁడు మీ ధర్మ ప్రభావమున నవశ్యము జీవింపఁగలఁడు. మిమ్ము సంతోష పెట్టఁగలఁడు." అని పలికి యాతఁడు చచ్చిన యన్నకడకుఁ బోయెను. అచ్చట నాతఁడు మొండెమునకు శిర స్సును దగిలించి యిట్లనెను :- "నేను మనోవాక్కాయముల సదా పితృభక్తిరతుఁడనగుచో యమధర్మరాజిప్పుడే వచ్చి నా సోదరుని బ్రదికించుగాక ?" ఇట్లనఁగానే యమధర్మరాజు వెంటనే ప్రత్యక్షమై ధర్మశర్మతో నిట్లనెను :- "వత్సా ! నేను నీశీల, సదాచార, శమ, దమ,త్యాగ, తితిక్షాది గుణములకు సంతు ష్టుఁడనైతిని,నీవు నీకిష్టమువచ్చిన వరమును గోరుకొనుము."

ధర్మశర్మ యిట్లనెను :- "ప్రభూ ! నీవు నాకు వర మీయ గోరినచో నీ నా సోదరుఁడు బ్రదికి నా తండ్రికి సుఖ మును గలిగింపవలెను."

ధర్మరాజిట్లనెను :- నేనిదే వరమును గోరుచున్నాను." నా పితృ చరణములందు నిరంతరము భక్తియుండవలెను చివరకు నాకు మోక్షము రావలయును." తథాస్తని యమధర్మ రాజు వెడలిపోయెను. వెంటనే చచ్చిన దేవశర్మ జీవించిలేచెను.

సోదరులిద్దరును ప్రసన్నులై తండ్రి సమీపమునకుఁ బోయిరి. తన పుత్రుఁడు మరల జీవించుటను గాంచి శివశర్మకుఁ గలిగిన యానందమునకు మేఱలేకుండెను. ఆతఁడా మాయా నిర్మిత ప్రమదతో విహారమొనర్చు చుండెను.

ముగ్గురు పుత్రుల పరీక్ష పూర్తియయ్యెను. నాల్గవ కుమారుఁడగు విష్ణుశర్మను బరీక్షింపఁదలంచి తండ్రి యిట్లనెను :- "వత్సా ! నేను చాల వృద్ధుఁడనైతిని. నీవు స్వర్గమునకుఁబోయి నాకొఱక మృతమును దేఁగలిగినచో నేనజరామరుఁడను గాఁగలను."

విష్ణుశర్మ యిట్లనెను :- "మంచిది తండ్రీ ! నేను మీ యాజ్ఞచే నే నిప్పుడే స్వర్గమునకు బోయెదను" అని పలికి ఆతఁడు యోగబలముచే స్వర్గమునకుఁ బోయెను ఇంద్రుఁడాతని యభిప్రాయమును గ్రహించి, ఆతనిని లోభపెట్టవలయునని స్వర్గములో సర్వశ్రేష్ఠ సుందరియగు నూర్వసియను నప్సరసను బంపెను. కాని పితృభక్తుఁడగు విష్ణుశర్మ ఆమె వలలోఁబడలేదు. ఇంద్రుఁడు దర్శనమీయలేదు. అందువలన బ్రాహ్మణ కుమారుఁడు క్రోధముతో మఱియొక యింద్రు నేర్పఱచుటకు సంకల్పించి అనుష్ఠానమును గావించెను. అప్పుడింద్రుఁడు వచ్చి అమృత కుంభము నొసంగి, వానిని సాదరముగ సాగనంపెను విష్ణుశర్మ కుంభమును దీసికొనిపోయి పితృచరణ సమీపమున నుంచెను.

తన నల్గురు కొడుకుల పితృభక్తినిఁ గాంచి తండ్రి అత్యంత ప్రసన్నుఁడై వారితో నిట్లనెను :- "పుత్రులరా ! నేను మీ భక్తికిని యోగశక్తిని, నిష్కామవృత్తికిని మిక్కిలి సంతసించితిని. మీరు మీకిష్టము వచ్చిన వరమును గోరు కొనుఁడు."

అంత నల్గురు సోదరులు నిట్లనిరి :- "తండ్రీ ! మీరు సర్వసమర్థులరు. మీరేది తలఁచిన దానినిఁ జేయఁగలరు. మేము మిమ్ములను మా తల్లి జీవితురాలగునట్లు వరమును గోరు చున్నాము."

తల్లి చావలేదు. శివశర్మ తనయోగబలముచే నామెనంత ర్హిత మొనర్చినాఁడు. కావున నాతఁడిట్లనెను :- "మంచిది, మీతల్లి జీవింపఁగలదు." అనఁగానే ఆమె తక్షణమచ్చట ప్రత్యక్ష మయ్యెను. అయిదుగురన్నదమ్ములును నామె చరణములకు సమస్కరించిరి. ఆమె యాశీర్వదించుచు వారితో నిట్లనెను :- తల్లిదండ్రులను నరకముల నుండి యుద్ధరింతురని పుత్రులు కావలెనని కోరుకొనుచుందురు. మీరు మీభక్తిచే మమ్ము సంతోష పెట్టితిరి. కావున మీకు కల్యాణమగుఁగాక !" అని పలికి తల్లి పుత్రుల నాశీర్వదించెను. వారి శిరస్సులను మూర్కొని చాలగఁ బ్రేమించెను."

ఈ విధముగ నల్గురుపుత్రుల పరీక్ష పూర్తియయ్యెను. ఇప్పుడందఱకంటెను జిన్నవాఁడగు సోమశర్మ మిగిలెను. ఆత నికి దండ్రి అమృత కుంభము నొసంగి తీర్థయాత్రలకుఁ

బోవుచు నీ కుంభమును రక్షింపవలయునని చెప్పెను. సోమ శర్మ ఆ కుంభమును రక్షించుచుండెను.

పండ్రెండు సంవత్సరములకు తండ్రి తీర్థయాత్రలొనరించి తిరిగివచ్చెను. ఆతఁడు యోగబలముచే శరీరమంతటను గళితకుష్ఠముత్పన్నమగునట్లు చేసుకొనెను. అట్లే తన భార్యకును గళితకుష్ఠ కలుగునట్లుచేసి, యిద్దరు నట్లు కుష్ఠరోగములతో సోమశర్మ సమీపమునకువచ్చిరి. తన తల్లిదండ్రులు కుష్ఠరోగముతో నున్నను సోమశర్మ వారియెడల నిసుమంతైన నశ్రద్ధ ప్రకటింపలేదు. మిక్కిలి భక్తితో వారిపాదములకు మ్రొక్కి యిట్లనెను:- "తండ్రి: మీరు పరమ ధర్మాత్ములరు. ఇట్లు ధర్మాచరణ మొనరించువారిని నేనెచ్చటను జూడలేదు. మీకీ భయంకరరోగమెట్లు వచ్చినది? మా తల్లి సతీ సాధ్వులగు స్త్రీలలో శిరోమణులు. ఈ రోగము మీకెట్లువచ్చినది."

తండ్రి యిట్లనెను:- "వత్సా: కర్మఫలము నందఱనుభవింపవలసినదే. నీవు మాకు సేవను జేయుము,"

ఇది వినఁగానే సోమశర్మ తమ మన ధనములచేఁ దన మాతాపితరులకు సేవచేయుచుండెను. ఆతఁడు వారిగాయములను స్వయముగ గడుగుచుండెను. వారికిఁ జక్కఁగ భోజనము పెట్టుచుండెను. చరణ సేవ చేయుచుండెను. సారాంశమేమనఁగా నెంత సేవచేయుదగునో అంతగా సేవచేయుచుండెను. తండ్రి ఒక్కొక్కప్పుడాతనిపైఁ గోపపడుచుండును. కఱ్ఱతోఁ గొట్టి

చుండెను. కాని ఆతనికేమియు నెదురు చెప్పకుండెను. విరోధ పడకుండెను. అతని దెబ్బలను సహించుచుండెను. ఒకదిన మునఁ దండ్రి యిట్లనెను:- "పుత్రా! అమృతకుంభము నిటుఁ దీసికొనిరమ్ము. మేము దానినిఁద్రావి నిరోగులమయ్యెదము."

ఇది విని సోమశర్మ అమృతకుంభము సురక్షితముగ నున్న స్థానమునకుఁబోయెను. కాని ఆశ్చర్యమునకు మేర లేకుండెను. దానిలో నొక్కబిందువైన నమృతములేదు. తండ్రి యోగబలముచే బరీక్షార్థమంతయు నపహరించెను. అప్పుడు సోమశర్మ చేత జలమును గైకొని యిట్లు:- "నేను ధర్మపూర్వకముగ హృదయముతోఁ దల్లిదండ్రులను దేవతలవలెఁ బూజించుచున్నచో నీఘటము మరల నమృతముతో నిండియుండుగాక!" చూచుచుండఁగనే ఘట మద్భుతముగ నిండిపోయెను. సోమశర్మ దానినిఁగైకొని తండ్రికడకుఁబోయెను. దీనికి తండ్రి పరమానందమునుజెందెను. ఆతనికి వైష్ణవమంత్రము నొసంగిఁబోయెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ సోమశర్మయే చివరకు హిరణ్యకశిపునకుఁ బుత్రరూపమునఁబ్రహ్లాదుడయ్యెను. చివరకాతఁని తండ్రి విష్ణు భగవానునిచేతఁజంపఁబడెను.

ఇది విని శౌనకుఁడదరిపడి యిట్లనెను:- "సూతా! నీవు మాకొక విచిత్ర కథను జెప్పితివి, ఇంతటి ధర్మాత్ముఁడగు సోమశర్మ అసురుఁనికి నేల యుద్భవించినాఁడు. హిరణ్య

కశిపుని యుద్ధములో భగవానుఁడెప్పుడెచ్చటఁ జంపినాఁడు. ప్రహ్లాదుఁడు పుట్టినప్పటినుండియు భగవద్భక్తుఁడే. మాయీ శంకకు సమాధాన మొసంగుఁడు."

ఇది విని నవ్వుచు సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను మీ శంకకు సమాధానము చెప్పెదను. దీనిలో నొక విచిత్ర రహస్యమున్నది. ఇది గొప్పగూఢమగు గాధ. మీరు శ్రద్ధతో దీనిని వినుఁడు.

)o(

# ప్రహ్లాదుని మూఁడవ జన్మ

౪౯౧

శ్లో॥ అలంఘ్యః శీలధరో గుణాకరో
హృష్టః పరర్ధ్యా వ్యథితో దుఃఖితేషు॥
అభూత శత్రుర్జగతః శోకవార్తా
నైదాఘికం తాపమివోడు రాజః॥

-శ్రీ భాగ. ౭ స్కం. ౧౪ అ. ౪౮ శ్లో॥

సీ. మహిత దేహాద్యభిమానంబు దిగనాడి
చిరతరాలంపటశీలుఁడగుచుఁ
బర సమృద్ధికి నాత్మఁబరితోషమందుచు
బరదుఃఖమునకుఁ దాపమునుఁబొందు
నీ విశ్వమంతయునేవిభుమయమని యెవ్వని
కరుణచే నెఱుఁగ నయ్యె
నట్టి యీశ్వరునిఁదా నాత్మ సాక్షిగ మోద
మడరఁగఁజూచు ననన్యదృష్టి
తే. నతినిదాఘోగ్రసమయంబునందు నిఖిల
జంతు సంతాపమడగించు చంద్రుమాడ్కి
నఖిల జగముల దుఃఖంబు లపనయించు
రూఢి నాతఁడజాత విరోధియగుచు.

- శ్రీ మదాంధ్రభాగవతము.

భగవంతుఁడు నిత్యుఁడు. ఆతని లీలలును నిత్యములే లీలోపకరణములును నిత్యములే, పార్షదులు నిత్యులు. అవతారములు నిత్యములు. అనిత్యములేవియును లేవు. సమస్తమును నిత్యమే; అన్నియును శాశ్వతములే. గుణ ప్రవాహ మనాదియైనది. శ్రీహరి ఖేలన మొనర్చును. విహారమొనర్చును ఈ రాచకంతములేదు. అవసానములేదు. దీనిలోఁ బ్రాచీనత లేదు. నిత్యనూతనముగ గోచరించును. శ్రీహరి యెన్నడును విసుగునుఁజెందఁడు. మరల మరల నాతఁదే క్రీడ మొనర్చు

చుండును. ఇందులో నసంభవమేమియును లేదు. అసంభవ శబ్దమేలేదు. అన్నియును సంభవములే. అదెట్లు జరిగినది, యిదెట్లు జరిగినదనువారు భ్రమలోఁబడినవారు. పొరపాటు పడినవారు. అదెట్లగును, ఎట్లుజరుగవలయునో అట్లు జరుగ వలయును. ఏది జరుగుచున్నదో అదియే జరుగవలెను ప్రశ్నయే లేదు.

శివశర్మయొక్క అయిదవపుత్రుఁడు సోమశర్మ మర ణించి యసుర యోనియందేల బ్రహ్లాదుఁడుగ జనించినాఁడు? శ్రీహరి వానితండ్రిని దేవాసుర సంగ్రామములో నేలనెట్లు చంపి నాఁడని శౌనకుఁడు ప్రశ్నింపఁగా సూతుఁడిట్లనెను:- మును లారా! సంస్కారమే ప్రధానము; సోమశర్మయొక్క తండ్రి అమృతకుంభమును దనదగ్గఱనుంచి తీర్థయాత్రకుఁ బోయి నప్పుడాతఁడు నిరంతరమిట్లు చింతించు చుండెడువాఁడు. ఈ యమృతముకొఱకేగదా దేవాసురులు ఘోరసంగ్రామ మెనరించుకొనినది! భగవానుఁ డసురుల కెంతటి యన్యాయ మెనరించినాఁడు. మోహినీరూపమును ధరించి యసురుల కమృతము లేకుండఁజేసినాఁడు, ఈ దేవతలెట్టి స్వార్థులు? వీరు తమ ప్రయోజనమును నెఱవేర్చుకొనవలసి వచ్చినపుడు బులి బుచ్చికపు మాటలను మాటలాడుచుందురు. ప్రయోజనము నెఱవేరిన తరువాత నిఁక మాటలాడనే మాటలాడరు. మా యన్న యమృతమును గొనివచ్చుటకు స్వర్గమునకు బోయి నపుఁ డింద్రుఁ డూర్వసిని బంపి యెన్నో విఘ్నములను గలి

గించెను." ఈ విధముగ నాతఁడమృతమునుగూర్చి యోచించు చుండెను. మానవునియాలోచనమే దానికి ప్రార్థనము. ఎవఁ డెట్లు నిరంతరము చింతించుచుండునో అట్లేయగును. ఈ లోకములో నేస్థితినిఁబొందుదురో పరలోకమందదే స్థితి కలగును. నిరంతర మిచ్చట పాపమును జింతించుచుండిన బాపలోకములకుఁ బోవుదురు. పుణ్యవిషయములను జింతించు చుండిన స్వర్గాది పుణ్యలోకములకుఁబోవును. నిరంతరము వైకుంఠ భగవానుని పూజార్చనలనుగూర్చియే చింతించు చుండిన నాతని సుమధుర నామములను గీర్తించుచుండిన నాతఁడు వైకుంఠలోకమునకుఁబోవును. భావమే భవమునకుఁ గారణము, భావానుసారముగనేస్థితియుండును.

శివవర్మ యీ లోకమును ద్యజించి వైకుంఠవాసి కాఁగానే ఆతని పంచమ పుత్రుఁడు సోమవర్మ పరమ పుణ్య ప్రదమగు సాలగ్రామ క్షేత్రమునకుఁబోయి ఘోరతపస్సు చేయసాగెను. తపమున నాతనికిఁ జాలవర్షములు గడిచెను. ఇప్పుడాతనికి మరణకాలమాసన్నమయ్యెను. దైవయోగముచే నదేసమయమున కసురసేన అచ్చటికి వచ్చెను, అతఁడ నిరంతరము దేవతలను గొట్టుఁడు, నఱకుఁడు, పట్టుకొనుఁడు పోనీయవలదను భయంకర క్రోధయుక్తములగు శబ్దములను బలుకుచుండెను. పూర్వజన్మ సంస్కారవశముచే నాతని జ్ఞాన ధ్యానములన్నియును మఱపునకు వచ్చెను. "అంతే యామతిః సాగతిః అను సామెత కలదు. అంత్యకాలమున దేనిని స్మరించి

ప్రాణములను విడుచునో జీవునకదే గతిప్రాప్తించును. దైత్యుల భయమువలన నాతని ప్రాణము దైత్యభావమును బొందెను. అట్టి స్థితిలో నాతనికి మరణము సంభవించెను. అందువలన హిరణ్యకశిపుని భార్యయగు గమల కడుపునఁబుట్టెను. పూర్వ జన్మ సంస్కారము లెచ్చటికినిఁబోవు. ఈ జన్మమందును మాతాపితృ భక్తుడయ్యెను. తల్లి దండ్రులీతని శీల, స్వభావ సదాచారములకు సదా సంతోషించెడువారు. కాలాంతరమున నాతఁడు పెద్దవాడయ్యెను, ఆ సమయమున మరల దేవాసుర సంగ్రామము జరిగెను. ఈతఁడసురుల పక్షమున దేవతలను బోరఁబోయెను. ఈతఁడు తన బలపౌరుషములచే దేవతలను వేధించెను. చివరకు విష్ణువు తన చక్రముచే నీతని శిరస్సును ఖండింపఁగా మృత్యువు వాతఁబడెను."

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా ! ప్రహ్లాదుఁడు బాల్యకాలము నుండియును భగవద్భక్తుఁడనియును. కల్పపర్యంతము జీవించి దేవదానవుల కాధిపత్యము వహించుననియు నిది వఱలోఁజెప్పియుంటివి. ఇప్పుడు దేవాసుర సంగ్రామమున నాతఁడు భగవంతునిచేఁ జంపబడెనని చెప్పుచున్నావు. ఇది యెట్లు కుదురును.

ఇది విని సూతుఁడిట్లనెను :- "వినుఁడు స్వామీ ! నేనే దీనికినిఁగారణము చెప్పెదను. ప్రహ్లాదుఁడు భగవంతుని చేతిలో జావఁగా నప్పుడాతని తల్లి హిరణ్యకశిపుని భార్య కమల

మిక్కిలి దుఃఖించెను. ఆమె నిరంతర మాతని గుణములను, సత్స్వభావ స్వరూపములను స్మరించి యేడ్చుచుండెను. ఆమె ప్రహ్లాదునకధికముగఁ బ్రేమించెడిది. ఒక దినమునఁ దిరుగుచుఁ దిరుగుచు నారదుఁడు హిరణ్య కశిపుని అంతఃపురమునకు వచ్చెను. పుత్రశోక సంతప్తయగు కమలను గాంచగనే ఆతనికి మిక్కిలి దయకలిగెను. ఆతఁడామెను నోదార్చుచు నిట్లనెను :- "నీవు నీ పుత్రుని కొఱకు దుఃఖివకుము. నీ కుమారుఁడు మరల నీ కడుపున బుట్టఁగలడు. ఆతని రూపము, వర్ణము, స్వభావ మంతయును నట్లేయుండును. ఆతని పేరును బ్రహ్లాదుఁడనియే యుండును. కేవల మీసారి ఆతని యందసుర భావముండదు, ఆతఁడు పరమ వైష్ణవుఁడగను, సాధు స్వభావుఁడగను, దేవ బ్రాహ్మణ భక్తుఁడుగను, భగవంతున కనన్యోపాసకుఁడుగను, బరమ యశస్విగ నుండఁగలడు. వాని వలన మీకు ఖ్యాతి లభింపఁగలదు." ఈ విధముగ నచ్చఁజెప్పి దేవర్షియగు నారదుఁడు బ్రహ్మలోకమునకుఁ బోయెను. కాలాంతరమునఁ బ్రహ్లాదుఁడు మరలఁగమల గర్భమున జన్మించెను. ఈసారి యాతఁడు పరమశాంతుఁడుగను, దేవతలకు మించిన పరమ సాత్త్విక స్వభావుఁడుగనుండెను. నారదుఁడుల్లేఖించిన గుణములన్నియును నాతనిలో నుండెను. ఈ ప్రహ్లాదుఁడే తర్వాత నింద్రుఁడయ్యెను."

శౌనకుఁడిది విని యిట్లనెను :- "సూతా ! నీ కథనము లోఁజాల విరుద్ధ విషయములు కనఁబడు చున్నవి. ఇదివఱకు

నీవు హిరణ్యకశిపుని భార్య పేరు కయాదువంటివి. ఇప్పుడు కమలయని చెప్పుచున్నావు. బ్రహ్మాది దేవతలును, శుక్రాచార్యాది మునులను గలిసి ప్రహ్లాదుని దైత్యసింహాసనమున కభిషిక్తుగా నాచరించిరని యిదివఱకు చెప్పితివి. ఇప్పుడాతఁడింద్రుఁడయ్యె నని చెప్పుచున్నావు. ఈ పరస్పర విరుద్ధ వాక్యములెట్లు చెల్లును ?"

అంత సూతుఁడు గంభీరుఁడై యిట్లనెను :- "స్వామీ ! ఈ ప్రపంచములోని గుణప్రవాహ మనాదియైనది. దీని కాద్యంతములు లేవు. ఇట్లే జరుగుచుండును. చాల కీటకములు దినమందెన్నో సారులు పుట్టుచుండును. ఎన్నో సారులు చచ్చుచుండును. మన మెనిమిది జాములను నొకదినముగ లెక్కింతుము. వానికది మహాప్రళయ సమానకాలమగును. మనము మూఁడు వందల అఱువది దినముల సమయమును నొక వత్సరముగ భావించెదము. పితరుల కదియొక పక్షము. దేవతల కదియొక దినము. కృత, త్రేత, ద్వాపర, కలియుగములు వేయి గడిచినచో నీ సమయమునకు పదునల్గురు దేవేంద్రులును, బదునలుగురు మనువులును మారిపోవుదురు. కాని యిది బ్రహ్మ కొక్క పగలు, ఇట్టి దినములు మూఁడువందల అఱువది గడచినచో బ్రహ్మకొక వర్షమగును. బ్రహ్మ యిట్లు నూఱు వత్సరములుండును. తర్వాత నింకొక బ్రహ్మాండ రచనము జరుగును. ఈ బ్రహ్మాండము విలీనమై పోవును. క్షీరశాయియగు

శ్రీహరియొక్క ఒక్క శ్వాసకు బ్రహ్మాండ ముత్పన్నమగును. ప్రశ్వాసకు బ్రహ్మాండము విలీనమగును. బ్రహ్మయువు నూఱు వర్షములు భగవంతునకు ఒక శ్వాసతో సమానము. అసంఖ్యాకములుగ సృష్టి, అయినది, అసంఖ్యాకములుగ సృష్టిజరుగును. దీనికి సంఖ్యలేదు, గణన లేదు. ఎన్నిసారులు ప్రహ్లాదుఁడు పుట్టినాఁడో ఎన్ని సారులు నరహరి యుద్భవించినాఁడో, ఎన్ని సారులు సృష్టి జరిగినదో, ఎన్నిసారులు ప్రళయమైనదో ఇవన్నియు నగణిత నసంఖ్యాకములు. ఇదంతయును భగవంతుని మాయ యనియును, నాతనికసంభవమైనదియును. నూతన విషయమున లేదనియును స్వామీ ! ఈ సమస్త చరిత్రముల యొక్క తాత్పర్యమేమనఁగా సదాసర్వదా హరిచింతన మొనర్చుటయే. తనను భగవంతుని యంత్రముగ భావింపవలయును. భగవంతుఁడు మనలను దన క్రీడలో నొక ఉపకరణముగఁ జేసికొననిండు. మనము సర్వథా ఆతని యిచ్ఛమీఁద నిర్భరులమై యుండవలయును. ప్రపంచములో నసత్యమైనది దేదియునులేదు. జరుగుచున్నదంతయును సత్యమే ఏలననఁగా స్వయముగ శ్రీహరి సత్యస్వరూపుఁడు. శివుని కార్య మశివమెట్లు కాఁగలదు ? కావున మునులారా ! భగవంతుని, భగవచ్చరిత్ర ములను నిత్యములని భావించి, వానిని శ్రద్ధాపూర్వకముగ శ్రవణము చేయవలయును. వానిలో నేవైనఁబరస్పర విరుద్ధ విషయములు వచ్చినచో వానినిఁ గల్పభేదమని తెలిసికొన వలయును.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! నేను మీ కత్యంత సంక్షేపముగ నృసింహ భగవానుని చరిత్రమును, బరమ భక్తుఁడగు బ్రహ్లాదుని భగవద్భక్తి వృత్తాంతమును జెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁదలఁచు చున్నావు."

-() () ()-

# నృసింహ చరిత్ర సమాప్తి

౪౯౬

శ్లో॥ ఏతద్య ఆది పురుషస్య మృగేంద్రలీలామ్
దైత్యేంద్ర యూథపవధం ప్రయతః పఠేత ।
దైత్యాత్మజస్య చ సతాం ప్రవరస్య పుణ్యమ్
శ్రుత్వానుభావమకుతోభయ మేతి లోకమ్॥

- శ్రీ భాగ. ౭ స్కం. ౧౦ అ. ౪౭ శ్లో॥

ఉ॥ శ్రీరమణీయమైన నరసింహ విహారము నింద్రశత్రు సం
హారము బుణ్యభాగవతుఁడైన నిశాచర నాథ పుత్ర సం
చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁబఠించినన్ శుభా
కారము తోడ నేభయముఁ గల్గనిలోకముఁజెందు భూవరా॥

- శ్రీమదాంధ్ర భాగవతము.

జీవితముయొక్క ముఖ్యఫలము భగవంతునియందను రాగము. భక్తులు భగవంతుని యందనురాగముంచి భగవంతుని కంటె నుచ్చపదవిని బొందిరి. అందువలననే భగవంతుడు "అహం భక్తపరాధీనః" నేను భక్తపరాధీనుఁడనని పలికినాఁడు. భక్తసేవకు సంతుష్టినిఁ జెందినట్లు భగవంతుఁడు తన సేవ కంతగా సంతసింపఁడు. భగవంతునిఁ బ్రసన్ను నొనర్చుకొనుటకు భగవచ్చరిత్ర లుపయోగించిన దానికంటె భాగవత చరిత్ర లధిక యుపయోగకారిగా నుండును. భక్తుల చరిత్రలలో భగవానుని కృపాళుతయును, భక్తవత్సలతయును వర్ణింపఁబడి యుండును. కావున వినఁదగిన చరిత్రలు హరిచరిత్రలో హరిదాస చరిత్రలో రెంటికిని బరస్పర అనోన్యసంబంధము కలదు. భక్తులు లేక భగవచ్చరిత్రలుండవు. భగవంతుఁడు లేక భక్త చరిత్రలును లేవు. అవతార చరిత్రలో భక్తులయొక్కయు, భగవంతుని యొక్కయు చరిత్ర సూత్రములో మాల గుంఫితమైనట్లు గుంఫిమగును.

నారదుఁడు యుధిష్ఠిరునితో నిట్లు చెప్పుచున్నాఁడు :- "రాజా ! నేను నీకు బ్రహ్లాద చరిత్రమును జెప్పితిని. దీనిలో ముఖ్యముగ భక్తి మహత్వముకలదు. ఇంకను హిరణ్యకశిపు తన సంబంధుల కొసంగిన జ్ఞానవర్ణనము కలదు. ఆతని ఘోర తపస్సు, విచిత్ర వరములు. దిగ్విజయము త్రైలోకాధీశ్వరుఁడగు కథలు కలవు. తదనంతరము మహాభాగవంతుఁడగు బ్రహ్లాదుని శీలస్వభావము, ఆతని భగవద్భక్తి. గురుగృహమున

జదువుటయును, తండ్రి సమ్ముఖమున భగవద్గుణాను వాద కథనము, దీనికిఁ గ్రుద్ధుఁడై హిరణ్యకశిపుఁ డాతని నానా యాతనలు పెట్టుటయును, మరల గురుపుత్రులు చెప్పఁగా గురు గృహమునకుఁబోయి చదువుటయును, దైత్యబాలకులకు భగ వద్భక్తి నుపదేశించుటయును, దీనికిఁ గ్రుద్ధుఁడై తండ్రి యాత నిని బిలిచి వృత్తాంతమడుగుటయును జెప్పితిని."

ప్రహ్లాదుని భక్తిచే స్తంభమునుండి భగవంతుఁడు ప్రకట మగుటయు; దైత్యుని వరములను రక్షించుచు నాతని పొట్టను జీల్చి చంపుటయును, దేవతలొనర్చిన స్తుతియు, ప్రహ్లాదునిపై నృసింహ భగవానుఁడు చూపిన యనుకంపయునుఁ ఆతని స్తుతిని భగవానుఁడు వరములను గోరుకొనమని బలవంత పెట్టు టయు, ప్రహ్లాదుఁడు విద్వేషియగు తండ్రికి ముక్తినొసంగుఁడని యాచించుటయును, మొదలగు ప్రసంగముల వర్ణనము కలదు. రాజా! ప్రహ్లాదుని వంటి భక్తుఁడు పరమ దుర్లభుడు, ఆతని యెడల భగవానుఁడెట్టి కృపను జూపినాఁడో చూడుఁడు."

ఇది విని ధర్మరాజగు యుధిష్ఠిరుఁ డిట్లనెను :- "ప్రభూ! ఇంతగా భగవత్కృపను బడసిన మహాభాగవతుఁడగు ప్రహ్లా దుఁడతి భాగ్యవంతుఁడు ఆతనిని భగవంతుఁడు తనవడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని ప్రేమించినాఁడు."

ఇది విని నారదుఁడు నవ్వి యిట్లనెను :- "రాజా! నీవు ప్రహ్లాదునిఁ బొగడు చున్నావు. కాని నీ సౌభాగ్యమును గూర్చి యేమియును జెప్పుకొనవు."

ధర్మరాజు మార్మిక వేదనాస్వరమున నిట్లనెను :- "స్వామీ : నా సంగతి యేమని చెప్పఁగలను. నాకు భగవచ్చరణములయందు చిత్తము నిలువనే నిలువదు. ఈ రాజ్య, గృహ, కోశ, సేనాదుల మీఁదనేమనస్సు తగుల్కొనియున్నది.

నారదుఁడు విని నవ్వుచు నిట్లనెను :- "మహారాజా ! ప్రపంచములో నిన్నుమించిన భాగ్యశాలి యింకెవరున్నారు ? ప్రహ్లాదునకు భగవంతుడు సగము నరుఁడుగను, సగము సింహముగను భయంకరాకృతితో దర్శనమొసంగినాఁడు, కాని నీకు నవనీత కోమలాంగుఁడును, నవజలధరాభ శరీరుఁడును, సౌందర్య మాధుర్య సాకార స్వరూపుఁడునునై దర్శన మొసంగుచుఁ దిరుగుచున్నాఁడు."

ప్రహ్లాదునకు క్షణకాలము దర్శనమొసంగి అంతర్హితుఁడైనాఁడు. నీ కాతఁడు సదా నీ గృహములో నివసించుచున్నాఁడు. ప్రహ్లాదున కాతడు స్వామియై ప్రకటమైనాఁడు. నీకో శ్రీకృష్ణుఁడు సుహృదుఁడు, సంబంధి, మంత్రి, సఖుఁడు, సారధి, దూత, సేవకుఁడు, భృత్యుఁడు స్వామి, సర్వస్వమై యున్నాఁడు. నీ కల్పములో నత్యల్పమగు కార్యమును, అధికములో నత్యధికమైన కార్యమును జేయుటలో సంకోచింపఁడు నీకు గృహచింత కలదనుచున్నావు. నీ గృహమిప్పుడు గృహముకాదు. ఓ రాజా ! ఇది యిప్పుడు ప్రభుపాద బద్మములు పడుటచేఁ బరమ పావన తీర్థమైనది. కాకున్న నిందఱు త్యాగులును విరాగులును భగవద్భక్తులును, ఋషులును మునులును

సదా నీవాఁట నేలఁబడి యుందురు. రాజా! ఇది ప్రభు పాద పద్మముల ప్రభావము. ఏ మునుల యొక్క దర్శనముచే మానవులు తమ్ముఁ గృతార్థులుగా భావించుకొందురో అట్టివారు నల్దిక్కులనుండియుఁ బరువిడురీతిగా నీ యింటికి వచ్చుచున్నారు. నదులు సముద్రము లోనికి వచ్చినట్లు వచ్చుచున్నారు. నీయిల్లు ముక్తికి కేంద్రము. నిన్ను మించిన భాగ్యశాలి యీ జగత్తున నెవరున్నారు? నీకెల్లప్పుడును సాకార బరబ్రహ్మ సాక్షాత్కరించు చున్నాఁడు గదా."

మ. జలజాత ప్రభవాదులున్ మనములోఁజర్చించి భాషావశిం
బలుకంలేని జనార్దనాహ్వయ పరబ్రహ్మంబు నీయింటిలోఁ
జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా
ఫల సంధాయకుఁడై చరించుటలు నీభాగ్యంబు రాజోత్తమా॥

-శ్రీమదాంధ్ర భాగవతము.

యుధిష్ఠిరుఁ డిట్లడిగెను :- "స్వామీ! బ్రహ్మకాకారము లేదు. అది నిర్గుణము, నిరాకారము, నిర్లేపము, నిరీహము"

నారదుఁ డిట్లనెను :- "మహారాజా! అది సత్యమే. బ్రహ్మ నిర్గుణము, నిరాకారము, నిర్లేపము, నిరాకారుఁడు సాకారస్వరూపమును ధరించినాఁడు. నిర్లేపుఁడు భక్తుల కార్యములందు విప్తుఁడైనట్లు కనఁబడును. నిరీహుఁడయ్యు నానావిధ కర్మ లొనర్చినట్లు కనఁబడును. రాజా! ఇదిగో నీ ప్రక్కనఁ

గూర్చుండిన నీతడే సాకారబ్రహ్మ లక్షల సంవత్సరములు సమాధిలోనుండ యోగిజన మీతనినినే వెదుకుకొను చుందురు. ఈతడు పరమానంద స్వరూపుడు. ఉపాధిరహితుడు. స్వయముగ సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడు. నీ వీతనిని నీ మాయయగు వసుదేవ పుత్రునిగ దలంచుచున్నావు. నీవందఱకంటె నెవరినెక్కుడుగ నాదరించుచున్నావో, ఇప్పుడే సర్వశ్రేష్ఠుడని అగ్రపూజను గావించితివో ఈ జగద్గురుడగు శ్రీకృష్ణుడే సర్వాత్ముడు, సాకారబ్రహ్మ. నీకు మించినభాగ్యశాలి యెంకెవడున్నాడో యిప్పుడు చెప్పుము."

గద్గద కంఠముతోడను, ప్రేమభరిత హృదయముతోడను, కన్నులనీరునిండిన తృషితనేత్రములతో జూచుచు ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! నేనీ ప్రభువుయొక్క యధార్థ రూపము నెఱుంగను. అజ్ఞాన వశమున నేనీతని నాసుహృదుని గను, సంబంధిగను బూజ్యతమునిగను గురునిగను దెలిసికొనుచున్నాను."

ఇది విని భక్తిభావముతో నారదుడిట్లనెను :- "రాజా ! నీవే మనుకొనుచున్నావో నింక నధికముగనైయున్నాడు ఆయన కంటె నింకనధికులెవరో నేను మాత్రమెఱుగను నేనెఱుగక పోవుటేమి త్రిపురారియగు శంకరుడును నెఱుగడు. నా తండ్రి యగు బ్రహ్మయు నెఱుగడు సరియే రాజా । ఈ విశ్వేశ్వరుని చరణకమలములకు మన ప్రార్థన మేమనగా మన మొనర్చు నింద్రియ దమనము, మౌన, స్వాధ్యాయ, జప, తపములకు ఫలముగ నీభక్త ప్రతిపాలకుడు మనయెడల బ్రస

న్నుఁడగుటయే. ఈతఁడెవరియెడలఁ బ్రసన్నుఁడగునో వారి దుఃఖముల లన్నియును దూరముకాగలవు, మయాసురుని మూలమునఁ బ్రపంచ మందలి సకల ప్రాణులును, శంకరుఁడును జింతించెను. ఆతఁడీతని యుక్తిచే దానిని నివారించి త్రిపురారి, త్రిపురాంతకుఁడను బేరును బొందినాఁడు."

ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! సదాశివుఁడగు శంకరుఁడీ ప్రభుకృపచేఁ ద్రిపురారియని యెట్లు పిలువఁబడినాఁడు. ఆ కథను నేను వినఁగోరుచున్నాను, కృపతోఁ జెప్పుఁడు;"

నారదుఁడిట్లనెను :- "మంచిదిరాజా ! చెప్పెద వినుము."



# త్రిపుర విజయ వృత్తాంతము

౪౯౦

శ్లో॥ ఏవం విధాన్యస్య హరేః స్వమాయయా
విడంబమానస్య నృలోకాత్మనః ।
వీర్యాణి గీతా న్యృషిభిర్జగద్గురో
ర్లోకాన్పునానాన్యపరం వదామి కిమ్॥

- శ్రీ భాగ. ౭ స్కం. ౧౦ అ. ౭౧, శ్లో॥

క. ఏకర్మంబున విభుఁడగు
శ్రీకంఠుని యశము మయునిచే సుడివడియెన్
వైకుంఠుఁడెవ్విధంబునఁ
గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్.

శ్రీ మదాంధ్రభాగవతము.

భగవంతునకు మూఁడు రూపములు. సృష్టిచేయునపుడు బ్రహ్మయని పిలువఁబడును. పాలనసమయమున విష్ణువు. సంహార సమయమున శివుఁడు. ముగ్గురకు నేమియును భేదము లేదు. తేడా లేదు. హెచ్చుతగ్గులులేవు. అయినను ప్రభువు లీల కొఱకు వేఱువేఱుగా ననేకరూపములను ధరించి విచిత్ర క్రీడ లొనర్చు చుండును. ఒక్కొక్కప్పుడు శివుని నిష్టదైవముగ భావించి ఆతని బూజించును. ఇంకొకమారు తానే యిష్టదైవమై పూజలను గ్రహించును. ఒక్కొక్కప్పుడు మోసముచేదాయవల దని యుపదేశించును. మఱియొకసారి తాను మోసమొనర్చి శత్రు సంహారమొనర్చును. ఆ మాయావి యొక్క విచిత్ర మాయ నెవరు తెలిసికొనఁగలరు. దాని సారమును దెలిసికొనిన వారెవరున్నారు ? ముగ్గురును నాతని రూపమే యైనప్పటికి బ్రహ్మరూపము కార్యవ్యస్తతను జెందియుండును; అతనికి సృష్టి నిఁజేయు కార్యమే. అతనికి రాత్రింబవళ్ళు సృష్టియెట్లు వృద్ధి యగునా యను చింతయే యుండును. త్రిపురారి భోళాశంక రుఁడు. ఎవరే వరమునడిగిన దాని నొసంగును. ఎవఁడైన నను

నయవినయము లొనర్చెనా నీకిష్టము వచ్చిన వరములను గోరు
కొమ్మనును. ముందువెనుకలు చూడనే చూడఁడు. దీని పరిణామ
మేమ్యో యను చింత లేనేలేదు. అడిగినది లేదన కిచ్చుచుండును.
కాని యీ చతుర్భుజ భగవానుఁడు మిక్కిలి నేర్పరి. ఈతఁడు
మాయలు పన్నును. గొప్ప గొప్ప మాయావులుకూడ నాశ్చర్య
చకితులగునట్లద్భుత మాయలొనర్చును. ఆతని మాయ అపరం
పారము. ఈతనికి మత్స్య, కచ్ఛప, సూకర, సింహాది రూప
ములగుటకు సంకోచము లేదు. దండకడియములు గాజులును
ధరించి పైఁట ముసుఁగులను వైచుకొని స్త్రీయగుటకు సిగ్గును
జెందఁడు. ఎప్పుడేది కావలసివచ్చిన నది యగును. ఒక్కొక్క
ప్పుడు ధర్మరూపమున నెద్దగును. మఱియొకసారి గోరూపమును
ధరించును. బహురూపములు ధరించు కృష్ణుఁడెవరినిఁ గృపఁ
జూచినాఁడో వానికి మాయాబంధనమెట్లుండఁగలదు ! మాయా
పతి నాశ్రయించినప్పుడాతని కనుసన్నల మెలఁగు మాయ
భక్తులనేమి చేయఁగలదు ?

మయాసురుఁడే కారణమున విశ్వనాథుఁడగు బోలాశంక
రుని సుయశమును నాశమొనర్చినాఁడు ? అప్పుడీ కంసహారి
యగు కృష్ణుఁడెట్లాతనికమనీయకీర్తిఁని దిగ్దిగంతముల వ్యాపింపఁ
జేసినాఁడని ధర్మరాజడుగఁగా నారదుఁడిట్లనెను :- "రాజా !
వినుము. నేను నీకీ మనోహర కథను జెప్పెదను. నీవు దత్త
చిత్తుఁడవై వినుము."

మహారాజా ! దేవాసురులకు స్వాభావిక వైరమను

సంగతి నీకు దెలిసినదే. విజ్ఞానియు, జ్ఞానియు, ధ్యానియునగు బృహస్పతియంతటి వానిని గురువుగాఁగలిగిన దేవతలును వైరమును వీడనప్పుడు స్వభావము దుస్త్యజమను సంగతి సిద్ధాంతమగుచున్నది. పోరాడుట తగదని భగవానుఁడెంతో చెప్పెను; కాని చేయునదేమున్నది? పోరాడించువాఁడు భగవానుఁడే కదా! ఒక్కొక్కప్పుడు దేవతల పక్షము వహించి అసురుల నోడించును; ఒక్కొక్కప్పు డసురులకు బలమొసంగి దేవతల నోడింపఁజేయును. ఇద్దరకును బలమొసంగువాఁడా మాయాపతిమే, ఒకానొకప్పుడు దేవాసురులకు ఘోరయుద్ధము జరిగెను. దైత్యులు మిక్కిలి సాహసముతోడను. నుత్సాహముతోడను దేవతలతోఁబోరెను; కాని కాలము వారి కనుకూలముగ లేదు. యుద్ధమందోడి వారు యుద్ధము నుండి పాఱిపోయిరి. విజయశ్రీ దేవతలను వరించెను. యుద్ధమున నోడిన దైత్యులకు చాల దుఃఖము కలిగెను. వారు దేవతల నోడించు నుపాయమును వెదుకసాగిరి. ఆ దినములలో మయుఁడను దానవుఁడు భగవదారాధనము కావించి, అనేక విధములగు మాయలను రచించు వరములను బొందెను మాయలను బన్నుటలో నాతఁడు ప్రవీణుఁడు. ముఖ్యులగు నసురులందఱును గలిసి మయాసురుని సమీపమునకుఁబోయిరి.

ప్రధాన ప్రధానులగు దైత్యులు తన సమీపమునకు వచ్చుటను గాంచి మయాసురుఁడు వారందఱకును స్వాగత సత్కారములొసంగి నమ్రతతో నిట్లనెను :- "సమ్మాననీయ

అసురులారా ! మీరు ధనమందును, పదవియందును ప్రతిష్ఠ యందును జ్యేష్ఠులును శ్రేష్ఠులునై యున్నారు. మీరీ దీనుని యందెట్లు కృపఁజేసితిరి ? నావల్ల నేదైన సేవలభింపవలయు ననినఁ జెప్పుఁడు."

అసురులిట్లనిరి :- "నీవు శిల్పవిద్యలో విశ్వకర్మకు మించినవాఁడవు. మాయలో నిన్ను మించిన వాఁడెవఁడును లేఁడు; కాని నీమాయచే మాకేమి లాభము ? కులపరివారము నకును, జ్ఞాతిబంధువులకును గాని విద్యవలన నేమి లాభము?"

మయాసురుఁ డిట్లనెను :- "అసురులారా ! మీకేమికావల యునో నాకాజ్ఞాపింపుఁడు. మీబాధయేమీ నాకు తెలియవలయును గదా !"

ఇది విని యసురులిట్లనిరి :- "ఈ దేవతలు మమ్ముల నెల్లప్పుడును నోడించుచున్నారు. మనము వారిపైఁ బ్రహార మొనర్చునట్లును, వారు మనపైఁ బ్రహార మొనర్పజాలనట్లును నేదైన నుపాయమును జూడవలయును."

ఇది విని మయాసురుఁడిట్లనెను :- "అసురులారా ! మీరు నిశ్చింతగానుండుఁడు. నేనున్నంతవరకు మీపై నెవరును బ్రహారమును గావింపఁజాలరు. మిమ్ములను బరాజితులఁ గావింపఁ జాలరు."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇట్లు పలికి మాయావు లలో శ్రేష్ఠుఁడగు మయాసురుఁడు మూఁడద్భుతపురములను నిర్మించెను. అందులో నొకటి సువర్ణపురము. రెండవది రజత

పురము. మూఁడవది లోహపురము మూడును నందముగను సుదృఢముగను గట్టఁబడినవి. యందును యుద్ధోపయోగ కరములగు సమస్తాస్త్రాద్యుపకరణము లుంచబడినవి. ఆ మూఁడు పురములును నాకాశమున నెగురుచుండును. అవి యెవ్వరికినిఁ గనఁబడవు. వాని గమనా గమనములు రహస్యముగనుండును. దానిలో రహస్యముగనున్న యసురసేనాపతులు ఇంద్ర వరుణ, యమ, కుబేరాది లోకపాలుర పురముల మీఁదకుఁబోయి అస్త్ర శస్త్రముల వర్షమును గుఱిపించుచుఁ బాఱిపోవుచుండెడివారు. దేవతలకుఁ గనబడినచో వారి నెదుర్కొనెడి వారు, వీరి మాయా యుద్ధమున దేవతలు మిక్కిలి దుఃఖితులైరి.

అందఱును గలిసి యొక సభజేసిరి. దానిలో చాల కాలమువఱకు వాద వివాదము నీ విషయమున నేమి చేయవలయునను విషయముపై జరిగెను. బ్రహ్మకడకు పోవలెనని మఱి యొకరనిరి.

అంతఁ గుబేరుఁడిట్లనెను :- "బ్రహ్మకు దేవతలెంతో అసురులంతే. మనము వారికి పౌత్రులము. ఆయన యుద్ధమును జేయనేచేయఁడు మనమందఱమును గలిసి దేవాదిదేవుఁడగు మహాదేవునికడకుఁబోఁవుట మంచిదని నాయభిప్రాయము. ఆతఁడే దేవతల పక్షమును వహింపఁగలఁడు. ఆతనికి నా మీఁదఁ గృపకలదు. అయోగ్యుఁడనైనను నన్నాతఁడు మిత్రునిఁగ భావించును,"

ఈ విషయము నందఱును సహర్షముగ నంగీకరించి, అందఱును గలిసి కైలాసాధి నాథుని కడకు గైలాసమునకుఁ బోయిరి. శంకరుఁడు వటవృక్షము కిందఁగూర్చుండి సనకాది సిద్ధులకు బ్రహ్మజ్ఞానోపదే మొనర్చుచుండెను. దేవతలందఱును బోయి శంకరుని విధ్యుక్తముగఁ బూజించి స్తుతించిరి. శంకరుఁడు ప్రసన్నుఁడై యిట్లడిగెను :- "లోకపాలులారా ! నేఁడే కారణమున నా దగ్గఱకు వచ్చిరి. మీరింత భయభీతులై తిరేల ? మీరింతగా నే కారణమున స్తుతించుచున్నారు. మీ దుఃఖ కారణమును నాకుఁ జెప్పుఁడు. నా సమీపమునకు రాఁగానే నా దుఃఖమంతమైనదని భావింపుఁడు."

శివుని యిట్టి యాశ్వాసన పూర్ణములగు వచనములను విని దేవతలత్యంత ప్రసన్నులై యిట్లనిరి :- "ప్రభూ ! మీరు మాకు ప్రభువులు, రక్షకులు, భయత్రాతలు మీ సహాయమువనే మేము సదా అసురులను బరాజితుల నొనర్చుచున్నాము. కాని దీన బంధూ ! ఇప్పుడసురులధికముగ మాయను బన్నిరి. వారాకాశమార్గమున నెచ్చటనో దాగి బాణముల వర్షమును గుఱుపించున్నారు. వారు యస్త్రశస్త్రములచే మాకు క్షతినిఁ గలిగించుచున్నారు. కాని మేము వారినిఁ జూడఁజాలక పోవుటచేఁ బ్రహారమొనర్పఁ జాలకున్నాము. దీనిచే మాకు చాల హానికలుగుచున్నది. ఈ సంకటమునుండి మమ్మునెట్టులైనను రక్షింపుఁడు."

దేవతలు యొక్క యీ దినవచనములను విని దీనదయాళుఁడగు శివుఁడు వారిని నిర్భయుల నొనర్చుచు నిట్లనెను:-

"దేవతలారా ! భయపడవలసిన పనిలేదు. నేను మయాసుర నిర్మితమగు నా త్రిపురములను నాశము గావించెదను. మీరే విధముగను. జింతింపకుఁడు."

ఇట్లు పలికి కామారియగు కైలాసనాథుఁడు తన దివ్య ధనస్సును దీసికొని బాణములను బాశుపతాస్త్రముచే నభిమంత్రిత మొనర్చిమయరచితములగు బురముల నుద్దేశించి వాని నాకాశ మునకు వదలఁగానే అవి ఒకటి కనేకములై ఒక్క సూర్యుని నుండి అనేక కిరణములు బయలుదేరినట్లు పోయి తగిలెను. ఆ బాణములా పురములోని యసురులకుఁదగులఁగానే పండి పండ్లు లాలినట్లు వారు నిష్ప్రాణములై క్రింద పరిడి

శివుఁడు తన మాయనంతను వ్యర్థము కావించినాఁడని మయుఁడు తెలిసికొనెను. ఆతఁడును మిక్కిలి తెలివిగలవాఁడు. ఆతఁడిదివఱకే ఒక పురమందమృత కూపమును నిర్మించెను. చచ్చిన యసురలను నాయమృత కూపమునఁబడవేయుచుండిరి. వారికమృత స్పర్శ తగులఁగానే అందఱునుజీవితులగుచుండిరి. ఈ విధముగ నసురులు చావకుండిరి. శివుఁడొక్కసారి చూచెను, రెండుసార్లు చూచెను. ఆతఁడు చిక్కులోఁబడెను. ఇప్పుడే యీ యసురులు చచ్చి క్రింద బడిరి కదా అప్పుడే యెప్పుడు జీవుతులై లేచినారు. ఒకవేళ నందఱు నాకే యాకృతిలో నుండుటచే భ్రమకలిగినదేమో ననుకొనెను మరల వేల కొలది మందిని పడగొట్టెను మరుక్షణమందే వారా సిద్ధామృత సంస్పర్శముచే వజ్రసమానమైన సుదృఢ శరీరులును, నత్యంత

తేజస్వులునై సమ్ముఖమున నిలుచుండిరి. మేఘమాలమధ్య మెఱుపుతీగలవలె వారాకాశమున మెఱయుచుండిరి ఇందేదో రహస్య మున్నదని యిందు ధరుఁడు గ్రహించెను. ధ్యానమునఁ జూడఁగా నిదియంతయును నమృత కూప ఫలమని తెలిసికొనెను. ఇప్పుడు శివుఁడేమి చేయఁగలఁడు ? ఆతనికి మిక్కిలి చింత కలిగెను దేవతలును గుసగుసలాడసాగిరి. ఒకానొకఁడిట్లనెను :- "శివుడెన్నటికినిఁ బరాజితుఁడగువాడు కాఁడు. ఈ యసురుల మాయచే నీతఁడును భగ్నసంకల్పుఁడై నట్లున్నాఁడు. శివుఁడు సంకోచ వశమున నేమియును బలుకకుండెను. నిరంతరము బాణవర్షమును గురిపించుచుండెను; కాని ఆతని బాణములు లక్ష్యభేదన మొనర్చుచున్నను వ్యర్థమగు చుండెను. ఇప్పుడు మహేశ్వరుఁడు మాయామహేశ్వరుఁడగు వాసుదేవుని సర్మించెను, హరిస్మృతి సర్వవిపద్విమోక్షణ మొసంగును. భగవంతుఁడు వెంటనే బ్రహ్మను బిలిచియిట్లనెను :- "విరించీ ! నేను గోవునగుదును."

బ్రహ్మ యిట్లనెను :- "స్వామీ ! గోవగుట యెందులకు అది నీకనురూపముగ లేదు గోవేషమును నబలయగు పృథివి ధరించును. కాఁదలచినచో నాబోతువు కండు."

భగవానుఁడిట్లనెను :- "అట్లు కాదయ్యా ! నాకన్నియు ననురూప రూపములే నేనే రూపమును ధరించినను బాగుగనే యుండును. స్త్రీ పురుష పశుపక్ష్యాదులన్నియును నారూపములే.

బ్రహ్మ యిట్లనెను :- "మీ యిష్టము స్వామీ ! అయితే నాకేమి యాజ్ఞ ?"

భగవానుఁడిట్లనెను :- నీవు దూడవు కమ్ము. బ్రహ్మ నవ్వి యిట్లనెను :- "స్వామీ ! నేను మీవత్సమునే కదా ! ఏ దూడగా నైనను జేముము."

భగవానుఁడు శీఘ్రముగ నిట్లనెను :- "మంచిది, ఇఁకఁ దొందఱపడుము. శివుఁడు భయపడుచున్నాఁడు. ఆతని చిత్తము మిక్కిలి యుద్విగ్నమైనది." అని పలికి భగవానుఁడు మిక్కిలి చక్కని గోవయ్యెను. బ్రహ్మవత్సమయ్యెను. తన మాయచే నాతఁడ మృతకూపమున్న మయపురమునకుఁ జేరుకొనెను. ఇంతటి సుందరమగు గోవెచ్చటినుండి వచ్చిన దాయని దైత్యు లనుకొనిరి. గోవు మిక్కిలి దప్పిక చెందినట్లుండెను. అది తన మందమందగతిచే సమృతకుండము వైపునకుఁ బోవు చుండెను. దాని దూడ కూడ చెంగనాలు త్రొక్కుకొనుచు దాని వెనుకఁ బోవుచుండెను. పోయి గోవు అమృతకుండమందు నోరు పెట్టెనుఁ చాటుగాకాదు అందఱును జూచుచుండఁగనే అమృతమును ద్రావసాగెను. నీరుద్రాగుచున్న గోవును వారిం చుట మిక్కిలి అధర్మము. భగవన్మాయావిమోహితు లగుటచే నసురులు శ్రీహరి యొక్క యథార్థరూపమును దెలిసికొనఁ జాలకుండిరి. అందఱిట్లనిరి :- "పాపము త్రాగనిండు, ఆవు దప్పిక చెందినది" కాని యిది సాధారణముగ దప్పిక చెందు గోవుకాదని వారికిఁ దెలియదు. అది జుట్టునిలాగుచు నమృత

పానమును జేయసాగెను. ఆ లాగుటలో నంతయు లోనికిఁ బోయెను. ఒక్క బిందువైన నందు మిగులలేదు. ఇంతలోనే మాయాసురుఁడిట్లనెను :- "అయ్యో ! మీరేమి చేసినారు."

రక్షకులగు నసురులు చేతులు జోడించుకొని యిట్లనిరి :- "ప్రభూ ! దప్పిక చెందిన గోవు, దీనిని నివారించుట మంచిది కాదనుకొంటిమి. కొంచెముగ నమృతమును ద్రావిననేమగును?"

నవ్వి మయాసురుఁడిట్లనెను :- "ఇది సాధారణ గోవు కాదు. ఇది అమృత కుండమునే కాదు సమస్త విశ్వబ్రహ్మాండమును ద్రాగి వేయఁగలదు. అన్నిటిని దనయుదరమునఁ బెట్టుకొనఁగలదు."

దుఃఖితులై దైత్యులిట్లనిరి :- "అయ్యో మేము మోసగింపఁబడితిమి. ఇప్పుడేమి చేయవలెను? అంతయును బాడైనదే"

సుఖదుఃఖములను సమానముగ భావింపఁగల మహాయోగియగు మయుఁడు నవ్వి యిట్లనెను :- "దుఃఖమేమి ? సుఖమేమి ? భగవన్నిర్ణయమున కన్యథావర్తించు సామర్థ్యమెవరికిఁగలదు ? ఆ ప్రభువేమి చేయఁదలఁచునే దానినేఁ జేయును. జీవుఁడు తన రక్షణ కనేకోపాయములను జూచుకొనునుఁ వివిధవిధముల సురక్షితముగను, నజరామరముగ నుండఁగోరును. కాని జీవుని విధానము సఫలముకాదు. భగవంతుఁడేది చేయఁదలఁచునో అదియే జరుగును. ఆతని విధానమున కన్యథా జరుగుసామర్థ్య మెవరికున్నది ?

అంత దైత్యులిట్లనిరి :- "నీవు గొప్ప మాయావివి నీ మాయచే నిట్టి యమృత కూపముల నెన్నిటినో నిర్మింపఁగలవు. ఇంకేదైన నుత్తమోపాయము నాలోచింపుము. నీవీ విధానమును వ్యర్థము గావించి, దీనికంటె నుత్తమమగు సురక్షిత పురములను నిర్మింపవచ్చును."

మయుఁడిట్లనెను:- "అసురులారా ! మీరనునదంతయును సత్యమే, కాని యాహరి మాయలో నాకు మించినవాఁడు. అతఁడు మాయకు స్వామి ఆతని మాయా సముద్రార్ణవములోని ఒక చిన్న బిందువు వంటిది నా మాయ. నా కొఱకును, నితరులకును, దైత్యులకును విధివిధానమును విధాత యెట్లు రచించినాఁడో దానిని వ్యర్థము గావింప నాకు సామర్థ్యములేదు. ఇంకొక యసురునకును లేదు దేవతలకునులేదు. బ్రహ్మకును లేదు ఇఁక గంధర్వ, మనుష్య, పశు, పక్ష్యాదుల విషయము చెప్పవలసిన దేమున్నది ?"

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇట్లు పలికి దైవగతినే ప్రధానముగ భావించి మయాసురుఁడు శోకింపలేదు, ఆతఁడు భగవద్విధానమని తెలిసికొని యుదాసీనుఁడయ్యెను. ఇప్పుడసురులు నిరుపాయులైరి అయినను వారు పాఱిపోలేదు. వారందఱును శివునితో యుద్ధమును జేయుటకై ఘోరముగఁ బ్రయత్నించుచుండిరి.

-() () ()-

శ్లో॥ ధర్మజ్ఞాన విరక్త్యృద్ధి తపోవిద్యా క్రియాదిభిః ।
రథంసూతం ధ్వజం వాహాన్ ధనుర్మర్మ శరాదియత్ ॥
సన్నద్ధోరథమాస్థాయ శరం ధనురుపాదదే ।
శరం ధనుషి సంధాయ మహూర్తేఽభిజితీశ్వరః॥

శ్రీ భాగ. ౭ స్కం. ౧౦ అ. ౬౬ ౬౭౬౮ శ్లో॥

వ. అంత విష్ణుండు నైజంబులైన ధర్మ జ్ఞాన, విద్యా, తపో, విరక్తి సమృద్ధి, క్రియాశక్తి విశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథసూత కేతువర్మ బాణాసనప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైగొని.

మ. శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై
సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై
పరమేశుండొక బాణమున్ విడిచెఁ దద్బాణానలజ్వాలలం
బురముల్గాలె ఛటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగాన్

శ్రీ మదాంధ్ర భాగవతము.

మనస్సే మయాసురుఁడు. సత్త్వరజస్తమస్సులే త్రిపురములు. దుర్గుణములే దైత్యులు. సద్గుణములే సురలు, దుర్గుణములు త్రిగుణ ప్రభావముచే విశేషించి రజస్తమావేశ మందు

సద్గుణముల నణఁచును. అప్పుడు వివేకరూపుఁడగు శివుని శరణమునకుఁ బోవుదురు; ఆతఁడు వైరాగ్యరూపమగు హరి లేక వైరాగ్యము ఒంటరిగా నేమి చేయఁగలదు ? త్యాగము ద్వారా తృష్ణారూపమగు సుధానరస్సింకింపఁ బడును, వాసనలను మరలమరల జీవింపఁ జేయునదియే తృష్ణ. వాసనాక్షయము కాఁగానే, తృష్ణానాశనము కాఁగా వైరాగ్యరూపమగు ధనుస్సునందు జ్ఞానరూపమగు బాణము నెక్కిడి లక్ష్యభేదన మొనర్చుచోఁ ద్రిపురములు దహింపఁబడును. జీవుఁడు త్రిగుణాతీతుఁడై శివస్వరూపుఁ డగును. ఇదియే త్రిపురదహనము యొక్క ఆధ్యాత్మికార్థము. యథార్థమగు నమృతత్వము త్యాగముచేతనే సంభవమగును.

ధర్మరాజగు యుధిష్ఠిరునితోఁ నారదుఁడిట్లనెను :-"రాజా మయాసుర నిర్మితమగు నమృతకుండములోని యమృతమును శ్రీహరి పానమొనర్చి, శివుని సమీపమునకుఁబోయి యిట్లనెను : "దేవాధిదేవా ! మహాదేవా ! ఇప్పుడు నీవు దివ్యరథమును నిర్మాణము కావించుకొని అసురులను జయించుఁడు అప్పుడు నీ విజయము నిశ్చితము."

భగవానుని యీ వాక్యములను విని శివుఁడాతని నభినందించి ధర్మముతో నొక రథమును నిర్మించెను. దానిమీఁద జ్ఞానమును సారథిగఁ గూర్చుండఁ బెట్టెను. అందమైన వైరాగ్య ధ్వజమునెత్తెను. ఐశ్వర్యమను నశ్వములను గట్టెను. తపమును

ధనుస్సుగాఁ జేసుకొనెను. విద్యారూపమగు గవచమును ధరించె
ను, క్రియారూపమగు బాణములను ధనస్సున సంధించెను.
ఈ విధముగ యుద్ధసామాగ్రిని బాగుగా నేర్పాటు చేసుకొని
ఆతఁడు త్రిపురవినాశము కొఱకుఁబోయెను. ఇది శివుని అధ్యా
త్మిక రథవర్ణము. కొన్నిచోట్ల నిట్టివర్ణనము కలదు. సముద్ర
వలయితమగు నీవసుంధరను రథముగఁ జేసుకొనెను.
సూర్యచంద్రులన్ను రథచక్రములుగఁ జేసుకొనెను. నాగరాజగు
శేషుని రథమునకుఁ గుఱ్ఱముగా జేసెను. ఇలా పత్ర, పుష్ప
దంపతులిద్దరను రథమునకు మేడికట్టిగాఁ జేసెను. తక్షకుని
మేడులను గట్టుతాడుగ నేర్పఱచుకొనెను. గంధమాదన వింధ్యా
చలములను రథమున కటునిటునుండు ధ్వజములుగ నేర్పాటు
చేసికొనెను. సమస్త ప్రాణములను రథపగ్గములుగ నొనర్చు
కొనెను. ఋగ్యజుస్సామాధర్వములను నాలుగు వేదములును
దానికి కట్టఁబడిన నాలుగు గుఱ్ఱములకుఁ గళ్ళెములు. ఓం కార
మును కొఱడాగా నొనర్చు కొనెను. గాయత్రీ సావిత్రులను
త్రాడుగా నొనర్చు కొనెను. బ్రహ్మను సారథిగా నొనర్చుకొని
నడుపుమనెను. సరిగా బ్రహ్మ ఆసాగరయగు వసుంధరా
రథమున సారథి స్థానమునఁ గూర్చుండి తోలుచుండెను.
శివుఁడా రథమునఁ గూర్చుండెను. మంధరాచలమును విల్లు
గను, వాసుకిని ధనస్సునకు నారిగను గట్టెను. సాక్షాద్విష్ణు

వును బాణముగఁ జేసుకొనెను. అగ్నిని బాణమునకు ములికిగను, వాయువును బాణపు రెక్కలుగను నొనర్చుకొనెను. యముని బాణపుచ్ఛముగను, విద్యుత్తును బాణపు పదునుగనుఁ మేరువును రథ ధ్వజముగను నిల్పెను. అట్టి దివ్యమును నసాధారణము నగు రథము నెక్కి శివుఁడు త్రిపుర వినాశమునకు బయలు దేరెను.

ఆ పురములు మూఁడింటికి నవివేత్వేర. గ నాశము కానట్లు బ్రహ్మయొక్క వరము కలదు. అవి ఆకాశమున వేఱువేఱుగఁ దిరుగుచుండును. వేయి సంవత్సరముల కొకసారి అవి కలి యును. మరల విడిపోవును. అందువలన శివుఁడు తన దివ్య రథమునఁ గూర్చుండి వేయి సంవత్సరములవరకు తపస్సు చేయుచుండెను. ఆ మూఁడును గలిసిన ముహూర్తమునందే తనదివ్య బాణములచే నా విచిత్రపురములను గాల్చి భస్మము గావించెను. అజేయములనఁబడు వానిని జయించెను. దుర్భేద్య ములనఁబడెడు వానిని భేదించెను. దురాధర్షములనఁబడువానిని ధర్షించెను."

నారదుఁడిట్లనెను ;- "రాజా ! ఆ విచిత్ర దుర్ధర్షపురము లను జయించుటచే శివునకుఁ త్రిపురాంతకుఁడు, త్రిపురారి, త్రిపుర వినాశకుఁడను పేర్లు ప్రసిద్ధము లయ్యెను. ఆతని యీ యద్భుతకర్మమును గాంచి సమస్త దేవతలు, పితరులు, ఋషులు, మునులు, యక్షులు, గంధర్వులు, గుహ్యకులు,

కిన్నరకింపురుషులు, సిద్ధులు మొదలగు వారందఱత్యంతా నందమును జెందిరి. హర్ష కారణమున నందఱును జయ జయ, నమోనమః సాధు సాధు అని శబ్దములు చేయసాగిరి. దేవాంగనలు నందన కానన కమనీయ కుసుమములను గుప్పలుగ వర్షించిరి. అప్సరసలాడిరి. గంధర్వులు పాడిరి. ఈ విధముగ భగవత్కృపచే భవుని కీర్తి ప్రపంచమున నక్షయమయ్యెను. ఆ భగవానుఁడు తన భక్తుఁడగు ప్రహ్లాదుఁడు దుఃఖించుటను గాంచి, ఆతని వచనములను సత్యమొనర్చుటకై స్తంభమున నవతరించెను. భక్తుని దుఃఖములను బోఁగొట్టెను. దేవతలను దన దర్శనముచేఁ గృతార్థుల గావించెను."

ఈ విధముగ రాజా ! నేనత్యంత సంక్షేపముగఁ బ్రహ్లాద చరిత్రమును జెప్పితిని, ఇప్పుడు నీవు నన్నేమియడుగఁ దలఁచుచున్నావు."

సూతుఁడిట్లనెను :- "మునులారా ? నారద ధర్మరాజుల సంవాదమును విని పరీక్షన్మహారాజు మిక్కిలి సంతసించెను. అనంతర మాతఁడు బ్రహ్మ పుత్రుఁడగు నారదుని నింక ననేక ప్రశ్నలడిగెను.

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా ! మేమీ ధర్మరాజ నారద సంవాదమును విని మిక్కిలి హర్షమును జెందితిమి. మహాభాగా ! సాక్షాద్ధర్మమూర్తి యగు యుధిష్ఠిరుఁడడుగుట యునుఁ భగవదవతారుఁడును. భూత, భవిష్యద్వర్తమాన విష

యముల నెఱిఁగినవాఁడు నగు నారదుఁడు చెప్పుటయును, ఇట్టి సంవాద సంబంధమున నికఁ జెప్పుట వ్యర్థము. ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు ప్రహ్లాదుని పావనచరిత్రమును శ్రవణమొనర్చిన తరువాత దేవర్షియగు నారదుని నేనేమి ప్రశ్నించినాఁడో ? నారదుఁ డేమి ప్రత్యుత్తర మొసంగినాఁడో ? ఈ విషయమును మాకుఁ జెప్పవలయును, ఈ సంవాదమును వినఁగా వినఁగా మాకు తృప్తి జనించుటలేదు."

ఇది విని సూతుఁడిట్లనెను :- "మునులారా ! మీరు దన్యులరు. ఏలననఁగా మీకు కథాశ్రవణమున విసుగుజనించుటలేదు. పైగాఁ ప్రతిక్షణమును నవీనోత్సాహముతో శ్రవణమొనర్చుటకు వ్యగ్రులై యున్నారు. ఇప్పుడిఁక ధర్మరాజగు యుధిష్ఠిరుఁడడుగఁగా నారదుఁడేమి యుపదేశించెనో దానినతి సంక్షేపమున మీకు దిగ్దర్శన మొనర్చెదను. దానిని మీరు సావధానులరై శ్రవణ మొనర్పుఁడు."

)o(

# ధర్మరాజ నారద సంవాద సమాప్తము

౨౦౦

శ్లో॥ ఇతి దేవర్షిణా ప్రోక్తం నిశమ్య భరతర్షభః ।
పూజయామాస సుప్రీతః కృష్ణంచ ప్రేమ విహ్వలః ॥
కృష్ణ పార్థావుపామన్త్ర్య పూజితః ప్రయయౌ మునిః ।
శ్రుత్వా కృష్ణం పరం బ్రహ్మ పార్థః పరమవిస్మితః ॥

- శ్రీ భాగ. ౭ స్కం. ౧౫ అ ౭౮ ౭౯ శ్లో॥

వ. అని యిట్లు నారదుండు సెప్పినవృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమ విహ్వలుఁడై వాసుదేవునిఁ బూజించె వాసుదేవధర్మనందనులచేతఁ బూజితుఁడై నారదమునియు దేవమార్గంబునం జనియె

- శ్రీమదాంధ్ర భాగవతము.

సనాతన వైదికధర్మమును వర్ణాశ్రమ ధర్మమనియు నందురు. ఏలననఁగా వైదిక ధర్మభిత్తి వర్ణాశ్రమధర్మము మీదనే అవలంబితమై యున్నది. వర్ణాశ్రమ వ్యవస్థలేనిచోట నార్యధర్మము లేనట్లే. అది మ్లేచ్ఛలేక అనార్యధర్మము. గుణ కర్మ స్వభావానుసారముగ చాతుర్వర్ణసృష్టి స్వయముగ శ్రీహరియే చేసినాడు కావున నిది యనాది. అయినను ఘోర సత్వమందు-ఆదికృతయుగ మందు; అట్లే ఘోరతపస్సునందు-కలియుగాంతమందు - వర్ణాశ్రమ ధర్మములు సాధారణముగ

నుండవు. ఘోర సత్వమునందందఱును ధర్మపరాయణులుగను, సత్యవాదులుగను, ఈర్ష్యాదంభరహితులుగను నుందురు. కావున నచ్చట వర్ణాశ్రమ ధర్మములవసరమే యుండదు. ఘోర కలి కాలము రాఁగానే అందఱ బుద్ధులు తమోగుణముచే వ్యాపించును. ఆ సమయమున వారు తమోగుణ ప్రాధాన్యముకల మూఢులై అధర్మమును ధర్మముగ భావింతురు. వర్ణాశ్రమ ధర్మమభ్యున్నతికి బాధకమను కొందరు. వర్ణభేదమే వారవనతికి మూలకారణమనుకొని దానిని వినాశ మొనర్చుటకుఁ బ్రయత్నింతురు. సత్వగుణ ప్రకాశము లేకపోవుటచే నందఱిబుద్ధి తమోగుణావృతమై యుండును. అందువలన వర్ణాశ్రమధర్మము ఛిన్న భిన్నమగును. మిలిగిన యుగములన్నిటిలో వర్ణాశ్రమ ధర్మ ప్రాధాన్యముకలదు. కావున మాకడ వర్ణాశ్రమ ధర్మ శ్రవణ మొనర్చుటలో ననంత మహాత్మ్యము కలదు. ప్రతి నిత్యము వర్ణాశ్రమ ధర్మములను శ్రవణము చేయవలయును. మనకు వర్ణాశ్రమ ధర్మములు లేని కథలేదు, వార్తలేదు, పురాణములేదు, ఏకథకైనఁ గానిండు, ఏ వార్తయైనఁగానిండు, దానిలో వర్ణాశ్రమ ధర్మ చర్చలేనంత వఱకది పూర్ణముకాదు.

పరీక్షిన్మహారాజు శుకదేవుని నిట్లు ప్రశ్నించెను :- "స్వామీ ! ధర్మరాజు ప్రహ్లాదచరిత్ర వినిన తరువాత మీతండ్రియగు వ్యాసుని గురువగు నారదుని నేయే ప్రశ్నలడిగెను. కృపతో వానిని మీరు నాకు చెప్పవలయును."

ఇది విని శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా ! నృసింహభగవానుని చరిత్ర సమాప్తముకాఁగానే ధర్మరాజు నారదు నిట్లడిగెను ;- "ప్రభూ ! నేను సనాతన వైదిక వర్ణాశ్రమధర్మ వ్యవస్థను వినఁదలఁచుచున్నాను. ఏ వర్ణమునకు నేయాశ్రమమున కేయే ధర్మములు కలవు. దీనిని నాకుఁజెప్పుఁడు."

నారదుఁడిట్లనెను ;- "రాజా! నీవు నన్నే యివన్నియును నడిగెదవేల ?"

అంత ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! ఈ విషయమున బాగుగా నెఱిఁగిన వారెవరు ? సర్వధర్మ ప్రవర్తకుఁడు బ్రహ్మయే. మీరు వారి మానసిక పుత్రులు. సాధారణ పుత్రులునుగారు. తపో, యోగ, సమాధులలో నుత్తములగుటచే సర్వ శ్రేష్ఠపుత్రులరు. మిమ్ము సమస్త శ్రేణులవారు సమాన భావముతో నాదర సత్కారము లొనర్చుచుందురు, మీరు భగవద్భక్తులు, ప్రభుపరాయణులు, దయాళువులు, సదాచారులు. బాలబ్రహ్మచారులు. శాంత స్వభావులు, గుహ్యజ్ఞానులు, వర్ణాశ్రమ ధర్మరహస్యమును మీకు తెలిసినట్లింకెవరికినిఁ తెలియదు."

అంత నారదుఁ డిట్లనెను :- "మంచిది. రాజా ! నేను స్వయముగ సాక్షాద్భగవన్ముఖమునుండి వినిన వర్ణాశ్రమ ధర్మ రహస్యమును నీకు జెప్పెదను."

అంత ధర్మరాజిట్లనెను :- "మీరు భగవన్ముఖమునుండి యెచ్చట వింటిరీ ధర్మములను ?"

ధర్మరాజడిగిన యీ ప్రశ్నకు సమాధాన మొసంగుచు నారదుఁడిట్లనెను ;- "రాజా ! ధర్మమునకు పదముగ్గురు పత్నులలో మూర్తియను పత్నికూడ కలదు. ఆమె నుండియే భగవంతుఁడు నరనారాయణావతారమును ధరించెను. వారిద్దరును బదరికాశ్రమమునకుఁబోయి ఘోరతపోనిరతులైరి. వారి చరణ సన్నిధినిఁ గూర్చుండి వర్ణాశ్రమ ధర్మములను వింటిని. ఆ నర నారాయణులకు నమస్కరించి నేనీ ధర్మములను జెప్పెదను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! ఇట్లు పలికి నారద భగవానుఁడు మునుముందుగా మనుష్యమాత్రున కుండవలసిన ధర్మములను జెప్పెను. ఏ వర్ణమువాఁడైనను, నేదేశమువాఁడైనను, నేమతమువాఁడైనను, నేసాంప్రదాయము వాఁడైనను నీ ముప్పది లక్షణములు గల ధర్మములను బాలింపవలయును. ఆ ముప్పది యివి :- 1) సత్యము పలుకుట 2) ప్రాణులందు దయకలిగి యుండుట 3) యథాశక్తిగాఁ దపమొనరించుట 4) పవిత్ర ప్రవర్తనము 5) సహనము కలిగియుండుట 6) యుక్తాయుక్త విచారము 7) మానసిక శాంతి కలిగియుండుట 8) ఇంద్రియముల దమన మొనర్చుట 9) ఏ ప్రాణిని యథా సాధ్యముగ హింస చేయకుండుట 10) బ్రహ్మచర్య వ్రతమును యథాస్థితిలోఁ బాలనమొనర్చుట 11) త్యాగ భావము కలిగి

సన్న్యాసమను నాలుగాశ్రమములు కలవు. అధ్యయన, అధ్యా పన, దానమును గ్రహించుట, దానము నొసంగుట, యజ్ఞము నొనర్చుట, యజ్ఞమును జేయించుట యను నీయాఱు కర్మములు బ్రాహ్మణకర్మములు. క్షత్రియునకు అధ్యయనము, దాన మొసంగుట, యజ్ఞమొనర్చుట, ప్రజలను బుత్రులవలెఁబాలిం చుట, వారినుండి పన్నులను గ్రహించి వృత్తిని నిర్వహించు కొనుట ముఖ్య కర్మములు. అధ్యయనము, దాన మొసంగుట, యజ్ఞమొనర్చుట, బ్రాహ్మణ క్షత్రియుల కనుకూలముగ వర్తిం చుట, కృషి, గోరక్ష వాణిజ్యములద్వారా జీవించుట ఇవి వైశ్యునకుఁ బరమధర్మములు. ద్విజులకు శ్రద్ధాభక్తులతో సేవ యొనర్చుటయే శూద్రులకు బరమధర్మము. వారికి వారి యజ మాని నుండి జీతభత్యములు రావలయును.

శమము, దమము, తపము, శౌచము, సంతోషము, క్షమ, సరళత్వము, జ్ఞానము, దయ, భగవత్పరాయణత్వము, సత్యాచరణము, ఇవియే బ్రాహ్మణ లక్షణములు, బ్రాహ్మణులకీ గుణములు స్వభావముగ నుండును. శూరవీరత్వము, పురుషా ర్థము, ధైర్యము, దేజస్విత, త్యాగము, మనోజయము, క్షమ, బ్రాహ్మణభక్తి, అనుగ్రహము, ప్రజారక్షణ మొనర్చుట ఇవి క్షత్రియలక్షణములు, దేవతాగురుభక్తి, భగవద్భక్తి, ధర్మార్థ కామములకుఁ బుష్టియొనర్చుట, ఆస్తికత్వము, నిత్యమును వ్యాపారాది ప్రయత్నములొనర్చుటయును, వ్యవహార కుశల త్వము, ఇవి వైశ్యుని లక్షణములు. ఉచ్చవర్ణముల వారికి విన

ప్రముతై యుండుటయుఁ, బవిత్రతయు, నిష్కపటభావముతో స్వామిసేవ, పౌరాణికమంత్రములచే యజ్ఞాదులొనరించుట, ప్రియ సత్యముపలుకుట, దొంగతనమును జేయకుండుటయు, ప్రయత్నముతో గోబ్రాహ్మణులను రక్షించుటయును శూద్ర ధర్మములు.

సీ. నిలయము పాటించి నిర్మలదేహియై
శృంగారమే ప్రొద్దుఁజేయవలయు
సత్య ప్రియలాప చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమరంజింపవలయు
దాక్షిణ్య సంతోష ధర్మ మేధాదుల
దైవతమని ప్రియుదలఁపవలయు
నాథుఁడే పద్ధతి నడచు నాపద్ధతి
నడచి సద్బంధుల నడపవలయు.

ఆ॥ మార్దవమునఁ బతికి-మజ్జన భోజన
శయనపాన రతులు జరుపవలయు
విభుఁడు పతితుఁడైన వెలఁది పాతివ్రత్య
మహిమఁబుణ్యుఁజేసి మనుపవలయు.

క॥ తరుణి తన ప్రాణవల్లభు,
హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరికై వడి వర్తించును
హరిలోకమునందు సంతతానందమునన్.

క॥ ఉపవాసంబులు వ్రతములుఁ,
దపములు వేయేల భర్త దైవతమని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి,
నృపవర దుర్లభములేదు నఖిల జగములన్॥

పతిసేవయందే సదా తత్పరత్వంబు గలిగి యుండు టయుఁబతియెడల సదా ఆదరభావముంచి ప్రేమతో వర్తించుట యును, నెవ్వరిని ద్వేషింపకుండుటయును, బోట్లాడకుండుటయు స్త్రీలకు ముఖ్యమగు ధర్మములు, శూద్రేతరులగు జాతులు తమ వంశపారంపర్యముగ నే ధర్మము నాచరించుచున్నారో దొంగ తనమును, హింసను వదలి ఆచరించు చుండవలయును. మా తండ్రి దొంగతనము చేసినాఁడు, వధ చేసినాఁడు నేనును జేయు దుననరాదు. ఇవి పైతృక కార్యములైనను వీనిని వదల వల యును. తండ్రి నాటకాదులలో స్త్రీ పాత్రను ధరించుచుండినచో నిట్టి పైతృక వృత్తిని విడుచుట దోషము కాదు. ఇట్టివికాక మిగి లిన పైతృక ధర్మముల నాచరించుట పరమ ధర్మము.

సంక్షేపముగ వర్ణధర్మములను జెప్పితివి. ఇప్పుడిఁక నాశ్రమ ధర్మములను వినుఁడు. బ్రహ్మచారికి ముఖ్య ధర్మము బ్రహ్మచర్యమును బాలించుట, అగ్ని, దేవ, గురుసేవలొన ర్చుట. నిరంతరమధ్యయన మొనర్చుట పరమధర్మము, గృహస్థధర్మములు విభజించి తిసుట, దేవ, ఋషి, పితౄణ

ములనుండి విముక్తినిఁ జెందుటయును, సంధ్యాతర్పణ, అగ్ని హోత్రాది పంచ మహాయజ్ఞము లొనర్చుటయును, యాచకులకు యథాశక్తిగనన్నమొసంగుటయును యథాశక్తిగా దేవతాపితర నిమిత్తమై యజ్ఞము లొనర్చుటయు నైయున్నవి. వాన ప్రస్థుని ముఖ్యధర్మములివి :- ఘోరతపోనిరతుఁడగుటయు, వనము లలోనుండి కంద, మూల, ఫలాదులపై జీవించుటయు, శరీరమును శుష్కింపఁజేయుటయు, చలికాలములోఁ దడిగుడ్డలనుధరించు టయును ఎండకాలములోఁ బంచాగ్ని మధ్యమునను వర్షకాల ములో వర్షములో నిలుచుండియును దపస్సును జేయవలయును. అగ్నిహోత్రమును విడువరాదు. వృద్ధావస్థవచ్చి, జ్ఞానము కలిగి వచో సన్న్యాసమును స్వీకరింపవలయును. ప్రాణులకుదా నభయ మొసంగవలయును. ఏ వస్తువును సంగ్రహింపరాదు. నిరంత రము ధ్యాన నిమగ్నుఁడు కావలయును. ప్రాపంచిక సుఖము లను సర్వదా మిథ్యలుగ భావింపవలయును. ఎవ్వరితోడను వాద వివాదములొనర్పరాదు. ఏదైనఁ బక్షమును గ్రహించి వితండ వాదము లొనర్పరాదు. ఇవి సన్న్యాసికి ప్రధాన లక్షణములు, అవధూతకు శోకదుఃఖములుండవు. అతఁడు నిర్ద్వంద్వుఁడుగను, నిర్మముఁడుగ నుండి జగత్తున బాలునివలెఁ జరించును.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! నారదమహర్షి యీ విషయములను జాలవిస్తారముగఁ జెప్పినాఁడు కాని నేనత్యంత

సంక్షేపముగ సారాంశ మాత్రముగఁ జెప్పితిని. ఇచ్చటఁగథా ప్రసంగములో దీనిని విస్తరించినచోఁ గథా ప్రవాహమాగి పోవును. అందువలన నిచ్చట నేను గేవలము దిగ్దర్శన మాత్ర ముగఁ జెప్పితిని. భగవదేచ్ఛ యున్నచో నన్య ప్రసంగమున దీనిని విస్తారముగ వర్ణించెదను.

మునులారా ! ఈ విధముగ దేవర్షియగు నారదుఁడు యుధిష్ఠిరుని ప్రశ్నలన్నిటికినిఁ బ్రత్యుత్తర మొసంగెను. తద నంతరము ధర్మరాజు మిక్కిలి భక్తి భావముతో నారదునిఁ బూజించెను. ప్రక్కన గూర్చుండిన దేవకీనందనునకును మరలఁ బూజలొనర్చెను. ఈ విధముగ నారదుఁడు ధర్మ రాజుచే మిక్కిలి సత్కృతుఁడయ్యెను. ఇప్పుడాతఁడు తన స్వరబ్రహ్మ విభూషితమగు వీణను గైకొనెను; భగవంతునకుఁ బ్రణామము గావించి, రామకృష్ణ గోవిందయని పలుకుచు నచ్చటనుండి అందఱును జూచుచుండఁగానే ఆకాశమార్గమున బ్రహ్మలోకమునకుఁబోయెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ ధర్మరాజ నార దసంవాదము పరమపవిత్రమైనది. యశఃకీర్తులను బెంపొందిం చునది. దీనిని శ్రద్ధాపూర్వకముగ నెవరు వినెదరో, లేక పఠించె దరో వారికి మనోవాంఛిత ఫలమవశ్యము ప్రాప్తించును. ఈ

లోకమందు సుఖశాంతి పూర్వకముగ సమస్త సుఖము లనుభ వించెదరు. మరణించిన తరువాత సద్గతినిఁ బొందుదురు. మునులారా ! నేను మీకు నారద ధర్మరాజుల సంవాదమును చెప్పితిని. ఇప్పుడు మీరేమి వినఁగోరుచున్నారు ?"

ఇది భాగవత కథలోని సప్తమ స్కంధమందు
ప్రహ్లాద రెండవభాగము సమాప్తము.

....o....